# చతుర

సంపుటి : 9    జూన్ 1986    సంచిక: 5

## ఈ నెల సమగ్ర నవల

"నేను స్థలం కొని ఇల్లు కట్టాలని దృఢంగా నిశ్చయించుకున్నాను" గంభీరంగా చెప్పాడు ఇంగ్లీష్ లెక్చరర్ కరుణాకరం.

"'ఫూల్స్ బిల్డ్ హౌజెస్, వైజ్ మెన్ లివ్ ఇన్ దెమ్! దద్దమ్మలు ఇల్లు కడతారు, తెలివైన వాళ్లు అందులో అద్దెకుంటారు'' అని మీ గురువు బెర్నార్డ్‌షాగారో, మరెవరో అన్నారని చెబుతుండే వాడివే'' అంటూ అతని మీదా, ఆంగ్ల సాహిత్యంమీదా ఏకకాలంలో కసి తీర్చుకున్నాడు శాస్త్రి.

"'కాదు, వైజ్ బిల్ట్ హౌజెస్, ఫూల్స్ లివ్ ఇన్ దెమ్ - తెలివైన వాళ్లు ఇల్లు కడతారు. దద్దమ్మలు అందులో అద్దెకుంటారు' అని ఇప్పుడు తెలుసుకున్నాను లెండి!'' కరుణాకరం మాటల్లో నిస్సహాయత ధ్వనించింది.

మనిషికి ప్రాణావసరాలైన కూడు, గుడ్డతో పాటు స్వంత




కూడా కనీసావసరమనే నిజాన్ని కరుణాకరం ఏ సంఘటన ద్వారా తెలుసుకున్నాడు?

అతని కలల హర్మ్యం ఎలాంటిది?

దాన్ని నిర్మించుకోవటంలో అతనికెదురైన సమస్యలు ఎలాంటివి?

## రాధామనోహరన్

నేటి మధ్యతరగతి కుటుంబీకుడు ఇల్లు కట్టడంలో ఎదుర్కొనే అడ్డంకులు, పడే వేదనను మనసుకు హత్తుకునేలా కరుణాత్మకంగా వర్ణించిన రచన 'గూడు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల!

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్ : ఎ.ఎమ్.పి. కళావతి

# మీ "చతుర సమీక్ష"



ఇటీవల విశేషంగా పెరిగిన పాఠకాదరణను పురస్కరించుకుని 'చతుర'ను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది మీ పత్రిక 'చతుర'. ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవల బాగోగులను చర్చించే శీర్షిక పేరు **"చతుర సమీక్ష"**.

సాధారణంగా పత్రికలలో సాహిత్యానుభవంగల విమర్శకులచే వివిధ రచయిత(త్రు)ల పుస్తకాలను సమీక్షింపజేయటం రివాజు. కాని 'చతుర'లో ఈ శీర్షికవల్ల ఆ అవకాశం పాఠకులకే లభిస్తుంది. పాఠకులు చేయవలసిందల్లా 'చతుర'లో ప్రచురించే నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులను గురించి రాయవచ్చు!

ఇక ఈ శీర్షికలో పాల్గొనేవాళ్ళు గమనించవలసిన ముఖ్యాంశాలేమంటే: 1. **"చతుర సమీక్ష"**కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపు మాత్రమే రాయాలి; 2. ఆయా సమీక్షలు మాకు ప్రతినెలా 15వతేదీలోపు అందాలి; 3. మీసమీక్షకు తప్పనిసరిగా ఇందులో

ఇస్తున్న కూపన్‌ను జతపరచాలి; 4. కవరుపై "**చతుర సమీక్షకు**" అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపికచేసిన మూడింటిని ప్రచురించి రూ. 100, 75, 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం. జూన్ నెల నవలపై పాఠకుల "**చతుర** సమీక్ష"లు ఆగస్టు సంచికలోనూ, జూలై నవలపై రాసినవి సెప్టెంబరు సంచికలోనూ- ఆ ప్రకారం వరుసగా ప్రచురింపబడతాయని పాఠకులు గమనించాలి.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికను సద్వినియోగం చేసుకునే వంతు పాఠకులదే!

కూపన్.

'చతుర' నవల పేరు ......................

సమీక్షకుని పేరు ......................

చిరునామా ......................

......................

......................

# చతుర కథలు

## ప్రేమా, పెళ్ళీ...

ఆమె, తను చదువుకుంటున్న కాలేజీ ఎగ్గొడుతుంటుంది. అతను, తనుద్యోగం చేస్తున్న ప్రయివేటు కంపెనీలో లాస్ ఆఫ్ పే అయినాసరే సెలవులు పెడుతుంటాడు. వారిద్దరూ అలా ఒకరినొకరు కలుసుకునేంత గాఢ ప్రేమికులు! ఆ గాఢ ప్రేమకు సినిమా థియేటర్లు, హోటళ్ళు, పార్కులలో అనేకమంది ప్రత్యక్షసాక్షులున్నారు. కాకపోతే వారెవరికీ ఆ ప్రేమికుల పేర్లు సుగుణ అనీ,చంద్రావనీ తెలీదు!

అంత గాఢప్రేమలో కూడా వాళ్ళు తమ తమ పరిధుల్లోనే వున్నారు. ముద్దుని మించి ఎప్పుడూ హద్దుల్ని దాటలేదు. దానికి కారణం చంద్రావులో చొరవ లోపించడం కాదు.'ఏరుదాటితెప్పతగలేసే' రకాల్నిగురించి సినిమాల్లోచూసి, నవలల్లో చదివి పెంపొందించుకున్న తెలివితో సుగుణ అతన్ని దూరంగా వుంచడం!

చంద్రావు ఏనాడూ పెళ్ళి వూసెత్తక పోవడం సుగుణ అనుమానాన్ని మరింత బలపరిచింది. కాని, చంద్రావు భయం వేరు. అనుకోకుండా ప్రేమలో అయితే పడ్డాడుగానీ, ప్రేయసే పెళ్ళయ్యాక రాక్షసి అవతారం దాల్చడం అతని స్నేహితులొకరి విషయంలో జరిగింది. ప్రేమించి పెళ్లిచేసుకున్న కొన్ని కేసుల్లో భార్యలు మొగుడికి శ్రోతపాత్రను అప్పగించి, మాట్లాడటాన్ని తామే గుత్తకు తీసుకోవటం చూశాడతను. అందుచే ప్రేమ ముదిరి పాకానపడి పెళ్లి గురించి కలవరించాల్సిన తరుణం వచ్చినా చంద్రావుఅస్పృహలేనట్టుండిపోయాడు. చివరికి సుగుణే పెళ్లి ప్రసక్తి తేవలసి వచ్చింది.

"మన పెళ్ళెప్పుడు చెందూ?" అని అడిగిందామె.

"నీ చదువు పూర్తవాలి కదా!" అన్నాడు చంద్రావు.

ఆపాటి ఆలోచన తనకు లేకపోయి నందుకు నొచ్చుకుంది సుగుణ. 'అవును సుమీ! డిగ్రీ సంపాదిస్తే తర్వాత అది తన కాళ్ళమీద తను నిలబడేందుకు ఉపకరిస్తుంది. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం కావాలని తను డిబేట్లలో గొంతు చించుకుని మరీ వాదిస్తుంది కూడా' అలా అనుకుని డిగ్రీ తెచ్చుకున్నాకే సుగుణ పెళ్ళిగురించి మళ్ళీ కదిపింది.

"నాకు గవర్నమెంటు వుద్యోగం రానీ!" అన్నాడు చంద్రావు.

'నిజమే! అతనికి గవర్నమెంటు ఉద్యోగం వస్తేగానీ సిటీలో ఖర్చుల్ని తట్టుకుని బతకలేం!' అని సమర్థించుకుంది సుగుణ.

చంద్రావు మాట తథాస్తు దేవతలు విన్నట్టుగా, ఆరు నెలలలో అతగాడికి ప్రభుత్వోద్యోగమూ దక్కింది.

చంద్రావు అందుకున్న మొదటి జీతంతో ప్రేయసితో ఖరీదైన హోటల్లో మంచి పార్టీ చేసుకున్నాడు. తర్వాత ఆటోలో చంద్రావు గదికి చేరుకుని ఏకాంతంగా కూర్చున్నారు. వారిమధ్య మాటలేవీ సాగకుండానే ఓ అర్థగంట

# వెలువడినవి!

1. పడమటి సంధ్యారాగం
మల్లాది వెంకట కృష్ణమూర్తి 18-00
2. మిసెస్ పరాంకుశం ,, 15-00
3. మోహనరాగం (డైరెక్ట్ నవల) 'మీరా' లక్ష్మి 18-00
4. శీతాగ్ని (ఆంధ్రప్రభ సీరియల్) చివుకుల పురుషోత్తం 16-00
5. మల్లెమొగ్గలు భట్టిప్రోలు కృష్ణమూర్తి 25-00
(స్వాతివీక్లి నవలల పోటీలో ద్వితీయ బహుమతి పొందిన నవల)
6. పదహారేళ్ళ అమ్మాయి వసుంధర 16-00
7. నవ్వితే నవ్రత్నాలు మల్లిక్ 16-00
8. తెలుగులో చిత్రకవిత్వం 75-00
డా॥ గాదె ధర్మేశ్వరరావు
9. జీవిత చరిత్రకోశం డా॥ వెలగా వెంకటప్పయ్య 45-00
(గ్రంథాలయ కార్యకర్తలు)
10. బడిమెట్లు కస్తూరి నరసింహారావు 3-75
(1,2 తరగతుల కుపయుక్తము)

## తప్పక చదవండి!

N. B. :- అడ్వాన్సులేని ఆర్డర్లు అంగీకరింపబడవు.

## శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్
మ్యూజియం రోడ్డు :: విజయవాడ - 520 002




గడిచింది. సుగుణ గోడలూ వాటిమీద కాలండర్ బొమ్మలూ చూస్తోంది.

"ఏమిటి డార్లింగ్... ఏమీ మాట్లాడవు?" అన్నాడు చివరికి చంద్రరావు.

"మాట్లాడటానికి ఏమీ లేనప్పుడు ఏం మాట్లాడాలి?" ఎదురు ప్రశ్న వేసింది సుగుణ.

"మాట్లాడటానికి ఏమీలేదా? లేనప్పుడు నిజంగానే నువ్వేమీ మాట్లాడవా?"

"బాగుంది... ఏం మాట్లాడతాను?"

చంద్రరావు మొహంలోకి మెరుపొచ్చింది.

"పెళ్ళయ్యాక కూడా ఈ విషయంలో నీలో మార్పు వుండదా?"

"ఉండదు! అసలా మార్పెలా వస్తుంది?"

ఆ మాటతో తన సందేహాలన్నీ టీపీ పక్కకునెట్టి ఎగిరి గంతేశాడు చంద్రరావు.

"అయితే, మనం పెళ్ళి చేసుకుందాం!'' అనేశాడు అర్జంటుగా.

# రెట్టింపు

సోషల్ మేస్టారు చిదంబరం పాఠం చెప్పడం ముగించాడు. కాని ఆ పీరియడ్‌కి ఇంకా కొంత టైమ్ మిగిలివుంది. యథా ప్రకారం ఆ ఖాళీని సద్వినియోగం చేసుకునేందుకు చిదంబరం కుర్చీలో వెనక్కువాలి నిద్రకి ఒరిగాడు.

అదే అదనుగా పిల్లలు కబుర్లు మొదలుపెట్టారు. గుసగుసలుగా మొదలైన ఆ కబుర్లు సహజంగానే కాసేపటికి రణగొణధ్వనిగా మారినై.

దాంతో చిదంబరానికి నిద్రాభంగమై లేచి "సైలెన్స్!" అని గావుకేక పెట్టాడు.

గొడవ సద్దుమణిగింది.

"కాసేపు ప్రశాంతంగా నిద్రపోనివ్వరు గదా, పాడు మొహాలు! లోకజ్ఞానానికి సంబంధించిన ప్రశ్నలడుగుతాను. కాస్త తెలివితేటల్తో జవాబులు చెప్పి మెదడుకి పదును పెట్టుకోండి" అన్నాడు చిదంబరం.

"అడగండి మేస్టారూ!" పిల్లలలో ఉత్సాహం రేకెత్తింది.

"మనిషికి కాళ్లున్నది ఎందుకో చెప్పండి!"

జవాబు నేను చెబుతానంటే, నేనంటూ పిల్లలంతా లేచి నిలబడ్డారు.

చిదంబరం, "కుదురులేని కుంకల్లారా" అని వాళ్ళనితిట్టి, "అందరూ కూర్చోండి! ఒక్కొక్కరూ లేచి చెప్పండి!" అన్నాడు.

"గజ్జెలు కట్టుకోవటానికి" అంది 'గజ్జెల గుర్రం' అని పిలవబడే ఓ పిల్ల.

"బూట్లు వేసుకోవడానికి!" అన్నాడు ఓ పిల్లవాడు. రోజూ స్కూలుకి బూట్లు వేసుకొచ్చేది వాడొక్కడే.

వాళ్లిద్దరి జవాబులూ తప్పేనన్నట్టు చిదంబరం తల అడ్డంగా వూపాడు.

మరొక పిల్లాడు లేచి, "కాళ్లు ఎందుకంటే పేడ, బురద అలాంటివి తొక్కితే కడుక్కోడానికి" అన్నాడు

క్లాసంతా గొల్లున నవ్వులు,

"బుడుద్దాయిల్లారా....ఆపండి!" చిదంబరం అరిచి, "కాళ్లున్నది నడవడానికి! ఇంత సులభమైన ప్రశ్నకి ఏ వెధవా సమాధానం చెప్పలేకపోయాడు గానీ. నవ్వుతున్నారా?" అన్నాడు.

"మీరు చెప్పారుకదా మేష్టారూ!" అన్నారు వెనకనుంచి ఎవరో.

"తెలివితేటలు ఉపయోగించి జవాబులు చెప్పమన్నారని అలా చెప్పాను. లేకపోతే మనకి మాత్రం తెలీదూ...కాళ్లున్నది నడవటానికని!" పక్కన కూర్చున్న పిల్ల చెవిలో గొణిగింది 'గజ్జెల గుర్రం'.

"ఇప్పుడు హిస్టరీకి సంబంధించిన ప్రశ్న అడుగుతాను చెప్పండి" అంటూ, "మహాత్మాగాంధీ 1869లో పుట్టాడు. మనకు స్వాతంత్ర్యం 1947లో వచ్చింది. దీన్నిబట్టి నా వయసెంతో చెప్పగలరా?" అన్నాడు చిదంబరం.

పిల్లలకి ఆ ప్రశ్న గందరగోళంగా వుంది. పైగా హిస్టరీకి, మేస్టారి వయసుకి గల సంబంధమేమిటో అసలే అర్థం కాలేదు. దాంతో నిశ్శబ్దంగా వాళ్లు ఒకరి మొహాలొకరు చూసుకోసాగారు.

కాసేపయ్యాక ఓ పిల్లవాడు లేచాడు- "నేను చెబుతాను మేస్టారూ!"

అందరి తలలూ అటు తిరిగాయి.

"నీకు జవాబు తెలిసిందా?" అడిగాడు చిదంబరం.

"తెలిసింది మేస్టారూ!"

"అయితే చెప్పు"

"మీ వయసు నలభై ఆరేళ్లు"



చిదంబరం ఆశ్చర్యపోయి, "హార్నీ? ఎలా కనుక్కున్నావురా నువ్వు?" అన్నాడు.

"ఎలా అంటే మా బాబాయి వయసు 23ఏళ్లు. ఆయనకి ఇలాంటి తలాతోకలేని ప్రశ్నలే వేయటం అలవాటు. అలాంటి వాటిల్లో మీ బుర్ర రెట్టింపు పనిచేస్తోందని మీ ప్రశ్నలనుబట్టి అర్థమైంది సార్!" అన్నాడా పిడుగు.

# నిద్రాభంగం

సర్వేశ్వరం లేచి మైకు అందుకునేసరికి అంతవరకూ వేదికమీద కూర్చున్నందుకు తమకు తామే ఏవో గొప్పల్ని ఆపాదించుకుని ప్రేక్షకుల్ని చీమల్లానూ,దోమల్లానూ చూసిన పెద్దలు గతుక్కుమన్నారు. ఇప్పుడు వాళ్లకి ప్రేక్షకులెంత అదృష్టవంతులా అన్పించింది.

ప్రసంగం నచ్చకపోతే వాళ్ళు హాలులోంచి లేచి వెళ్ళిపోవచ్చు. పిల్లికూతల్లాంటి అల్లర్లతో వక్త నోరు మూయించవచ్చు. ఆ ఏసీ హాలుని వదలకుండా ఇంకాసేపు గడపదలచినవాళ్లు పక్కవాళ్ళతో బాతాఖానీ వేసుకోవచ్చు - ఇలా ఏదైనా తమ ఇష్టప్రకారం చేయవచ్చు!

కాని, వేదికపైన వున్నవాళ్ళకి అలా కుదరదే! ఎవరి ప్రసంగమైనా, అది ఏరీతిలో సాగినా చచ్చినట్లు వినాల్సిందే. వినలేకపోతే వింటున్నట్లు నటిస్తూ, అప్పుడప్పుడూ మొహాలపైకి మందహాసాన్ని అరువు తెచ్చుకోవల్సిందే!

సర్వేశ్వరం సభాకీచకుడిగా పేరు పడ్డవాడు. మైకు పట్టుకుంటే అతన్ని ఇవతలికి లాగడానికి బృహత్ప్రయత్నం అవసరం. అందుకే వక్తల్లో అతని పేరు చివర చేర్చారు. మొదటే అతన్ని మాట్లాడనిస్తే సభంతా రసాభాస అయి, ప్రేక్షకులు నిండుకుంటారని!

తనవంతు వచ్చేవరకూ మైకువంకే తదేకంగా చూపులు నిలిపిన సర్వేశ్వరం, మైకు దగ్గరికి చేరగానే వీరావేశంతో- "అసలు మాట్లాడటమే ఓ కళ!" అంటూ ప్రారంభించాడు.

"అది తమకు ఎంత తపస్సుచేసి, ఎన్ని జన్మలెత్తినా అలవడకపోవటం అన్యాయం" ప్రేక్షకుల్లోంచి ఎవరో అరిచారు.

అలాంటివాటికి ఎప్పుడూ బెదరని సర్వేశ్వరం స్థిరచిత్తంతో ప్రసంగాన్ని కొనసాగించాడు. ముందుగా తనను ఆ సభకు వక్తగా ఆహ్వానించిన సన్మాన సంఘాన్ని పొగిడాడు. సన్మానితుడి గుణగణాలను కీర్తించాడు. అలా అరగంటసేపు ఎవరినో ఒకరిని పొగడటంతోనే సాగింది.

ప్రేక్షకులొక్కొక్కరే లేచి నిష్క్రమిస్తున్నా సర్వేశ్వరానికి పట్టలేదు. చివరికి ప్రేక్షకులకంటే తామే ఎక్కువమంది వుండటం గమనించిన వేదికపైవాళ్లు సర్వేశ్వరాన్ని శాంతింపజేసే ప్రయత్నం ప్రారంభించారు.

"ఈ మాట్లాడటం అనేది నాలో ఎంతగా జీర్ణించుకుపోయిందంటే, నేను నిద్రలో కూడా మాట్లాడగలను ... ఉపన్యసించగలను" అని సర్వేశ్వరం అంటుండగా, ఆఖరి ప్రేక్షకుడు లేచాడు.

వెళ్తూ, వెళ్తూ అన్నాడతను- "అలాగా!నేను నిద్రలో కూడా వినగలను. అందుకే వినలేక పారిపోతున్నాను"

— జాకీ



తాజాదనం రోజంతా
నిలిచేలా ఉంచండి.
కొత్తది
Godrej
NEW CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP
సింథాల్‌లో ఇప్పుడు మనసమోహక కొత్త పరిమళం కలదు.
దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావ
వంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి,
మిమ్ములను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.
CHAITRA-B-G-330 TEL
కేవలం సింథాల్
మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.
Godrej ఉత్పాదన

...రపల్లి

అందమయిన లోహపు అక్షరాలు బంగళా కాంపౌండ్‌వాల్ మీద మెరుస్తున్నాయి.

గూర్ఖా గేటు తెరిచాడు.

ఖరీదయిన కారు లోపలికి దూసుకుపోయింది. పోర్టికోలో మెట్లకిరువైపులా కుండీలలో క్రోటన్ మొక్కలు! అందమయిన రంగురంగుల, వింతవింత డిజైన్ల ఆకులు.

ఎదురుగా వున్న స్థలంలో-

ఆకుపచ్చ తివాచీ పరిచినట్లు-లాన్!

దానిమీద వానజల్లులా ... నీళ్ళు ... డబ్బాతో చిలకరిస్తున్నాడు తోటమాలి.

కారులోంచి హుందాగా దిగాడు కరుణాకరం.

తలుపుతీసి ... అన్నపూర్ణకి చెయ్యి అందించాడు. దేవలోకంనుంచి, భూమిమీదకి దిగివచ్చిన రతీమన్మధుల్లా వున్నారా దంపతులు.

"స్వగృహానికి స్వాగతం! హృదయరాణికి సుస్వాగతం" అన్నాడు కరుణాకరం అన్నపూర్ణతో. ఆమె చిరునవ్వు చిందించింది.

మెట్లెక్కి లోపలికెళ్ళారు.

విశాలమయిన వరండా...

ఊదారంగు డిస్టెంపర్ కొట్టిన గోడలు.

లేత నీలంరంగు గాజుపలకలు బిగించిన కిటికీలు!

కిటికీలకి ఖరీదైన సిల్కు తెరలు.

గాలికి అటూ ఇటూ కదులుతున్న ఆ తెరలు అతిథులను ఆహ్వానిస్తున్నట్లున్నాయి.

వరండా మధ్యలో-

నల్లనేరేడు చెక్కతో చేసిన పెద్ద కుర్చీలు...

వాటిలో మెత్తలు!

చిన్న టీపాయిమీద పత్రికలు, మాగజైన్లు, వరండా మూలగా మరో బల్ల. దానిమీద సన్నటి పొడుగాటి పూలకుండీ పక్కనే చలువరాతితో చేసిన వినాయకుడి బొమ్మ.

వరండా తర్వాత విశాలమయిన గది.

లివింగ్ రూం!

గవ్వలతో, శంఖాలతో, పూసలతో చేసిన తెర ఆ గదిని సరిగ్గా రెండు భాగాలుగా విడదీసింది. ముందు భాగంలో వరుసగా పేముమోడాలు! వెనుక భాగంలో డైనింగ్ టేబుల్, కుర్చీలు.

ఆశ్చర్యంతో అన్నపూర్ణ కళ్ళు ఇంతలేసి అయ్యాయి.

ఆనందంతో కరుణాకరం మొహం స్ఫటికంలా మెరిసింది.

'దుండగదప' నుంచీ తెప్పించిన తివాచీ మెత్తగా కాళ్ళకి తగులుతోంది.

టీ.వీ మీద-

ఫోటో ఫ్రేంలో-

కరుణాకరం, అన్నపూర్ణల పెళ్ళి ఫోటో!

లివింగ్ రూం పక్కన పడకగదులు. డెకోలాంతో చేసిన డబుల్‌కాట్ మీద మెత్తటి పరుపూ, చక్కటి డిజైన్‌తో బెడ్‌షీటు! తలగడలు!

గోడలకి వున్న అలమార్లనిండా పుస్తకాలు. షేక్స్పియర్ నుంచి ఆర్.కె. నారాయణ్ దాకా కాళిదాసు నుంచి కరుణాకరందాకా. నన్నయ నుంచి నండూరిదాకా. పక్కన పిల్లలకు ప్రత్యేకమయిన గదులు.

హిమబిందు – రవిశంకర్ [illegible] వాదనం కాసెట్టు వినిపిస్తోంది.

ఏకపేర-ఎంతకి అప్పని [illegible]

చమవుతోంది.

బాబిగాడు – సినిమా పత్రికల్లో లీనమయ్యాడు.

గృహిణికి పనిభారం తగ్గించే ఆధునిక సౌకర్యాలన్నీవున్న వంటిల్లు...!

పెరటితోటలో కనకాంబరాలు, గులాబి మొక్కలే ఎక్కువున్నాయి!

కనకాంబరాలంటే అన్నపూర్ణకి ప్రాణం.

గులాబీలంటే కరుణాకరానికి ప్రీతి.

ఆ పూలతోట మధ్యగా ఒక కాలిబాట. కాలిబాట చివరన ఒక మెట్లకోట. ఆ కోట మీద ఊగుతున్న ఉయ్యాలపీట. దానిమీద శేషతల్పశాయిలా పవళించాడు కరుణాకరం.

సాగరతనయలా కాళ్లు వత్తుతోంది అన్నపూర్ణ.

"ఏమండీ!" గోముగా పిల్చింది అన్నపూర్ణ.

"ఏమిటి ..." మత్తుగా పలికాడు కరుణాకరం.

"ఈ బంగళా కట్టటానికి ఎంతయిందండీ?"

"పదిహేను లక్షలు"

"అమ్మబాబోయ్...అంత డబ్బు ఎక్కడనుంచి వచ్చిందండీ?"

"అప్పుచేస్తే వచ్చింది"

"అప్పే!"

"అప్పే!!"

ఆ సమయంలో-

ఆ క్షణంలో సగంలో-

ఆ దృశ్యం–

అదృశ్యం–

కాదు-అదృశ్యం ఫ్రీజ్ అయిపోయింది.

దూరంగా జనం పరుగెత్తుకొస్తున్నారు.

ఎవరండీ, ఎవరు వాళ్ళు?

ఎవరు వాళ్లు?

వాళ్ళు ఎవరు?

ఎవరెవరెవరెవరు?

ఒకళ్ళు ఇద్దరవుతున్నారు.

ఇద్దరు నలుగురవుతున్నారు.

నల్గురు ఎనిమిదిమందవుతున్నారు.

అప్పులా-

అప్పుమీద వడ్డీలా-

అప్పుమీద వడ్డీమీద వడ్డీలా!

వడ్డీమీద వడ్డీమీద చక్రవడ్డీలా-

అప్పు ఇచ్చినవాళ్ళు!

"కరుణాకరం...మా డబ్బు మాకు ఇచ్చెయ్యి!"

అరుపులు...కేకలు...గావుకేకలు.

కరుణాకరానికి వళ్ళంతా చెమటపట్టింది.

గొంతుమీద ఎవరో కూర్చున్నట్లు-

బాధగా – బరువుగా-భయంగా-ఇబ్బందిగా –

"నేను తీర్చలేను...అప్పు తీర్చలేను"

గట్టిగా పలవరించాడు కరుణాకరం.

అదిరిపడి లేచింది అన్నపూర్ణ.

"ఏమిటండీ...ఆ పలవరింతలు?!"

"కల...పూర్ణా...కల" గొణిగాడు కరుణ.

"లెండి ... లేచి ఈ మంచినీళ్లు తాగండి"

"మామూలు కలే...రోజూ వచ్చేకలే! ఇల్లు కట్టుకున్నాం...ఇల్లు" చెంబుడు నీళ్లూ గటగటా తాగేసాడు కరుణాకరం.

"ఈ కలకలగానే వుండిపోతుందేమో!"

"తెలీదు...నాకూ తెలీదు" అటువేపు తిరిగి దుప్పటి నిండుగా కప్పుకుని పడుకున్నాడు కరుణాకరం.

* * *

"హలో" అంటూ అడుగుపెట్టాడు


మధురమైన రుచులన్నీ
ప్రియలోనే వున్నయ్!
priya
మీరు కోరుకొనే రకరకాల పచ్చళ్ళు మీ కందిస్తుంది-ప్రియ. మరపురాని రుచిరానుభూతులతో రూపొందినవే ప్రియ పచ్చళ్ళు. ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకు వెళ్ళండి.
ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్
Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED
ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ
Kiron/PF/833

కరుణాకరం లక్ష్మీపతిని చూస్తూ.

కాని అతను విన్పించుకోలేదు.

స్టాఫ్‌రూం హడావుడిగా, గందరగోళంగావుంది. అది మూడు గ్రూపులుగా విడిపోయివుంది. త్రీరింగ్ సర్కస్‌లోలా ఏ రింగులో ఫీట్స్ ఆ రింగులో జరుగుతుంటే ఏది చూడాలో తెలీక తల అటూ ఇటూ తిప్పే ప్రేక్షకుడిలా కన్‌ఫ్యూజ్ అయిపోయాడు కరుణాకరం.

కాసేపయ్యాక అతనికి పరిస్థితి అర్థం అయింది. ఏ ఫీటుకీ సంబంధం లేని బఫూన్‌లా ఫీలయ్యాడు.

ఒక గ్రూప్ యు.జీ.సీ. స్కేళ్ళ గురించి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళకది నిత్యకృత్యం. పాఠం చెప్పటం అనేది సెకండరీ.

రెండో గ్రూప్ రాజకీయాల గురించి–లోకల్, స్టేట్, నేషనల్, ఇంటర్నేషనల్ లెవల్ తేడా లేకుండా కలగాపులగంగా మాట్లాడుకుంటున్నారు. అది వాళ్ళ రక్తంలో జీర్ణించుకుపోయింది.

మూడో గ్రూప్ కరుణాకరం కుర్చీకి దగ్గరగా వున్నారు. వాళ్ళు ఇళ్ళ స్థలాలు, ధరలు, ఏరియాలు, రిజిస్ట్రేషన్ ఖర్చులు వగైరా వగైరాల్ని గురించి మాట్లాడుకుంటున్నారు. ఇదొక కొత్తగా వచ్చిన అలవాటు. అదో వింత జబ్బు. పైగా వదలని జిడ్డు కూడా.

కరుణాకరం తత్వవేత్తలా కూర్చున్నాడు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. మనోవల్మీకంలో బుసలు కొడుతున్న ఆలోచనా బృహత్ సర్పాలను జోకొడుతున్నాడు. అతడు గట్టిగా పీల్చి వదలిన సిగరెట్ పొగ సప్తభుజంగాలు వదిలిన విషధూపంలా వుంది.

కరుణాకరం ట్యూషన్స్ లేని ఓ సామాన్య ఇంగ్లీషు మాస్టారు.

కొందరు లెక్చరర్లకి కామధేనువు లాంటి ట్యూషన్లుంటాయి. కొందరికి కల్పవృక్షాల్లాంటి మామగార్లుంటారు. వాళ్ళు యు.జీ.సీ. గురించి మాట్లాడుకున్నా చెల్లుతుంది. కుళ్ళు రాజకీయాల గురించి పోట్లాడుకున్నా చెల్లుతుంది. కమిటీవాళ్ళు ఏం పట్టించుకోరు. ఎందుకంటే ఆ కమిటీలో కల్పవృక్షాలుంటాయి. వాళ్ళ పిల్లలు ఈ కామధేనువుల దగ్గరే చదువుతుంటారు.

"ధరలు పెరిగిపోతున్నాయి... మనం కొనలేం గురూ" అన్నాడు మేథమేటిక్స్ లెక్చరర్ వీరభద్రం–అదే పాయింటయినట్లూ, దానివల్లే స్థలాలు ఎవరికీదొరకటం లేదన్నట్లూ.

"మన ఊరు త్వరలో కార్పొరేషన్ అవుతుందిట! ఫైలు సి.యం. టేబుల్ మీదుందిట. మొన్న మా కజిన్ అన్నాడు... అదే జరిగితే అప్పుడు అంగుళం కూడా దొరకదు" అన్నాడు పొలిటిక్స్ లెక్చరర్ నరసింహం! తనకి ఎవ్వరికీ తెలీని రహస్యాలు తెల్సినట్లు లోగొంతుతో చెప్పటం, ప్రతి విషయం అదో మహారహస్యంలా చెప్పటం కొందరికో చెడ్డ అలవాటు.

"అప్పుడు రిజిస్ట్రేషన్ ఛార్జీలు కూడా పె[illegible]తాయి. పదకొండు పర్సెంట్‌నుంచి [illegible]దవుతుంది" లక్ష్మీపతి ఎకానమిక్స్ [illegible]ంచాడు – నిజమైన ఆర్థిక శాస్త్ర అధ్యాపకునిలాగా.

"అవునోయ్ లక్ష్మీపతీ .... ఎట్లాగయినా నీ బుర్ర అమోఘం" పొగిడాడు తెలుగాయన అలవాటుగా.

"అసలిందులో ఓ చిక్కుంది.... మీకు తెలీదు. ఇలా కాలం గడిచినకొద్దీ

మనం అసలు స్థలాలు కొనలేం. కారణం తెలా..?" అన్నాడు లక్ష్మీపతి తెలివిగా [illegible]

ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. ఎందు కంటే ఏం చెప్పినా అది కాదని ఇంకోటి చెప్తాడతను.

కరుణాకరం తన మానాన తాను ఆలోచించుకుంటూనే ఈ మాటలు వింటు న్నాడు. సెమినార్ వింటున్న ఫిలాస ఫర్‌లా వున్నాడతను.

"లాండ్ ఈజ్ లిమిటెడ్... మెన్ ఆర్ అన్ లిమిటెడ్... అన్నాడు డేవిడ్ రికార్డో - భూమి పరిమాణం పెరగదు. దాన్ని కొనాలనుకునే జనం మాత్రం క్రిముల్లా, కీటకాల్లా, పురుగుల్లా, చీమల్లా, బాక్టీరియాల్లా లక్షలు...లక్షలు కాదు... కోట్లలో పెరిగిపోతున్నారు. కనుక దిస్ ఈజ్ హైటైం"

లక్ష్మీపతి ఆర్గ్యుమెంట్ అందరికీ నచ్చింది.

పెద్దవాడి పేరు చెపితే ఆ మాటకి విలువ పెరుగుతుంది. ఏం చెప్పారని కాదు ముఖ్యం - ఎవరు చెప్పారనేది ముఖ్యం.

"అలాగయితే అందరం కలిసి ఒక చోట పొలంకొని స్థలాలుగా ప్లాటుచేసి, సొసైటీగా ఫార్మ్ అయి...." తెలుగు మాస్టారు శాస్త్రిగారు గడగడా పద్యంలా చెప్పుకుపోతున్నాడు.

"ఆ పాట్లు మనం పడలేం. ప్లాట్లు వెయ్యడం అంత తేలికైన పని కాదు. దాంట్లో చాలా గొడవలున్నాయి... మీకు తెలీదు"

అది లక్ష్మీపతికి ఊతపదం.

"వేర్ దేరీజ్ ఏ విల్ దేరీజ్ ఎ వే... మనసుంటే మార్గం దొరక్కపోదు'' సిగరెట్ ఆఖరి దమ్ము లాగి సంభాషణలో కల్పించుకున్నాడు కరుణాకరం.

"మన బ. లే. బ. పం. గాడికి కూడా ఈరోజు మూడొచ్చినట్లుంది" వెక్కి రింతగా అన్నాడు లక్ష్మీపతి.

కరుణాకరం మెత్తదనానికి అతడిచ్చిన కితాబు 'బ. లే. బ. పం.'- బతకలేని బడి పంతులు అని.

''మూడూ లేదూ... ఏడూ లేదు. నేను స్థలం కొని ఇల్లు కట్టాలని దృఢంగా నిశ్చయించుకున్నాను" గంభీరంగా చెప్పాడు కరుణాకరం.

''ఫూల్స్ బిల్డ్ హౌజెస్...వైజ్ మెన్ లివ్ ఇన్ దెమ్-దద్దమ్మలు ఇల్లు కడతారు, తెలివైనవాళ్ళందులో అద్దెకు ఉంటారు, అని మీగురువు బెర్నార్డ్‌షాగారో, మరెవరో అన్నారని చెబుతూ వుండేవారే'' కరుణా కరం మీదా, ఆంగ్ల సాహిత్యం మీదా ఒకే సారి కోపం తీర్చుకున్నాడు శాస్త్రీజీ.

''వైజ్ బిల్డ్ హౌజెస్ ఫూల్స్ లివ్ ఇన్ దెమ్- అని ఇపుడు తెలుసుకున్నాను లెండి! అంతేకాదు. ఇల్లంటే కలప, సిమెంట్, ఇనుప ఊచలు కాదు-ప్రేమ.. మమత... అనురాగం అని కూడా అనే వాడిని. కానీ లాస్టియర్ జరిగిన సంఘ టనతో మనసు మార్చుకున్నాను శాస్త్రీజీ"

కరుణాకరం మాటల్లో నిస్సహాయత ధ్వనించింది.

"ఏం సంఘటన ... ఏమిటి మీరనేది...?'' శాస్త్రి పరిస్థితిలోని తీవ్ర తను తగ్గించాలని తాపత్రయపడ్డాడు.

అయితే ఈమాటలు కరుణాకరం చెవిన పడలేదు. కళ్ళు చెమ్మగిల్లాయి. నీటి పొర లోంచి స్టాఫ్ రూం అంతా మసకమసకగా బూజు బూజుగా లైట్ సరిపోని ఫొటోలా, పాడైపోయిన నెగిటివ్‌లా కనిపించింది.

మనసులో గతపు యవనిక తెరుచుకుంది. కాలం వెనుకకు పరిగెత్తింది.

* * *

"శవం ఇంట్లో ఉండటానికి వీల్లేదండి వీల్లేదుగాక వీల్లేదు. అబ్బాయీ కరుణాకరం... వీధిలో పెట్టుకోండి. బైట పెట్టండయ్యా... ఓ షామియానా తెప్పించండి. క్విక్...ఇందులో మరో ఆలోచనకే వీల్లేదు'' ఖరాఖండీగా చెప్పాడు ఇంటాయన. అమానుషంగా ఉంది ఆ ఇంటి ఓనరు ప్రసాదరావుగారి అర్డరు.

"నక్షత్రం కూడా మంచిది కాదు" ఎవరో ప్రసాదరావుగారి తాలూకు ఆడవాళ్ళు గొణిగారు.

మనుషులు ముహూర్తం చూసుకు చావాలంటే భీష్మునిలా స్వచ్ఛంద మరణం రావాలి మరి.

నాన్నగారి శవం.

రోడ్డు మీద ... మురిక్కాలువ పక్కన... నాన్నగారి శవం...

పడక్కుర్చీలో కూర్చొని 'హిందూ' చదివే నాన్నగారు-

లక్నో యూనివర్సిటీలో కొత్త రఘురామయ్యగారితో కలసి ఎం. ఎ., ఎల్.ఎల్.బి. చదివి, నిజాయితీగా, నీతిగా, ఋషిలా, మునిలా, యోగిలా బతికిన నాన్నగారి శవం.

రోడ్డు మీద...

చాపమీద...

మురిక్కాలువ పక్కన...

"వాళ్లు చెప్పినట్లే చేయండి నాయనా" అంది అంత దుఃఖంలోనూ సుందరమ్మ గారు.

ఆవిడకి లోకం పోకడ తెలుసు. జీవితం నేర్పిన పాఠాలు ఆవిడకి వివేకాన్నిచ్చాయి.

కరుణాకరానికి శోకం కట్టలు తెంచుకు ప్రవహించింది.

అద్దె కొంపల్లో వున్నవాళ్ళకి ఇంటి విలువ తెలుస్తుంది ఎప్పుడో ఒకప్పుడు.

ఒకానొక కష్టసమయంలో...

క్షణంలో సగం సేపు ... అంతర్మథనం జరుగుతుంది.

మహామేధావి సర్ హెరాల్డ్ లాస్కీ గ్రామర్ ఆఫ్ పాలిటిక్స్ రాసాడు. ఆయన శిష్యుడు ప్రొఫెసర్ సిద్ధాంత. ఆయన దగ్గర మార్క్సిజం నేర్చుకున్న నాన్నగారి విజ్ఞానం ఎందుకు? ఏమయింది? చివరకు అందరూ ఇంతేనా? ఆయన నాలెడ్జి బూడిదలో పోసిన పన్నీరేనా?

విద్వత్తు ఇపుడు రోడ్డు మీదుంది.

మంచితనం చాప మీదుంది.

ప్రిన్సిపల్సు మురిక్కాలువ పక్కన నిద్రిస్తున్నాయి- భౌతికంగా లేకుండా.

ఈ ప్రసాదరావుగారిలా సవ్యసాచిలా అటూ ఇటూ లంచాలు గుంజి...లంచాల మేడ కట్టలేనందుకు నాన్నగారికి దేవుడేసిన శిక్ష ఇది.

అవును శిక్షే... కఠిన శిక్ష.

నాన్నగారి శవం...రోడ్డు మీద చాప మీద ... దిగ్గంతులు, పండితోత్తములు డాక్టర్ రాధా కమల్ ముఖర్జీ, రాధా కుముద్ ముఖర్జీలాంటి కవలల దగ్గర భారతీయ సంస్కృతి, చరిత్ర సంప్రదాయాలను క్షుణ్ణంగా నేర్చుకున్న నాన్నగారికి ఎంత శాపం...ఎంత శాపం?

ఇల్లు లేనందుకు ప్రజలు నాన్నగారికి చేసిన సన్మానమా ఇది!

"పాపం....ఇల్లు కట్టుకున్నాడుకాదు' అన్నారు నాన్నగారి మిత్రుడొకాయన.

"స్వంత ఇల్లు బతకటానికి అక్కర్లేకపోయినా చావటానికి తప్పక కావాలి"

అంత ఏడుపులోనూ ఎందుకో నవ్వొచ్చింది కరుణాకరానికి.

టెలిగ్రాములు...ఫోన్లు
బంధువులు... స్నేహితులు
ఏడుపులు... పెడబొబ్బలు
కాఫీలు.... టిఫిన్లు
ఏడవటాలు...ఓదార్చుకోవటాలు
అనుభవాలు...జ్ఞాపకాలు
నీటిబుడగ పేలిపోయేంత...





గాజుబొమ్మ పగిలిపోయింది. సినిమాలో విషాదగీతం తర్వాత విరామంలావుంది ఇల్లంతా.

కరుణాకరం ఆ క్షణంలోనే ఒక దృఢ నిశ్చయానికొచ్చాడు. స్వంత గూడంటూ ఒకటి వుండాలి...వుండాలికాదు...వుండి తీరాలి.

అయిపోయింది

అంతా అయిపోయింది

ఇక నాన్నగారు లేరు

ఇల్లంతా నిశ్శబ్దంగా...

భయంగా...బాధగా...

సలుపుతున్న పుండులావుంది.

ఇంట్లో అందరూ దెయ్యంపట్టిన వాళ్ళలా...

శాపగ్రస్తుల్లా....

పూనకం వచ్చినవాళ్ళలా ... భీతావహంగా వున్నారు.

"కాస్త కాఫీ తాగండి" అంది అన్నపూర్ణ.

"వద్దు...కడుపులో దేవుతుంది"

కరుణాకరం కాఫీ వద్దు అనటం అన్నపూర్ణ కాపరానికి వచ్చిన తర్వాత బహుశా ఇదే మొదటిసారి!

"ఎవరో బ్రాహ్మలొచ్చారు" అంటూ వచ్చాడు బాబిగాడు.

"రండి...రేపేం చెయ్యాలి మనం" అన్నాడు కరుణాకరం.

"చేసేదేముంది...కర్మ చెయ్యాలి. చదువుకున్నవాడివి. నే చెప్పాలిటయ్యా కరుణా" భుజంమీదచెయ్యివేసినిమురుతూ అన్నారు పంతులుగారు వాత్సల్యంతో.

పంతులుగారు పతంజలిలాంటివారు.

ఆయనకి యోగం తెలుసు.

ఆయన్నిచూస్తే...ఆర్షసాంప్రదాయానికి మిగిలిపోయిన గుర్తులా వుంటారు.

ఎర్రగా...బొద్దుగా...బాగా పెరిగిన తెల్లటి జుట్టు... తెల్లగడ్డం...బొట్టు...

పాతకాలానికి మిగిలిపోయిన ప్రతినిధి ఆయన.

"మన ప్రసాదం... ఆదేనోయ్ మన ఇల్లుగలాయన కర్మ ఇక్కడ చెయ్యరాదంటున్నాడోయి కరుణా" కుర్చీలో కూర్చుని కండువాతో మొహం తుడుచుకున్నారు పంతులుగారు.

ఆయన దృష్టిలో ... సృష్టిలోని అందరూ మంచివారే.

"మరి మరి... ఎక్కడచేద్దాం" నంగి సంగిగా అడిగాడు. కరుణాకరం.

"సత్రంలో చెయ్యాలి ... కావలసినవన్నీ పట్టికరాసి అన్నయ్యకిచ్చాను. మీ తమ్ముడవన్నీ తేవటానికెళ్ళాడు... క్లుప్తంగా కొద్ది సామానుతో వచ్చేయండి. సత్రంవాడికి నేను చెప్తాను. రెండు గదులిస్తాడు. సరే... నే వస్తాను"

కాశీకి వెళ్తున్న వ్యాసమహర్షిలా వెళ్ళిపోయారు పంతులుగారు.

కరుణాకరం నెత్తిన పిడుగుపడ్డట్టయింది. కాని అతన్ని పట్టించుకున్నవారు లేరు. అపుడే ముగ్గురు తోడికోడళ్లూ సత్రంకి తీసుకెళ్ళాల్సిన సామాను సర్దుతున్నారు. మరమనుషుల్లా కీ ఇచ్చిన బొమ్మల్లా...మాటా పలుకూ లేకుండా అటూ ఇటూ తిరుగుతున్నారందరూ.

చెల్లెలు తల్లిని ఓదారుస్తోంది.

ఈజిప్టులో పిరమిడ్లుకట్టే బానిసల్లా, సింధునుంచీ వలసవచ్చిన కాందిశీకుల్లా, రోడ్లువేసే కూలీల్లా, బొగ్గుగని కార్మికుల్లా కుటుంబం అంతా సత్రంవేపు ప్రయాణమయ్యారు రిక్షాల్లో-మెల్లిగా..దిగులుగా... భారంగా.

"మేం రాం...."అంది పెద్దకూతురు బిందు.

"అవును. మేం రాం...తాతయ్యగారి ఫొటోకి పూజచేసుకుంటూ ఇక్కడే వుండిపోతాం" అంది చిన్నమ్మాయి వీర.

"అట్లా అనకూడదు...రండి" అంది అన్నపూర్ణ.

కరుణాకరం సాహిత్యాభిమానంతో హిమబిందు, ఏకవీర అని పేర్లు పెట్టాడు- ఇద్దరు ఆడపిల్లలకి. బాబిగాడి పేరు కాళిదాసు.

కరుణాకరం చాదస్తానికి అందరూ నవ్వుకున్నారప్పుడు.

'నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు' అనుకున్నాడు కరుణాకరం.

.........

సత్రం అచ్చం సత్రంలాగే ఉంది.

దాని పేరే కర్మల సత్రం.

స్నానాలు చేసేవాళ్ళు వెర్రెత్తినట్లు బకెట్లకి బకెట్లు తలమీద పోసుకుంటున్నారు. అంతా ఉత్తరక్రియలు చేయటానికి వచ్చినవాళ్ళే. ఎక్కడ చూసినా గుళ్ళు... బోడిగుళ్ళు.

నల్లరాతి కట్టడం-చిన్న చిన్న కిటికీలు పొగపోదు. అందరికీ కళ్ళెర్రబడ్డాయి. కళ్ళకలకవచ్చినట్లున్నాయి అగ్నిహోత్రం పొగవల్ల.

ఆడవాళ్ళు వంటలు మొదలుపెట్టారు. పొగెక్కువయింది.

"అటుతిరిగి మీ నాన్నగారు కాశీలో ఉన్నారనుకొని పితృదేవతలకి నమస్కరించి, జంధ్యం అపసవ్యం చేసుకోండి. కాసిని నువ్వులువేసి నీళ్ళు జల్లండి ... మళ్ళీ సవ్యం చేసుకోండి''

పంతులుగారు చెప్పినట్లల్లా మెకానికల్‌గా చేసేస్తున్నారు కరుణాకరం బ్రదర్స్.

అయితే కరుణాకరానికి చాలా దుఃఖంగా ఉంది- తన తండ్రికి ఇలాంటి చోట కర్మ జరపాల్సివచ్చినందుకు. తమకే ఇల్లు ఉంటే...

ఇల్లు కొందరికి లగ్జరీ అయితే, ఇంకొందరికి అవసరం.

కరుణాకరంలో నిలువ నీడకోసం తపన మొదలైంది. సమాజం మీద కచ్చగా ఉంది. మధ్యలో పలకరింపులు ... ఓదార్పులు... నిట్టూర్పులు.

రష్యాలో ప్రభుత్వమే ఇళ్ళిస్తుందట.

కమ్యూనిజం మీద అపారమైన గౌరవం పెరిగింది కరుణాకరానికి.

ఇండియాలో సోషలిజం రాదు, శోష వస్తుంది తప్ప.

ఇక్కడివాళ్ళకి ఇజాలు, నిజాలు అక్కర్లేదు. ఏదో విధంగా బతికెయ్యటమే-జూలో జంతువుల్లా... అనాథల్లా.

దేవాంట్ టు లివ్. వరల్డ్.

అతనికి ప్రపంచం అంతా [illegible] మయంగా, గందరగోళంగా, [illegible] భయంకరంగా కన్పించింది.

తమ్ముడి పిల్లలు చంటి-చిట్టి మాత్రం హాయిగా ఆనందంగా, నిష్పూచీగా సత్రం మధ్యలో ఉన్న ఇసుకలో గూళ్ళు కడుతున్నారు. చిన్న చిన్న చేతులతో తడి ఇసుకని మెల్లిమెల్లిగా ఎత్తుతున్నారు.

ఇల్లు కట్టాలనే 'అర్జ్' అసలు మనిషిలోనే సబ్‌కాన్షస్‌గా ఉందా?

చిన్నపిల్లల్లో అది ఆటలా పైకి కన్పించినా అది నిజం.... పచ్చినిజం.

కర్మ తంతు చివరికొచ్చింది.

"ఇది పుణ్యాహవచనం చేసిన తీర్థం... ఇంటికెళ్ళి అన్ని గదుల్లోనూ జల్లండి''

పంతులుగారు లేచారు- ఖాకీచేతి సంచి తీసుకొని.

ఆయన తన వంతు పాత్ర నిర్వహించారు.

వరండాలో మూలగా ఒక నవారు మంచం అడ్డంపెట్టి దానిమీద పాత దుప్పటి కప్పారు. వెనుక పడుకుసుంది సుందరమ్మగారు. అదొక ఇల్లు. సత్రంలో ఇంప్రొవైజ్డ్ షెల్టర్ ... పెద్దిండ్లలో అవుట్‌హౌస్‌లా... బంగళాలో సర్వెంట్స్ క్వార్టర్స్‌లా...

ప్రపంచం ఒక పెద్ద ఇల్లు.

దేశం ఒక చిన్న ఇల్లు.

రాష్ట్రం మరొక బుల్లి ఇల్లు.

జిల్లా బుచ్చి ఇల్లు.

ఇల్లుకానిది ఏదీలేదు- అన్నీ [illegible]

చివరికి మాత్రం ఆరడుగుల స్థలం చాలు మనిషికి... అదీ ఫిలాసఫీ ఆఫ్ హావుసెస్.

సత్రంలో గడిచిన మూడురోజులూ మూడు యుగాల్లాగా గడిచాయి.

కొన్ని సంఘటనలకు వేగం వస్తుంది. కొన్నిటికి వెలాసిటీపోతుంది టైంగడవదు. నిద్రపట్టదు. దోమలు. ఫాన్‌లేందేపడుకోరు పిల్లలు. చిత్తడి చిత్తడిగా నీళ్ళు. దూరం నుంచీ సినిమా రికార్డుల గోల ... ముఖ్యంగా ఆడవాళ్ళకి చెడ్డ ఇబ్బందిగా ఉంది. అస్సలు ప్రైవసీలేదు. లెట్రిన్స్ ఛండాలంగా ఉన్నాయి. నీళ్ళు కొట్టరు. మురికాల్వలు కడిగించి ఎన్నాళ్ళయిందో? దానినుంచీ వచ్చే దుర్గంధంతో ముక్కులు బద్దలైపోతున్నాయి. నీళ్ళ గదుల్లేవు. ఆడామగా అంతా బహిరంగంగానే స్నానాలు చెయ్యాలి. అక్కడే గుడ్డలు మార్చుకోవాలి. ఎంత జాగ్రత్తపడ్డా ఇబ్బందిగానే ఉంది. నరకం. నరకం ఎక్కడోలేదు...ఇదే ఇదే. ఇక్కడే ఉంది భూలోక నరకం.

"స్వంతిల్లుండాలి" గొణుక్కున్నాడు కరుణ. కొత్తవారు వస్తున్నారు.

పాతవాళ్ళు వెళ్ళిపోతున్నారు.

ఇదొక మజిలీ.

ఇల్లులేనివాళ్ళకి తప్పనిసరి మజిలీ.

ఇది ఎవ్వరూ తప్పించుకోలేని వింత శాపాల మజిలీ. ధర్మోదకాలనాడు .... సత్రం దగ్గిరగా ఉంటుందని, కబురు పెట్టినా రాలేదు ఫ్రెండ్స్. వాళ్ళకేమిటి అవసరం. ఎందుకు రావాలి?

... ... ...

రిక్షాల్లో ఇంటికొస్తుంటే అందరి మనసులూ కొద్దికొద్దిగా తెరిపినపడ్డాయి.

కానీ కరుణాకరానికి ప్రసాదరావు గారింట్లో ఇంకా వుండటం ఇష్టంలేదు. 'పరపైడ్ బాస్టర్డ్ ... రాస్కెల్ ... ఆడంగి వెధవ! పది పైసలు పేవ్‌మెంట్ మీద పడితే ఏరుకుందాం అని చూస్తాడు. కసిదీరా మనసులోనే తిట్టుకున్నాడు కరుణాకరం.

విశాలంగా, ఎత్తుగా పెద్ద పెద్ద న్యూమోడల్ ఇళ్లరోడ్డుకటూఇటూసినిమా సెట్టింగుల్లా ఉన్నాయి. మధ్యలో పది రిక్షాలు... స్వంతిల్లు లేనివారి త్రిచక్ర శకటాలు.

కొందరికి ఇళ్ళు లగ్జరీ.

బాల్కనీ పక్కన పూలకుండీలు.

కిటికీల్లోంచి ఎ.సి. పెట్టెలు కన్పిస్తున్నాయి.

ఏం ఇళ్లు... ఏం ఇళ్లు... కరుణాకరం మనసులో కుళ్లుకున్నాడు.

**2**

...మల్లిగాడు అపర సాంబ శివుడిలా కన్పించాడు. వాడు మాట్లాడుతుంటే ఢమరుకం వాయించినట్టుంది. శివుడిఆజ్ఞ లేకుండా చీమైనా కుట్టనట్టు మల్లిగాడికి తెలియకుండా గజం స్థలం కూడా లావాదేవీ జరగటానికి వీల్లేదు....

మానసికంగానూ, శారీరకంగానూ అలిసిపోయి మంచంమీద నడుం వాల్చాడు కరుణాకరం...ఏమీ చదవబుద్ధి కావటం లేదు కూడా. గుండెలమీద చేతులు పెట్టుకొని సీలింగ్‌వైపు చూస్తున్నాడు ఏకాగ్రతతో.

మూలగా ఎత్తుగా వున్న ఎలక్ట్రిక్ చెక్కకేస్ మీద పిచుకలు గూడు కడుతున్నాయి. పుల్లాపుడకా, గడ్డీగాదరా తెచ్చిపెడుతున్నాయి.

పిచుకల శ్రద్ధ, ఓర్పు చూస్తే కరుణా కరానికి ఆనందం వేసింది. వాటి నిర్మాణ చాతుర్యానికి ఆశ్చర్యపోయాడు.

వాటికి కోఆపరేటివ్ సొసైటీలు అక్కర్లేదు. గూడుకట్టుకోవటం వాటి రక్తంలోనే జీర్ణించుకుపోయి ఉన్నట్లుంది. భవిష్యత్తు మీద వాటికెంతో ఆశ .... జాగ్రత్త. ఆ దృక్పథం వాటి నరాల్లో జీర్ణించుకుపోయి ఉంటుంది కాబోలు.

"ఏమిటో అంత సీరియస్‌గా ఆలోచిస్తున్నారు?" గదిలోకివస్తూ ప్రశ్నించింది అన్నపూర్ణ.

"చూడు పూర్ణా... ఆ పిచుకలు..." కరుణాకరం మాట ఇంకా పూర్తి కాలేదు.

"చక్కగా, పొందికగా గూడు కట్టుకుంటున్నాయి...అంతేనా?'' అందిపూర్ణ.

"నీకేం ఆశ్చర్యంగా లేదా?" వెర్రి మొహం వేశాడు కరుణ.

"వాటిని చూసి ఆశ్చర్యపోతారెందుకూ...నిన్నకాక మొన్న పెళ్ళయిన మీ చెల్లెలు కట్టుకోలా పెద్ద ఇల్లు... హైదరాబాదులో బావగారు కట్టుకో లేదా? మరిది వైజాగ్‌లో సైట్ కొనుక్కో లేదా?"

అన్నపూర్ణ గుండెల్లో గూడు కట్టుకున్న బాధంతా బైటికి పొంగుకొచ్చింది. గిన్నెలో మరుగుతున్న పాల్లా పొంగింది ఆమె మనసు.

"వాళ్ళకి అవకాశం ఉంది'' నసిగాడు కరుణ.

"మనకేనా ఏమీ లేనిది?" అంది అన్నపూర్ణ.

"అమ్మా! వాళ్ళు పట్టుకున్నారనే మనం పట్టుకోవాలిట నీళ్లు'' మొహం ఎర్రగా చేసుకొచ్చింది బిందు.

"చుప్పనాతి పీనుగులు" అంది అక్కడే కిటికీలో కూర్చొని ఏదో మాగజైన్ చదువుకుంటున్న వీర.

దానికి రకరకాల తిట్లొచ్చు. తిట్టగలదు కూడా.

"ఏంచేస్తాం...మన ఖర్మ. ఇల్లు వాళ్ళది. మనమే సర్దుకుపోవాలి" అంది పూర్ణ.

"మనకి హక్కువుంది" అన్నాడు బాబి యాంగ్రీయంగ్‌మన్‌లా.

"హక్కేమిటి ... హక్కు. కుర్ర వెధవ్వి...నువ్వు నోర్మూయ్" కొడుకుని కసిరింది పూర్ణ.

"ఎంట్రెన్స్ పరీక్షలకెళ్ళే కుర్రాళ్ళకి ఇస్తే గదికి మూడొందలు వస్తుంది...మీరు ఖాళీచేయండి. ఈ బాధ మేం పడలేం- అంటోందమ్మా ఆ బుల్ డోజర్" బిందు విసుక్కుంటూ చెప్పింది.

బుల్‌డోజర్ ప్రసాదరావుగారి రెండో పెళ్లాం. ఆవిడంటే ప్రసాదరావుగారితో సహా చాలామందికి భయం. రూపం భయంకరంగా వుంటుందనికాదుగానీ నోరు మహా చెడ్డది. అర్థంపర్థంలేకుండా ఎంత మాట పడితే అంతమాటా అంటుంది.

"మీరెళ్ళి చెప్పండి...ఇల్లు దొరికిం తర్వాత ఖాళీచేస్తామని, అంతదాకా నీళ్ళ దగ్గర పేచీలు పెట్టవద్దనీను. అయినా ఆ బుల్‌డోజర్ ఎంతవారినైనా ఆవకాయ జాడీని కడిగినట్లు కడిగేస్తుంది"

అన్నపూర్ణ చెప్పింది కూడా కరక్టే. కరుణాకరానికి ఆవిణ్ని ఎదుర్కొనే ధైర్యంలేదు.

* * *

పంపునీళ్ళ దగ్గర, కరెంటు మీటరు దగ్గర ఓ చిన్న సైజు రామరావణ యుద్ధం జరిగాక కరుణాకరం ఆ ఇల్లు ఖాళీ చేసాడు.

తక్కువద్దెతోవున్న పెద్ద రైలు పెట్టెల్లోంచి కష్టపడి ఎక్కువద్దె సమర్పించుకుని చిన్న రైలుపెట్టెల్లోకి వచ్చిపడ్డారు. ఇల్లు సర్దుకునేటప్పటికి అలసిపోయారు కరుణాకరం కుటుంబ సభ్యులు.

విజయవాడలో కృష్ణస్నానంచేసి, తమ్ముడి దగ్గర పుట్టింట్లో నిద్రచేసి వచ్చింది సుందరమ్మగారు.

తీరా రిక్షా దిగితే మీవాళ్లు ఇల్లు మారారన్నారు.

ఆడపిల్లల స్కూలు దగ్గర, వేపచెట్టు సందులో నాలుగో ఇంట్లో రెండో భాగంట.

చచ్చిశాయంగల 'విన్నపాలై రిక్షావాడి గొణుగుడుతో కొత్తింటికి వచ్చి చేరారు సుందరమ్మగారూ, ఆవిడ తమ్ముడూనూ.

"ఏమిట్రా....కరుణా! ఇంత అర్థాంతరంగా ఇల్లు మార్చారు" అంది సుందరమ్మగారు కొడుకుని చూస్తూ.

"ఆ ఇంట్లో వుండలేక" తేలిగ్గా చెప్పాడు కరుణాకరం.

ఆ ఇంట్లో వుండటం కష్టమని ఆవిడకి తెలుసు.

"ఇదెలావుంది" అనడిగారు అంతా ఒకసారి కలయజూస్తూ.

"వేడి వేడి మూకుట్లోంచీ వచ్చి కణకణలాడే కుంపట్లో పడ్డట్టయింది" అత్తగారికి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళిస్తూ అంది అన్నపూర్ణ.

ఆవిడకి అర్థంఅయింది.

"కోపంలో తొందరపాటుతో చేసే పనులన్నీ ఇల్లాగే ఏడుస్తాయే తల్లీ! అగ్గిపెట్టెల్లావున్నాయి గదులు" అని గోడకి జేర్లబడి కొంగుతో మొహంతుడుచుకుంది.

కరుణాకరం మేనమామతో మాట్లాడుతున్నాడు.

"భోజనానికి లేవండి" అంది అన్నపూర్ణ.

"నాకేంవద్దు...ఇలా పడుకోనీ"అంది సుందరమ్మగారు.

తల్లికి కోపం వచ్చిందని గ్రహించాడు కరుణాకరం.

"అదికాదే. అమ్మా... సమయానికింకేం దొరకలేదు"సంజాయిషీ చెప్పాడు.

"ఓ రెండొందలగజాలు కొని పాకైనా వేసుకుందాం అంటే ఆయన విన్లేదు. నువ్వేమో పిల్లిపిల్లల్ని తిప్పినట్లు తిప్పుతున్నావు. నలభై ఏళ్ళనుంచీ ఊళ్లో వుంటూ ఇల్లులేదంటే కింద ఎవరూ ఉమ్మెయ్యరు"

పమిటతో కళ్ళొత్తుకుందిఆవిడబాధతో.

ఎన్నాళ్ళనుంచో తీరని కోరిక పైకితన్నడంతోఆవిడ గుండెలుఎగసిపడుతున్నాయి. ఆయాసంతో రొప్పుతోంది. మొహం అంతా అసక్తతతో చిన్నబోయింది.

"ఎందుకత్తయ్యా... ఇట్లా ఎన్ని మాటనుకున్నాం.అందరూ కట్టుకోవటంలా మనకే ధైర్యం చాలంది.వెన్నులేనివాళ్ళకి ఎన్ని చెబితే ఏంలాభం?"

అత్తగార్ని సముదాయించింది అన్నపూర్ణ.

పూర్ణ ఎవర్ని ఎత్తిపొడుస్తోందో బాగానే అర్థం అయింది కరుణాకరానికి.

"నువ్వు రాజమండ్రి తాతయ్యగార్ని డిగి డబ్బుపట్రా. నాన్న ఇల్లు కడతారు" దురుసుగా అంది బిందు.

దానికి కరుణాకరం మీద అంతులేని సింపతీ. ఎంతకష్టపడినా ఇంట్లో గుర్తింపు లేని వ్యక్తి నాన్నేనని దానికి నిర్ద్వంద్వంగా తెలుసు. అప్పుడప్పుడూ సపోర్టు చేస్తూంటూంది జాలితో.

"రాజమండ్రి తాతయ్యగారి దగ్గరున్నాయి లక్షలు... మనకిస్తారు" అంది తండ్రిమీద కోపంతో అన్నపూర్ణ.

ఆయన వున్నదంతా రెండో కూతురు విశాలాక్షి కిస్తాడుగాని ఎందుకో అన్నపూర్ణంటే పడదు. అట్లాగే రెండో కూతురు భర్త చంద్రం అంటేనూ అమిత ప్రేమ. కరుణాకరం అసలు అల్లుడులా కన్పించడాయనకి! కరుణాకరం దగ్గర భేషజాలులేవు. సీదాసాదాగా వుంటాడు. అందుకే ట్యూషన్స్ కూడా లేవు,

"భాగ్యలక్ష్మి లాటరీ టిక్కెట్టు కొనండి ... కోటీశ్వరులుకండి. రేపే డ్రా" అంది పీర గట్టిగా అందరికీ విన్పించేటట్లు రేడియోలో అనౌన్సర్‌లా.

"ఏమిటా పొగరు ... పెద్దా చిన్నా లేకుండా" . కసిరింది అన్నపూర్ణ కూతుర్ని.

"నేనేమన్నాను... పేపర్లో వున్నది పైకి చదివాను" తెలివిగా తప్పించుకొంది పీర.

"మాటలు నేర్పిన కుక్క ఇస్కో అంటే ఇస్కో అందిట" కళ్లెర్రజేసింది అన్నపూర్ణ.

"వాళ్ళని వీళ్ళని అడిగే ఖర్మమేముంది మనకి. సుక్షేత్రంలాంటి మాగాణి, నర్సాపురం దగ్గర పెద అమిరంలో పదెకరాలు, రెండు పంటలు దాళవా... సారవా... అంతా అమ్ముకున్నాం. పిప్పరమెంట్ బిళ్ళలా చప్పరించేశాం" నిట్టూర్చింది సుందరమ్మగారు.

ఈ టాపిక్ వచ్చినప్పుడల్లా ఇంట్లో పెద్ద డిప్రెషన్ ఏర్పడుతుంది.

"అక్కడ పొలం అమ్మిన డబ్బుతో ఇక్కడ ఇల్లు ఎందుకు కొనుక్కోలేదు మన తాతయ్యగారు?"

బాబిగాడి ప్రశ్న రాంబాణంలా దూసుకొచ్చింది.

అదీ నిజమే మరి.

"కొనలేకపోయారు నాయనా! పెద్దాయన చదువు, నాన్న చదువు... బాబాయి చదువు ... అత్తయ్య పెళ్ళి... పండగలు పబ్బాలు ... చుట్టాలు పక్కాలు! మీ తాతయ్యగారికి జాలీ, దయా ఎక్కువ నాయనా! డబ్బు అవసరమైందని ఎవరైనా వస్తే చాలు-ఎట్లాగో అట్లా సర్దుబాటుచేసేవారు...తను ఇబ్బంది పడైనా సరే. నాకు తెలిసి కొన్ని ... తెలియకకొన్ని.పిచ్చిమారాజు..అందుకేరా మన ఆస్తంతా ఎండలో హారతి కర్పూరంలా హరించుకుపోయింది''

వివరాలు చెప్తుంటే ఆవిడకి ఎక్కిళ్ళొచ్చాయి.

"స్థలమైనా ఒక్క రెండొందల గజాలు కొనండని చెవినిల్లుకట్టుకొని పోరాను. ఆ తుప్పల్లో ఊరిచివర స్థలాలెందుకు అని కొట్టిపారేసారు''

బర్రున చీదింది సుందరమ్మగారు.

''మన ప్రారబ్ధం...మనకి ప్రాప్తం లేదు బామ్మా" అంది పీర ఆరిందాలా.

''ఇదిగో...ఈ వేదాంతమే మనకిన్ని కష్టాలు తెచ్చిపెట్టింది'' ఇందు కల్పించుకుంది.

కరుణాకరానికి నిజమే అన్పించింది. నాన్నగారొక ఫిలాసఫర్‌లా బతికారు... ఆయనకి ఇవ్వాళే..రేపులేదు.

* * *

శంకర్‌విలాస్ వేపచెట్టు దగ్గర చరిత్రాత్మక నిర్ణయాలు కొన్ని జరుగుతోంటాయి. అదొక మినీ ఢిల్లీ.

''రేపాదివారం మీటింగ్...తప్పకనా. డిస్కస్ చేద్దాం" లక్ష్మీపతి కిళ్ళీషాపులో



బాబాజర్దా తీసుకొని బుగ్గన పెట్టుకుంటూ అన్నాడు.

"తప్పకుండా ... నువ్వే చూడాలి. ఈమాటు నూరారయినా ఆరు నూరయినా ఏదో ఒకటి చెయ్యాలి" కరుణాకరంలో ఒక పట్టుదల కన్పించింది.

"అందరమూ కలిస్తే చేయలేని దేముంది" అన్నాడు శాస్త్రి చేతులు కట్టుకుని వివేకానందుడిలా పోజుపెడుతూ.

ఆ రాత్రి కరుణాకరానికి నిద్ర పట్ట లేదు.

ఆదివారంనాడు పాలిటిక్స్ లెక్చరర్ నరసింహంగారింట్లో ఆ ఒక్కరోజుకి పేకాట సెషన్‌రద్దయింది. అందరికీచేతులు దురదదురదగావున్నా బుద్ధిగా మీటింగ్‌లో కూర్చున్నారు. నరసింహంగారమ్మాయి ఓ పాతిక కప్పులు కాఫీ మేడమీదకి పంపింది. సిగిరెట్టు పొగతో...హీటెడ్ డిస్కుషన్స్‌తో, పాక్‌డ్ ఇమోషన్స్‌తో ఆ గదంతా నిప్పులూ, పొగలూ చిమ్ము తున్న అగ్నిపర్వతంలా ఉంది.

"మొదట మనం రియల్ ఎస్టేట్ ఏజెంట్స్‌ను కలుద్దాం. వాళ్ళే చెప్తారు-అసలు ఎక్కడ జాగాలున్నాయో"

అన్నాడు శాస్త్రి వక్కపొడి నములూ.

"పప్పులో కాలేసావ్ అదేపొరబాటు. మీకు తెలీదు...వాళ్ళు మనల్ని హల్వా తిన్నట్టు తింటారు. అర్బన్‌సీలింగ్ అంటారు. అర్బన్ డెవలెప్‌మెంట్ అథారిటీ అంటారు. ఎప్రూవ్డ్ లేఅవుట్ అంటారు. దిబ్బంటారు...దిబగుండం అంటారు. కనుక మన స్థలాలకి కావలసిన పొలంకోసం మనమే తిరుగుదాం" అన్నాడు లక్ష్మీపతి. అతని దృష్టిలో ప్రపంచంలో అంతా దగా. ముందు దగా...వెనుక దగా, కుడి ఎడమలదగా...దగా!

"ఇక్కడ స్థలాలున్నాయా? అని ఊరంతా తిరిగి అడుగుదాం అంటావా?" అన్నాడు కరుణాకరం. అతనికి లక్ష్మీపతి వరుస నచ్చలేదు. ఏమన్నా, మీకు తెలియదని మరొకటి చెప్తాడు. అవతలి వారి మాటకి అసలు విలువివ్వడు.

"అదికాదోయ్!ఓ జీప్ తీసుకుందాం. ఖర్చనుకుంటే ఓ ఆటో మాట్లాడుదాం ముగ్గురం.... నువ్వూ, నేనూ, శాస్త్రీ... చుట్టుపక్కల వూళ్ళు తిరుగుదాం. రైతుల్ని కలుద్దాం..నరసింహంగారికి ఆయాసం కనుక ఆయన రాలేరు. నచ్చితే... ఓ పొలం ... రెండెకరాలు మనమే కొందాం. రోడ్లూ, ప్లాట్లూ వేద్దాం..మనవి మనకుంచుకుని మిగతావి అమ్మేద్దాం. ఆ డబ్బు మన సొసైటీకి స్టార్టింగ్ ఇన్వెస్ట్‌మెంటు అవుతుంది" లక్ష్మీపతి వివరించాడు.

చాలా ఆటోలు బేరంఆడారు. చివరికి చక్రపాణి అనే ఆటోవాడిని కుదిర్చాడు లక్ష్మీపతి. ఆయిల్ కొట్టించి రోజుకి డెబ్బయిరూపాయలు. నాల్గురోజులు లాల్పురం, నల్లపాడు, నంబూరు, గుజ్జనగూళ్ళ, కాజ, కాకాని, కంతేరు చెడతిరిగారు. ఎక్కడికెళ్ళినా రోడ్డుపక్కన ఎకరం లక్ష, కొంచెం లోపలయితే ఎకరం 80వేలు. అంతకంటే తక్కువలో లేవు. పైగా బెటర్‌మెంట్‌కి బోలెడు అవుతుంది. ఈ పద్ధతి మనవల్ల కాదని తేల్చుకున్నారు. అప్పుడు కన్పించాడు చక్రపాణి బావమరిది మల్లికార్జునం.

"ఏంరా...ఇలా వచ్చావు? ఈళ్ళెవరూ?" ఆరాతీసాడు. బీడీ వెలిగించి, భుజంమీదున్న టర్కీ టవల్‌ని తలకి చుట్టుకున్నాడు.

"పంతుళ్ళు ... కాలేజీ మాస్టర్లు. పొలం కావాలంట స్థలాలికి. ఇప్పిస్తావా?" చక్రపాణి సీరియస్‌గా అన్నాడు.

"అవ్వల్ రైట్‌గా! బంగారం... బంగారంలాంటి పొలం. రోడ్డు పక్కన బిళ్ళ గోడుగా... ఒక్కటే ముక్క. చదరంగా..సక్కగా టేబిల్ బల్లలాగా సాపుగావుంది. ఒక్కఛాన్సివ్వమను... చూపిస్తా నా తడాఖా" అన్నాడు మల్లిగాడు.

వాడు ఈ బ్రోకరు పని ఎప్పుడు మొదలెట్టాడో అర్థంకాలేదు చక్రపాణికి. ఆటో ఇంజనాపాడు.

"సూడండి పంతులుగారూ! మల్లిగాడిప్పిస్తాడంట...సూద్దారేంటి?" అన్నాడు వెనక్కితిరిగి.

"'లెటజ్ ట్రై...వాటిజ్‌దేర్. ట్రైల్ కాస్ట్స్ నథింగ్' అన్నాడు భర్తృహరి" జోకాడు శాస్త్రి. తెలుగు మాస్టారయినా కోపం వచ్చినపుడు, మూడ్‌లో ఉన్నపుడు ఇంగ్లీషు వాడ్తాడు. తెలుగు పేర్లు కలుపుతూంటాడు తమాషాకి.

"నీకు తెలీదు... వాడివల్లేమవుతుంది. నే చెప్పినట్లు..." అడ్డం తగిలాడు

లక్ష్మీపతి అలవాటుగా.

కరుణాకరానికి అరికాలిమంట నెత్తి కొచ్చింది. "పని అవ్వటానికా వచ్చింది... ఆటోలో ఊరేగటానికా వచ్చింది. పోనియ్యవోయి. చూపించవోయి. నీ పేరేమిటి...మల్లికార్జునంకదూ" అన్నాడు కరుణాకరం. లక్ష్మీపతి మాట్లాడలేదు.

నిజానికి మల్లిగాడు చూపించిన పొలం ఒక తీరుగా చక్కగా ఉంది.

"ఎంత ఎకరం?"

"ఆళ్ళు డెబ్బయి సెప్తున్నారండి! నేను ఏభయికిప్పిస్తానండి'' అన్నాడు మల్లిగాడు తేలిగ్గా.

''ఒక్కసారి ఇరవైవేలు ఎవరు తగ్గుతారోయి'' శాస్త్రి అనుమానం వ్యక్తం చేసాడు.

''నిజానికి తగ్గరండి...కానీఅవసరాన్ని బట్టి తగ్గుతారండి. ఇదొక నాయుడుగారి దండి. ఆళ్ళు సిక్స్ బెదర్సండి... ఆళ్ళలో ఆళ్ళకిపడదండి. ఇప్పుడు పెద్దాయన కూతురు పెళ్ళండి. పెళ్ళంటే ఖర్చుగదండి. ఉమ్మడిమీద అమ్మటం బగు తేలికండి. కాషు పంచుగుంటారండి... అదండీ... ఈ పొలంకత. మీకిట్టమైతే చెప్పండి...రథంనే లాగించేస్తాను''గట్టిగా భరోసా ఇచ్చాడు మల్లికార్జునం.

"ఎక్కడుంటారాయన?" అడిగాడు లక్ష్మీపతి.

"ఆళ్ళాళ్ళోనండి'' ఇన్నాళ్ళకి లక్ష్మీపతి మాటలకి జవాబివ్వగల సరైన జోడీ దొరికినందుకు సంతోషించారు కరుణాకరం, శాస్త్రి మనసులోనే.మాట్లాడటంలో తనే మొనగాడినని అనుకుంటాడు లక్ష్మీపతి.

"అదేనయ్యా ఏ వూరని?'' రెక్కించాడు.

"గుంటూరండి" టీడీ పారేశాడు మల్లికార్జునం.

"కొత్తపేటనాయుళ్ళా...నెహ్రూ నగర్ నాయుళ్ళా'' అడ్రసు తెలిస్తే మల్లికార్జున గాడిని ఎలిమినేట్ చేసి డైరక్టు ఎప్రోచ్‌లో కలుద్దామని లక్ష్మీపతి ఊహ.

"రెండూ కాదండి" నైస్‌గా తప్పించుకున్నాడు మల్లిగాడు.

"ఆయన పేరేమిటన్నావు?" స్వరం తగ్గిస్తూ అడిగాడు లక్ష్మీపతి.

''నేనేమన్లేదండి! చూడండి సాములు! ఇది....ఈపొలం నా ఆధీనంలో వుందండి ఈ ఏరియాకు నేను బ్రోకర్నండి. అన్నీ మీకు సెప్పేస్తే నాలాంటి బ్రోకరు నాకొడుకులకేటుంటుందండీ! టీడీ ఇయ్యరా సెక్రం" వాడి వృత్తిరహస్యం గోప్యంగా, క్లుప్తంగా, మొహం పగిలేలా చెప్పాడు. వాడి వాక్‌చాతుర్యం కరుణాకరాన్ని ముగ్ధుణ్ని చేసింది.

"ఈ పొలం గురించి తీసేసిన కరణం గారినిగానీ, ఇలేజి అసిస్టెంట్ గారినిగానీ అడగండి... మల్లిగాడిని అడగండని సెపతారు. మీరు రిజిస్ట్రాఫీసులో అడగండి సర్వే నెంబరు 129/33. మల్లిగాడి నడగమని సెపుతారు. కనుక... పేరు ఆళ్ళది. నిజానికి పొలం నాదే. నాయుడు గారి వల్లకాదు- ఆయనమ్మలేరు, మీరు కొనలేరు"

మల్లిగాడు అపర సాంబశివుడిలా కన్పించాడు. వాడు మాట్లాడుతుంటే ఢమరుకం వాయించినట్లుంది. శివుడికి చెప్పకుండా చీమైనా కుట్టనట్లు మల్లిగాడికి చెప్పకుండా గజం కూడా లావాదేవీ జరగటానికి వీల్లేదు. ఆ ప్రాంతంలో అక్కడి బ్రోకర్లకి వాడు కింగ్. అది వాడి సామ్రాజ్యం.... దట్సాల్.

లక్ష్మీపతి ముహం కళ తప్పింది.

పొలం కుదరకపోయినా లక్ష్మీపతికంటె బాగా తెలిసిన వాడొకడున్నందుకు కరుణాకరానికి సంతోషం వేసింది.

తాడిదన్నువాడి తలదన్నేవాడుండడా?

వుంటాడు!

తెలుగుశాస్త్రికి మల్లిగాడి మాటలు చెవుల్లో పుట్టతేనె పోసినట్లున్నాయి. లక్ష్మీపతి నోరు మూయించిన ఘనత వీడికే దక్కుతుంది. "హాట్సాఫ్...మల్లికార్జునం" శాస్త్రి మనసులో బ్రోకర్ని మెచ్చుకున్నాడు.

''ఇదుగో లచ్చిమీపతిగారూ! మీకు తెలవదు. ముందు నేన్చెప్పినట్టు చెయ్యండి" అన్నాడు మల్లిగాడు-ప్రవక్తలా మొహం పెట్టి, అభయహస్తం చూపిస్తూ.

''నా పేరు నీకెలా తెలుసు?'' ఖంగు తిన్నాడు లక్ష్మీపతి.

"నాకందరి పేర్లూ, ఊర్లూ, సుట్టరికాలు, కతలూ గితలూ, సెరిత్రలూ అన్నీ తెలుసు. మీరు చందారప్పాడు కరణం గారబ్బాయిగోరు. మీ అప్పనో సెల్లెల్నె రామనాథంగారికిచ్చి పెళ్ళి సేసినారు. ఆయన్ది హై క్లాస్ బుర్ర. నెంబర్ వన్ పులి, పెద్దపులి. సరే! మీకు తెలీదుగానీ, నేజెప్పినట్లు సెయ్యండి"

మల్లిగాడు మళ్ళీ చక్రకండగ్గర బీడీ తీసుకున్నాడు. దాదాపు సగం నోట్లో పెట్టుకొని అంటించి పెద్ద మేఘంలాంటి పొగ వదిలాడు. వాతావరణం ఘాటుగా మారింది.

లక్ష్మీపతి తలబిరుసు పూర్తిగా దిగిపోయింది.

కానీ మల్లిగాడు చెప్పినపొలం కొనటం అతనికిష్టం లేదు. అతని ఇగో ఓటమిని అంగీకరించదు. ఎప్పుడూ తనదే పైచెయ్యిగా ఉండాలి అనుకుంటాడు.

"ఆలోచించి చెప్తాం" అని ఆటో ఎక్కారు ముగ్గురు మిత్రులు.

ఆవిధంగా కాలేజి లెక్చరర్ల కోపరేటివ్ హౌసింగ్ సొసైటీకి లక్ష్మీపతి ఇగో ప్రాణంపల్లె పురిట్లోనే సంధికొట్టింది.

కరుణాకరానికి, శాస్త్రికి నాలుగొండలు చేతిచమురు, ఆటో ఖర్చులు వదిలాయి.

**3**

...కరుణాకరానికి మనసులో అసంతృప్తి తొలుస్తోంది. ఇప్పుడు చేసిన ధైర్యం ఇంకొంచెంముందుచేసివుంటే ఇదే డబ్బుకి టౌన్‌కి ఇంకా దగ్గరగా స్థలం వచ్చేది. తను ఆలస్యం చేశాడు. అయినా అసలు తన జీవితమే స్లో.

"నాలుగు రోజుల్నించి ఇల్లు పట్టకుండా తిరిగారు. వెళ్ళిన పని ఏమైందిరా?" సాగదీస్తూ అడిగింది సుందరమ్మగారు.

పుండుమీద కారం చల్లినట్లయింది కరుణాకరానికి.

"ఏమీ కాలేదు. స్థలాలకోసం తిరిగాం. కుదరలేదు" ముభావంగా చెప్పాడు.

"అయినా మీ పిచ్చిగానీ స్థలాలకోసం అట్లా తిరుగుతారటండీ" అంది అన్నపూర్ణ. ఎందుకో ఆవిడకి ఆ పద్ధతి నచ్చలేదు.

జవాబు ఏం చెప్పాలో తోచలేదు కరుణాకరానికి. కంచంలో చెయ్యి కడిగేసుకున్నాడు.

కోపానికి అది క్లైమాక్సు ఘట్టం.

ఇంతలో, "నీ కోసం లక్ష్మీపతి గారొచ్చారు"అన్నాడు బాబీలోపలికొస్తూ.

"కూర్చోమను ... వస్తున్నా"

అంటూనే బయటకొచ్చాడు కరుణాకరం.

'లక్ష్మీపతిలో ఏదో పరివర్తన వచ్చి ఉంటుంది. అపాలజీ చెప్పాలని వచ్చాడేమో?' అనుకున్నాడు కరుణాకరం.

"నీకు నిజంగా స్థలం కావాలా? డూ యూ నీడ్ ఇట్" సూటిగా ప్రశ్నించాడు లక్ష్మీపతి.

"అందుకేగా ఈ తాపత్రయం"

"అయితే నాతోరా... స్కూటరుంది. నేనో చోటికి తీసుకెళ్తాను. వాళ్ళు చెప్పినవి శ్రద్ధగా విను....డబ్బుంటే.. ఐమీన్ నమ్ముంటే మంచిస్థలం... కొనుక్కో... ఇల్లుకట్టుకో" ఛాలెంజ్ చేసాడు లక్ష్మీపతి.

మనిషికి అవసరం కల్పించాలి. ఆ వస్తువును దాచాలి. అప్పుడు దాని విలువ పెరుగును...ఇది సింపుల్ ఆర్థిక శాస్త్ర సూత్రం. దీనికి రుజువుగా డాక్టర్ జాన్ మేనార్డ్ కీన్స్ అక్కర్లేదు... ఉర్సులా యాండ్రిస్ హిక్స్ అక్కర్లేదు- లక్ష్మీపతి చాలు.

స్కూటర్ కొరిటపాడులో ఓ ఇం ముందు ఆగింది. ఇల్లు పాతకాలపుదిలా ఉంది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

ఓ పెద్దహాలు దాటాక, నడవ. నడవ చివర్న మెట్లు. పైకెళ్తే మేడ. అక్కడో గది. ఆ గదిలో ఓ టేబిల్. చుట్టూ పేము కుర్చీలు. గుమ్మానికెదురుగా కుర్చీలో కూర్చొని ఓ ఖరీదయిన మనిషి ఫారిన్ పండు కొడుతున్నాడు ఏకాంతంగా.

ఖరీదైన సిగరెట్ పెట్టె టేబిల్ మీదుంది....

క్రాపు ఖరీదయిన క్రీం రాసినట్లుంది.
కళ్ళజోడు రోల్డ్‌గోల్డ్ ఫ్రేం.
మెరిసే ఎల్లో సిల్కు శాకు...
గంధం కలర్ టెరీవూల్ పాంట్.
తెల్లటి లెదర్ చెప్పులు...

పాదాలు ఎర్రగా... మందారం రంగులో ఉండి, ఎప్పుడూ మట్టిలో నడవని కాళ్ళలా ఉన్నాయి.

నైట్‌క్వీన్ చెట్టు ఆ గదిలో ఉందా అన్నట్లు మైల్డ్‌గా వున్న సీమసెంట్ వాసన...

ఆ వాతావరణంలో ఏదో ప్రత్యేకత కనిపించింది.

"ఇతనే మా కొలీగ్...కరుణాకరం" పరిచయం చేసాడు లక్ష్మీపతి. "మా బావగారు రామనాథంగారు" అని కరుణాకరానికి చెప్పాడు.

కళ్ళతోనే కూర్చోమని సంజ్ఞ చేసాడాయన. ఆ గదిలో ఏదైనా అయస్కాంత శక్తి ఉందో లేక ఆయనలో ఏదైనా అతీంద్రియ లేక సమ్మోహన శక్తుందో తెలీదు గానీ మంత్రముగ్ధుడిలా కూర్చున్నాడు కరుణాకరం.

"మావాడు స్థలం తీసుకుని ఇల్లు కట్టాలని తాపత్రయపడుతున్నాడు. మన బాలాజీనగర్‌లో ఏవైనా వేకెన్సీలుంటే 'మన'వాడికి ఒకటి చూడు" మన అనే మాట ఒత్తి ఒత్తి పలికాడు లక్ష్మీపతి.

లేవన్నట్లు చెయ్యి గాల్లో ఆడించాడు- గ్లాసులో ద్రవం చప్పరిస్తూ రామనాథం.

"ఇది నా పర్సనల్. కాదనటానికి వీల్లేదు" లక్ష్మీపతి రిక్వెస్టు.

రెండు వేళ్ళు చూపించాడు రామనాథం.

"ఇరవయ్యా...ఇచ్చుకోలేడు" లక్ష్మీపతికొక్కడికే ఆయన మూగభాష అర్థం అవుతుంది కాబోలు.

ఆయనకి మాటలురావా ?- అని

సందేహం వచ్చింది కరుణాకరానికి.

లేవన్నట్లు చెయ్యి గాల్లో ఆడించాడు మళ్ళీ.

తర్వాత గ్లాసులో బంగారం రంగు ద్రవం మరో గుక్క తాగాడు రామనాథం.

"సర్లే ... ఒక పీక్‌లో తీసుకొచ్చి స్తాడు" లేచాడు లక్ష్మీపతి.

కరుణాకరం కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించాడు. జవాబుగా చిరునవ్వు నవ్వాడాయన.

ఇద్దరూ సరాసరి స్కూటరు దగ్గర కొచ్చారు.

"అదేమిటి...మీ అక్కయ్యను చూసి రావూ?" అడిగాడు కరుణాకరం కొంచెం ఆశ్చర్యంగా.

"ఈయన మా బావని చెప్పాను. అంతేకాని ఈ ఇల్లు మా అక్కయ్య వాళ్ళది కాదు. ఈయన్ని మేం జోక్యు లర్‌గా దశరథం బావని పిలుస్తాం. ఈయనకి ముగ్గురు భార్యలు. కౌసల్య, సుమిత్ర, కైకేయి.

"మొదటిది మా అక్కయ్య. సత్య నారాయణ వ్రతం పీటలమీదకి, గృహ ప్రవేశాలకి, పిల్లలకి నీళ్ళు పొయ్యటానికి యూనిఫాం డ్రస్సులు వేయటానికి, ఎంగిళ్ళు ఎత్తెయ్యటానికి, పాకీదొడ్లు కడిగెయ్యటానికి అక్కయ్య పనికొస్తుంది. మా అక్కయ్య భూదేవిలాంటిది, గంగిగోవులాంటిది.

"రెండో ఆవిడ ఒక రిచ్ విడో. ఆవిడదే ఈ ఇల్లు. ఆవిడ పొలం చేసే పాలేరే ఆ బ్రోకర్ మల్లిగాడు.

"మూడో ఆవిడ నర్సుట. కన్నావారి తోటలో ఎక్కడో ఉంటుందిట. నేనూ చూళ్ళేదు. చెప్పుకుంటుంటే వింటమే. మా బావది మతాతీత కులాతీత గణతంత్ర వ్యవస్థ.

"అట్లా ప్రతిదానికి ఆశ్చర్యపోకు మరి. ఈ విషయం అందరికి తెలుసు. రహస్యమేమీకాదు" లక్ష్మీపతి కళ్ళల్లో మొదటిసారి దీనత్వం చూసాడు కరుణాకరం.

"మీ బావగారేం చేస్తారు" లక్ష్మీపతిని ఎలా ఓదార్చాలో తెలిక ఏదో ఒకటి అడగాలన్నట్లు అడిగాడు కరుణాకరం.

"ఏమీ చెయ్యరు! అందరిచేత పస్లు చేయించి డబ్బులు సంపాదిస్తుంటారు.

"మాటలు రావా?"

"వచ్చు కానీ మాట్లాడరు. ఆయన హౌసింగ్ బోర్డ్ డైరెక్టర్లతోనూ, సెక్రటరీల తోనూ, మినిస్టర్లతోనూ ... ఆ లెవెల్ మనుషులతోనూ తప్ప మనతో మాట్లాడరు. ఆయనకార్యవాది. మితభాషి"

"ఆయన దృష్టిలో మనం..." ఇంక చెప్పలేకపోయాడు లక్ష్మీపతి.

స్కూటర్ స్టార్ట్ అయ్యింది.

కరుణాకరంహృదయం బరువెక్కింది.

* * *

స్థలం కోసం పి.యఫ్. లోన్ పెట్టాడు కరుణాకరం. పదివేలొచ్చింది. అమ్మ చంద్రహారం అమ్మాడు-రెండు పేటలది. మరో ఆరువేలు వచ్చింది. రెండు రెళ్ళు చేబదుళ్ళు చేసాడు. నాలుగొచ్చింది. మొత్తం ఇరవై వేలు. తలప్రాణం తోక్కొచ్చింది.

శ్రీ బాలాజీనగర్ కోఆపరేటివ్ సొసైటి ఆఫీసుకు వెళ్ళి లక్ష్మీపతి ఇచ్చిన స్లిప్పు చూపించాడు.

క్లర్కు కూర్చోమన్నాడు. పెద్ద ప్లాను చూపించాడు. నల్లపాడు రోడ్డులో ఉందది. బాగా డెవలప్ అవుతుందన్నాడు. మీరు ఆలస్యంగా వచ్చారు. లేకపోతే ఇంకా చౌకలో స్థలం వచ్చేదన్నాడు.

కరుణ ఉత్సాహంగా. కృష్ణగారు అతని మాటలు విన్పించుకోలేదు. డబ్బు లెక్కెట్టుకున్నాడు. ఇరవై వేలు .... అక్షరాలా ఇరవైవేలు.

తర్వాత రసీదిచ్చాడు. వెయ్యి రూపాయలు మెంబర్‌షిప్ ఫీజు, నాలుగు వేలు బెటర్‌మెంట్ ఛార్జెస్, ఇంక పదిహేను వేలకి పదివేలకే రసీదిచ్చాడు, అది స్థలం ఖరీదుట. మిగతా పైనా బ్లాకుట.

నల్లధనం ఎలా ఉంటుందో అపుడు తొలిసారిగా తెలిసింది. అది నల్లగా మాత్రం ఉండదు. చెమటలా ఉంటుంది. రక్తంలా ఉంటుంది.

ప్లాట్ నెంబరు 111. అది ఎవరిదో ప్లాటు దాన్ని కరుణాకరానికి ట్రాన్స్‌ఫర్ చేసినట్లు లెడ్జెర్స్‌లో రాసుకున్నాడు. ఆ ప్లాటు ఎవరిదంటే ... బి. మల్లికార్జునం, కేరాఫ్ బి. రావులమ్మ, ఎలియాస్ శివ పద్మ. వైఫ్ఆఫ్ లేట్ సి. బికారిరెడ్డి నియర్ శివాలయం ... కొరిటపాడు-గుంటూరు. ట్రాన్స్‌ఫర్డ్ టు కె. కరుణాకరం-లెక్చరర్ ఫలానా కాలేజి ..., బ్రాడీపేట, గుంటూరు.

అరె! తనూ, లక్ష్మీపతి వెళ్ళిన ఇల్లే అది. ఇది బినామీ ట్రాన్సేక్షన్‌లా అనిపించింది. కానీ అవసరం మనది...తప్పదు. తెలిసి తప్పులు చేసే జంతువుగదా మనిషి.

ఇంటికి రసీదూ...స్వీట్సూ పట్టుకు వెళ్ళాడు.

"అమ్మా...పూర్ణా...బిందూ..పిరా.. బాబీ...ఈరోజు నుంచీ మనం స్థలం ఓనర్స్‌మి'' అని ప్రకటించాడు.

అందరూ చప్పట్లు కొట్టారు.

బాలాజీనగర్ సొసైటీ గురించి, హౌసింగ్ లోను గురించీ తెలిసినంత వరకూ ఘనంగా చెప్పాడు కరుణాకరం.

కరుణాకరానికి మనసులో అసంతృప్తి పురుగులా తొలుస్తూ ఉంది. ఇప్పుడు చేసిన ధైర్యం ఇంకొంచెం ముందు చేసుంటే ఇదే డబ్బుకి టౌన్‌కి ఇంకా దగ్గరగా స్థలం వచ్చేదని సొసైటీ గుమాస్తా చెప్పింది నిజం. తను ఆలస్యం చేసాడు. అయినా అసలు తన జీవితమే స్లో. అన్నీ స్లోగానే జరుగుతాయి.

"తొందర పడ్డారేమోనండి! అక్కడ ఇల్లు కట్టుకుంటే పిల్లల స్కూళ్ళకీ, కాలేజీలకీ ఎట్లా వస్తారు? ఓ బజారుం డదూ.... బండలుండదు" అంది అన్నపూర్ణ– అన్నం కంచంలో పెడుతూ.

ఆ మాటలకి కరుణాకరానికి ఆకలి చచ్చిపోయింది.

"దూరమో, భారమో ... ఏదో ఒకటిరా. స్వంతం అంటే అదే బాగుంటుంది. రేపీపాటికి సిటీ బస్సులెయ్యరా. నువ్విలా దిగులుపడి అన్నం మానెయ్యక" ధైర్యం చెప్పింది సుందరమ్మగారు. ఆవిడ చాలా జీవితం చూసింది. చదివింది.

"ఇప్పుడాడపిల్లలు కూడా లూనాలు తొక్కుతున్నారు" అంది బిందు- దూరం గురించి టాపిక్ వచ్చిందికదాని.

"సర్లే... ఇప్పుడదొకటి. యాక్సిడెంటయి ఏకాలో చెయ్యో విరిగితే పెళ్ళి కూడా కాదు. అన్నీ సక్రమంగా వుంటేనే ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు కావటం లేదు" కేకలేసింది అన్నపూర్ణ.

కూతురి క్షేమంకంటే పెళ్ళికాదేమో నన్న భయం ఎక్కువ ఆమెకి.

"అప్పుడింకా మంచిదమ్మా... ఫిజికల్లీ హేండీ కేప్డ్ కోటాలో ఉద్యోగ

మయినా వస్తుంది" అంది వీర.

"ఛా... ఏమిటే అపాడుమాటలు. పైన తథాస్తు అనేసే దేవతలుంటారు" అని భయపెట్టింది బామ్మగారు. ఆవిడకి ఇంగ్లీషు బాగానే అర్థం అవుతుంది.

"అయితే బామ్మా...ఆ దేవతలు చెడ్డ పనులకే తథాస్తు అంటారా?" బాబిగాడి సూటి ప్రశ్న.

"ఎందుకొచ్చిందా వెధవనుమానం" రెట్టించింది బామ్మ.

''మరి మనం-స్వంత ఇల్లు కావాలి... స్వంత ఇల్లు కావాలి అని ఇన్ని మాట్లనుకున్నాంకదా... అది జరగలేదేమిటా అని" సాగదీసాడు బాబిగాడు! వాడి పాయింటూ కరక్టే నేమోననిపించేలా!

"నీ కొడుకు నాస్తికుడవుతున్నా



మరా త్వరగా బయలుదేరి
సొసైటీ ల్ బాడీ మీటింగ్‌కెళ్ళాడు
కరుణా సభ్యులు బాగానే వచ్చారు.
చాలా లు నిండాయి. డయాస్‌మీద
ప్రెసి రామనాథంగారు కూర్చు
న్నా సెక్రెటరీ మురళి నివేదిక
చది



ఎప్రోచ్ రోడ్ త్వరలో వేయిస్తాము.

హౌసింగ్ బోర్డ్‌వారికి లోన్లు గురించి రాసాము.

త్వరలో సమాధానం రావచ్చు. రాకపోతే రామనాథంగారు స్వయంగా హైదరాబాద్ వెళ్ళి పని జరిపిస్తారు. అవసరమైతే ఢిల్లీ కూడా వెళ్తారు'

మధ్యలో ఒక మెంబర్ లేచి పాయింట్ ఆఫ్ ఆర్డర్— అన్నాడు చెయ్యి పైకెత్తి.

అతని ధైర్యాన్ని మెచ్చుకున్నాడు కరుణాకరం మనసులో.

అసెంబ్లీలా ఉంది సభ. మాక్ పార్లమెంటులా ఉంది హాలు.

''చెప్పండి...'' అన్నాడు మురళి ఆ మెంబరువేపు నిరసనగా చూస్తూ.

''చివరి ప్లాట్లలో కొందరు కూలివాళ్ళు గుడిసెలేసుకున్నారు. వాళ్ళని ఖాళీ చేయమంటే వినటంలేదు. సొసైటీ ఆఫీస్ బేరర్స్ ఏం చేస్తున్నారు?'' అని అడిగాడాయన.

'ఇది గడ్డు సమస్యే' అన్పించింది కరుణాకరానికి.

''వాళ్ళతో మేంమాట్లాడటం జరిగింది. ప్రతి పనులయిపోగానే మేం వెళ్ళిపోతాం—అని వాళ్ళనాయకుడు చెప్పాడు. అయినా మేం ఒక వాచ్‌మన్‌ని అప్పాయింట్ చేస్తున్నాం'' అన్నాడు మురళి.

అవునన్నట్లు స్లోగా తల ఊపి చిరునవ్వు నవ్వాడు రామనాథం.

''అదేదో త్వరగా చేయించండి. వాళ్ళు అక్కడంతా నానాగలిజు చేస్తున్నారు'' మరో సభ్యుడు అభ్యర్థించాడు.

''ఇవ్వాళ ఎజెండాలో చివరి అంశం ఎన్నికలు'' ఎనౌన్స్ చేసాడు మురళి.



అతనికి బాలాజీనగర్‌లో నాలుగు ప్లాట్లు వున్నాయి. ఆ విషయ్యడూ చెప్పనే లేదు అతగాడు.

ఫలితాలు చెప్తున్నా[గ]వర్నమెంట్ రిజిస్ట్రార్. మళ్ళీ రాగం ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యాడు మురళి కార్యదర్శి. లక్ష్మీపతి ట్రెజరర్. ఎక్స్‌క్యూటివ్ మెంబర్లు ఎవరో ఊరూ, లేనివాళ్ళు అయిదుగురు. రామనాథానికి ప్యానెల్ పెట్టిన మాలకొండయ్యకి ఘోర పరాజయం ఎదురైంది. అయినా ఆయన ఏం మాట్లాడలేదు.

కరుణాకరం పక్కనేవున్నన.

''సారీఅండీ'' అన్నాడు ...సం కరుణాకరం ఆయనతో, ''నెవర్‌మైండ్ సర్. గొర్రె కసాయివాడినే నమ్మ[ది]. కానీ గౌతమబుద్ధుడిని నమ్మత్స! ఉయ్‌గాట్ ది గవర్నింగ్‌బాడీ డి[జర్వ్]—డిజర్వ్—దేశం ఎన్నికల్లాగే ఇది.''

అని ఎవ్వరినీ పలకరించకుండా సినిమాలో అఖరి సీన్లో హీరోలా కలిసిపోయాడు మాలకొండయ్యగా

రామనాథంగారికి అందరూ కం[గ్రాచు]లేషన్స్ చెప్పారు. ఆయన ''థేంక్స్'' కూడా అనలేదు. చిరునవ్వుతో హేండ్ ఇచ్చారు. దానికే అందరూ పడిపోయారు. బోరలు విరుచుకొని బం[డ]కొచ్చిస్కూటర్లుఎక్కారు. ఏభై స్కూటర్లు ఇరవై లూనాలు, పది టి.వి.యస్.లు విసురుగా బయలుదేరి సరాసరివెళ్ళి బా[ర్లు] తెరిచివున్న దార్లోని బార్ దగ్గరాగాయి.

''వస్తావా?'' అన్నాడు లక్ష్మీపతి ఆహ్వానిస్తున్నట్లు.

''ఎక్కడికి?''కంగారుపడ్డాడు కరుణాకరం.

''బార్‌కి'' నవ్వాడు లక్ష్మీపతి.

ఎందుకు?

"ఎందుకేమిటి.... ఎలక్షన్‌లో గెల్చినందుకు" లక్ష్మీపతి కళ్ళు వింతగా మెరిసాయి.

"వద్దు. నేనింటికి పోతాను... అమ్మా పిల్లలు ఎదురుచూస్తూ ఉంటారు"

"ఫరవాలేదు ... తొందరగా వెళ్ళిపోదువుగాని"

అయిష్టంగానే అడుగు పెట్టాడు కరుణాకరం. అతనికిలాంటివి గిట్టవు.

వెట్‌పార్టీ బాగా జరిగింది. కరుణాకరం నిశ్శబ్ద ప్రేక్షకుడిలా కూర్చున్నాడు.

మూడు సీసాలు ఆరు గ్లాసులూ లాగుంది వాళ్ళ వింగ్. నాన్‌వెజిటేరియన్ డిషెస్ వచ్చాయి. అన్నీ ఖరీదైనవే! అంతా దగ్గరుండి జరిపించారు మురళీ, లక్ష్మీపతి. ఎవరికీ అసంతృప్తి, కోపం లేకుండా చూసారు. ఎంతో ఆప్యాయంగా మరొక పెగ్గు...మరొక పెగ్గు... మొహమాట పడకండని ఇప్పించారు. రామనాథం అర్జంట్ పనుండి కన్నావారి తోట హవుస్‌కెళ్ళాడు.

"రెండుమూడు రోజులాయనకి రెస్టు. తర్వాత హైదరాబాద్ వెళ్ళి హౌసింగ్‌బోర్డు ఛైర్మన్‌ను కలిసిపని అయ్యేటట్లు మాట్లాడతాడు" లక్ష్మీపతి ఒక మెంబరుకి 'కత' విన్పిస్తున్నాడు. ఆయన ఇల్లుమీదఇల్లు కట్టినవాడిలా సంతోషపడిపోతున్నాడు.

బిల్లు పేచేసే టైమ్‌కి కిందామీదా పడుతున్నాడు మురళి. కౌంటర్ దగ్గరకెళ్ళి ఆదుర్దాగా రెండు మూడు మాట్లు ఫోన్ చేసాడు. అరగంటయింది. గంటయింది. బిల్లు పెరుగుతోంది.

ఇంతలో దేవతలు పంపినట్లు విమానం లాంటి పెద్ద కారువచ్చి ఆగింది. అందులోంచి ఒక ముసలాయన దిగారు. పిల్లిగడ్డం, ఫెజ్‌కేప్, లాజులాల్చీ, పైజామా, [illegible]న్నాయి. పెద్దమనిషిలా, బలిసిన బడిగల పౌరుడిలా, జమీందారులా ఉన్నాడాయన.

ఆయనతో మురళి చాలాసేపు మాట్లాడాడు. ఎంతో వినయంగా ఆయన చెప్పిన వాటన్నిటికి 'యస్‌సర్...అలాకానివ్వండి, మీ ఇష్టం... తప్పకుండా ... బాస్‌తో చెబుదాం...ష్యూర్' లాంటి మాటల్తో సమాధానాలు పొందికగా చెప్పాడు.

ఆయన హిందీలో గడగడా స్పీడుగా మాట్లాడాడు. ఆయన మాత్రం డ్రింక్ తీసుకోలేదు. నాన్‌వెజ్ ముట్టుకోలేదు. లిమ్కా తాగాడు. అదీ సగం వదిలేసాడు. బిల్లు ఎంతో కరెక్టుగా తెలీదు. మొత్తానికి వేలలోనే ఉంది. ఆయనే పేజేసాడు.

బార్‌వాడు, లక్ష్మీపతీ, మురళీ కలిసి సదరు లాజు లాల్చీని కారుదాకా సాగనంపారు.

"ఆయనది మహత్తరమైనపర్సనాలిటీ. నభూతో నభవిష్యతి లాంటి ఆయన పేరు సయ్యద్‌మహమ్మద్‌హసన్-కంట్రాక్టర్ అండ్ ఇంజనీర్" తెలియజెప్పాడు కరుణాకరానికి లక్ష్మీపతి.

* * *

ఇంటికి ఆలస్యంగా వచ్చాడు కరుణాకరం. రాత్రి పన్నెండయింది.

"ఈ ఇల్లు కాదుకాని నువ్వసలు ఇల్లు పట్టకుండా తిరుగుతున్నావురా" అంది తల్లి.

మేడ మీద మేడలా మాట మీదమాట పెరిగింది.

"దాండుంప తెగ .... మాయదారి మీటింగులుఅంతసేపుంటాయా? పొద్దున్న పదకొండు గంటలనుంచి రాత్రి పన్నెండు గంటలదాకా! నాకు తెలీకడుగు తాను...

పదమూడుగంటలు మాట్లాడుకునేవిషయాలుం టాయి" తనకున్న అక్కసంతా వెళ్ళ గక్కింది అన్నపూర్ణ.

'అవా...అవంతే...మగవాళ్ళకి లక్ష పనులుంటాయి"అన్నాడుతేలికగా కరుణా కరం.

పిల్లలు నిశ్చింతగా పడుకున్నారు.

'కుళ్ళిపోతున్న ఈ కరప్టెడ్ ప్రపంచంలో పిల్లలా బతకగలరో' అనుకు కున్నాడు వాళ్లనిచూసి కరుణాకరం.

'మెరిసే సంఘం మేడిపండు.దానిపొట్ట విప్పిచూస్తే పురుగులుండు'

'ముందు తరాలు ఇంకా అధ్వాన్నం అవుతాయి' మనసులోనే అనుకున్నాడు నిద్రపోతున్న పిల్లల్ని చూసి.

"ఏమిట్రా...మాట్లాడవు?" అడిగింది తల్లి.

"వాళ్ళేమైనా... నలభైవేలకి తాజ్ మహల్ కట్టించిస్తామన్నారా? ఇంత సేపుండిపోయారు"అంది పూర్ణ.

కరుణాకరంకిఏపిచ్చిపడితేఅదే. రెండో ధ్యాస ఉండదు. అదే బాధ అన్నపూర్ణకి.

"నాబొంద. తాజ్ మహల్ లేదూ... కుతుబ్ మినార్ లేదూ! ఎన్నికలు ఎన్నికలు" తల బాదుకున్నాడు కరుణా కరం.

అక్కడ జరిగినవన్నీ అన్నపూర్ణకి చెప్పటం ఇష్టంలేదు.

అప్పటికి అర్థమైంది అన్నపూర్ణకి. తనో ప్రింటెడ్ కార్డు చూసింది వారం రోజుల్రకితం బల్లమీద. ఒకాయన నమస్కారం పెడుతున్న బొమ్మవుంది దాని మీద. "ఎవరొచ్చారు?" ప్రశ్నించింది.

"ఆయనే"విసుగ్గా చెప్పాడు కరుణా కరం లుంగీలోకి మారుతూ.



ఆయననా? కార్డుమీద ఫోటో చూసి మొదట్లో పెద్దకర్మ కార్డనుకుంది. అది సొసైటీ ఎన్నికల కార్డనితర్వాతతెలిసింది అందుకని బాగా గుర్తుంది ఆమెకి.

తలనొప్పిగా,దిమ్ముగా ఉంది.టాబ్లెట్ వేసుకొనిమజ్జిగతాగి పడుకున్నాడుకరుణా కరం. అప్పటికి రాత్రి రెండయింది.

**4**

...వీళ్ళిలా మాట్లాడుకుంటుం దగానే గోలగోలగా జనం పరుగెత్తుకురాసాగారు. అరుపులు. కేకలు. ఏడుపులు. ఎవరో తాపీ పనివాడు నిచ్చెన జారి పడ్డాడట. తలకి గాయమై రక్తం బాగా వస్తోంది. నలుగురు మోసుకొస్తున్నారు...

రాష్ట్రస్థాయి వాలీబాల్ పోటీల్లో మన వాళ్ళే గెలిచారని చెప్పి ఆరోజు కాలేజీకి శెలవిచ్చారు.

కరుణాకరం ఇంటి కొచ్చేసాడు-పద కొండుకొట్టేసరికే. "మస్తలం చూద్దాం నాన్నా!"అన్నారు పిల్లలు సంబరంగా.

"అవునండీ.. మస్తలం చూసొద్దాం" అడిగింది పూర్ణ.

"అవునురా అబ్బాయి...వాళ్ళని తీసు కెళ్ళరాదూ"అంది అమ్మ. కరుణాకరంసరె అమ్మని పోగ్రాంకి ఒప్పుకున్నాడు.

గంటలో అందరూ ముస్తాబయ్యారు. అన్నపూర్ణ పట్టుచీరకూడా కట్టుకొంది.

ఓ రిక్షావాడిని పిలిచారు - బాలాజి కాలనీకి అన్నాడు బాపిగాడు.

"అదెక్కడండీ! నాకు తెలీదు, అన్నాడు" రిక్షావాడు.

అదేమన్నా బ్రాడీపేటా, అరండల్ పేటా....వెంటనే అర్థమవటానికి. లాభం లేదని కరుణాకరం కల్పించుకున్నాడు.

"రెడ్డి కాలేజి తెలుసా?"

"నేన్రానులెండి" విసురుగా వెళ్ళిపోయాడు రిక్షావాడు.

సిటీబస్సుకోసం గంట నుంచున్నారు కూరలమార్కెట్టు దగ్గర. బస్సొచ్చింది. "నల్పాడు...నల్పాడు" అంటాడుగానీ పోడు. జనం ఓ ఎక్కుతున్నారు తీర్థప్రజలా. ఎవడో అలగాకుర్రాడు బిందుకి డేష్ ఇచ్చి వెకిలిగా నవ్వాడు. అన్నపూర్ణకి చికాకు మొదలైంది. బస్సుజనంతో పిప్పళ్ళ బస్తాలావుంది. ఇంజనుఆరుతోంది డ్రయివర్ టీతాగి... ఓ సిగిరెట్టు దమ్ములాగి చక్రం దగ్గర కూర్చున్నాడు. కండక్టర్ టిక్కెట్లు కొడుతున్నాడు.

"అయిదు బాలాజీనగర్" అన్నాడు కరుణాకరం.

"ఏమన్నారు" అన్నాడు కండక్టర్. తోలుసంచిలోని చిల్లరని చేతితో తీస్తూ.

"రెడ్డికాలేజీ తెలుసా?దానవతల" నని గాడు కరుణ.

చిరునవ్వు నవ్వాడు కండక్టర్. ఇవ్వబోయిన చిల్లరని ఇవ్వలేదు.

అంటే రూపాయి మారంలో ఉన్నాం సంటూరుకి. కరుణాకరానికి కొంచెం గర్వం పెరిగింది. అదేమాటఅన్నపూర్ణతో అన్నాడు కూడా.

అది బస్సులాలేదు. పాతఇనుప జంక్ చప్పుడు ఎక్కువ. వేగంతక్కువ. వేలంలో కొన్నడికాబోలు.

ఆరేడుచోట్ల ఆగి ఓ గంటకిరెడ్డి కాలేజి దగ్గరకొచ్చిందిబస్సు. పిల్లలుదిగబోయారు.

"ఇక్కడకాదు, కొంచెంపైన" అంటూ వాళ్ళని వారించాడు కరుణ బాగా తెలిసిన వాడిలా. "మన కంట్రీలో పబ్లిక్ట్రాన్స్‌పోర్టు చాలా పూర్" పైకే అనేశాడతను.

ఇంకో పావుగంటప్రయాణం అయ్యాక నిర్మానుష్యంగా ఉన్న ఒక పొలం దగ్గర ఆపాడు బస్సు.

'దిగండి' అన్నాడు కండక్టర్.

గబగబా బడిపిల్లల్లా బస్సు దిగారు కరుణ, పూర్ణ, బిందు,బాబి,పీర.

డబడబలాడుతూ వెళ్ళిపోయింది బస్సు. అక్కడ ఇళ్ళేమీలేవు. జనసంచారం లేదు. రోడ్డుకిరెండు వేపులా ఖాళీ పొలాలు... ఓపది గుడిసెలు కూలివాళ్ళవి. బోర్లించిన బుట్టల్లావున్నాయి.

"శ్రీ బాలాజీనగర్ కోఆపరేటివ్ హౌసింగ్ కాలనీ"

మిడిల్ ఇన్కం గ్రూప్ హౌజెస్ స్కీము.

(రిజిష్టర్ నెం 9618/83/జి3)

అనేబోర్డు ఓ పెద్ద చింతచెట్టుకి వేలాడుతూవుంది. అది గాలికి సగం వంకరపోయింది.

పొలంలో రాళ్ళూరప్పలూ ఉన్నాయి. ఎండిపోయిన పిచ్చిమొక్కలున్నాయి.

పొలంమధ్యలో రెండు తులసికోటల్లాంటి కట్టడాలున్నాయి. ఎవరివో సమాధులు.

నిజంగా ఏడుపొచ్చినంత పనైంది కరుణాకరానికి.

"మన స్థలం ఎక్కడ" అంది అన్నపూర్ణ-ముంగురులుచేత్తో పైకిసర్దుకుంటూ. సమాధులన్నా, శ్మశానమన్నా ఆడవాళ్ళకి మహాచెడ్డ భయం.

చింత చిగురు అందుకోటానికి ప్రయత్నం చేస్తున్నాడు బాబిగాడు.

"పడతావ్ జాగ్రత్త" అంటోంది బిందు.

పీరకి హవాయి చెప్పులోంచి దూసుకుపోయి ఓ తుమ్మముల్లు గుచ్చుకుని రక్తం కారుతోంది.

పొలంనిండా తెల్లటి సున్నంగొడుగుల్లా రాళ్లు పాతున్నాయి.

"ఏప్లాటు మనది" అంది కుచ్చిళ్ళుపైకి పట్టుకొని నడుస్తున్న పూర్ణ.

వంగుని రాళ్ళమీద నెంబర్లు వెతుకుతున్నాడు కరుణాకరం. ఒక అరగంటకి కనబడింది.

'కొలంబస్ డిస్కవర్డ్ దిసైట్'-లాగా కరుణాకరానికి చెమటపట్టింది. సరిగ్గా ఆ ప్లాటు లంబాడీవాళ్ళ గుడిసెలకి వెనుక వేపేవుంది. 'ఈ డేంజరు మనకీవుంది.' అని మనసులో అనుకున్నాడు. పైకి అంటే అన్నపూర్ణ హర్టవుతుందని అనలేదు.

''ఎన్ని గజాలండి?"

"420 గజాలు"

"డాడీ! మనకన్నీ ఇలాంటి నెంబర్లు వస్తున్నాయేంటి ... 111- 420" అడిగాడు బాబిగాడు కవిలాగా.

"నాన్నా! ఇదంతా బాగుచేసి ఇళ్ళు కట్టడం ప్రారంభంఅయ్యేటప్పటికిఎన్నేళ్లు పడుతుంది?'' అడిగిందిబిందుఅపోజిషన్ ఎం.యల్.ఎ.లా.

వీర ఏం మాట్లాడలేదు. దానికి ముల్లు గుచ్చుకున్న కాలునొప్పెడుతోంది.కొంచెం గుచ్చుకున్న ముల్లు ముక్క లోపలుండి పోయింది. కలుక్కు కలుక్కుమంటూ ఉంది కదిలినప్పుడల్లా.

"ఇంటికి వెళ్ళాక పిండి కట్టుకడదాం" ఓదార్చింది పూర్ణ కూతుర్ని. వీర వాళ్ళమ్మ చెయ్యిపట్టుకునే నడుస్తోంది.

కరుణాకరానికి వెన్నులోంచి భయం సన్నటి పాములాగా ప్రాకింది. మనం పొరపాటు చెయ్యలేదుకదా. ఆత్మపరిశీలన చేసుకున్నాడు. కానీ తను మునిగిపోతున్నట్లు అన్నపూర్ణకి, పిల్లలకు తెలీకూడదు.

"రెండు, మూడు...'' కరుణ మాట పెగల్లేదు.

"నెలలా... ఏళ్ళా?" వెంటనే అందుకొంది బిందు.

"శుభంపలకరా అంటే ఏదో అన్నాట్ట నీలాంటివాడే'' కేకలేసింది పూర్ణ. ఆడపిల్లలు ఎక్కువమాట్లాడటంఇష్టం వుండదు అన్నపూర్ణకి. రేపు ఇంకోళ్ళ ఇంటికి వెళ్లాల్సినవాళ్లు హద్దుల్లో ఉండాల్సిందే!

ఎండ తీక్షణంగా ఉంది. అందరికీ దాహంగా ఉంది. రోడ్డుమీదకొచ్చి నిలబడ్డారు. స్థలం చూసిన హుషారు చప్పబడిపోయింది.

ఒక్కబస్సూ ఆపటంలేదక్కడ!

చివరకో బస్సువాడు మాత్రం కొద్దిగా స్లో చేశాడు.

"హోల్డాన్...హోల్డాన్" అరిచాడు బాబి గట్టిగా.

దయతలచి ఆపినట్లు ఆపాడు బస్సేశ్వరుడు. ఎవ్వరికీ సీటు దొరకలేదు. అందరూ నుంచున్నారు.

మార్కెట్టు దగ్గరకొచ్చేటప్పటికి ఐదు అయింది. ఇంట్లో పడేటప్పటికి ఆరు. ముప్పయి రూపాయిలయ్యాయి కరుణకి బస్సులకి రిక్షాలకి, సోడాలకి, చెరుకు రసానికి, పూలకి కలిసి.

"బాబిగాడు మార్కెట్టు దగ్గర్నుంచి ఫ్రెండ్ దగ్గరకు వెళతానని చెప్పాడు" అంది అన్నపూర్ణ అత్తగారితో.

''ఎవరా ఫ్రెండు" కరుణాకరం అడిగాడు.

"చిరంజీవి" అని చెప్పింది బిందు ముసిముసి నవ్వులు నవ్వుతూ.

''ఎవరే...వాడి క్లాస్‌మేటా?''

"కాదు నాన్నా! సినిమా యాక్టరు... చిరంజీవి సినిమాకెళ్లాడు బాబి''ఏవ

రించింది బిందు.

బాబిగాడు (ఇంటికెళ్ళాడంటే అందరికీ తెలుసు. కోటో పాపం ఒక్క కరుణాకరానికే లేదు.

బామ్మగారు పిన్నీసప్వీర కాల్లోంచి జాగ్రత్తగా ముల్లుతీసి పిట్టు కట్టారు.

''ఎలా ఉందే మన స్థి'' అడిగింది ముసలావిడ తీరుబడిగా.

అందరూ కరుణాకరం చూసారు.

అతను పేపరు మొహానికడ్డుపెట్టు కున్నాడు. న్యూస్‌పేపరు ఊగాల్లో అది ఒకటి.

బామ్మగారికి అర్ధం అయి. కానీ ఆవిడ చిన్న చిన్న విషయాలకిపోయే మనిషి కాదు.

జరిగిందంతా పూస గ్రుచ్చినట్లు చెప్పింది పూర్ణ అత్తగారికి.

"ఈ మాత్రందానికేనా ఇంత దిగులు. నేను కాపురానికొచ్చినప్పుడు బ్రాడీపేటే లేదు. అరండల్ పేట, కొత్తపేట అంతే! పాత ఊరూ, చెక్కా సరేననుకో... కళ్ళ మూసి కళ్ళు తెరిచేలోగా సినిమాలో బొమ్మల్లా ఇ వెలుస్తున్నాయి పేటలు. గవర్నమెంట్ తలచుకుంటే ఎంతసేపూ! అంతెందుకు రెండిళ్ళు పడితే వేలం వెర్రిగా కడతారు" అనుభవం కొద్దీ చెప్పిందావిడ. అవును మరి ఏభయ్యేళ్ల క్రితం గుంటూరు వచ్చిం దావిడ.

కరుణకి మనసు కుదుటబడింది. 'అవును. తన చిన్నప్పుడు కృష్ణనగర్ లేదు...బృందావన గార్డెన్స్‌లేదు. అదే డెవలెప్ అవుతుంది' అని మనస్సుకి సర్ది చెప్పుకున్నాడు. కష్టంలో ఉన్నపుడు మంచిమాట మనసుకి ఊరట కల్గిస్తుంది.

మాగన్నుగా నిద్రపడుతోంది.

సినిమా కథ సీన్ బై సీన్ వివరంగా చెబుతున్నాడు బాబి. బిందు, వీర చెవులు రిక్కించుకొని వింటున్నారు.

పాత్రల మాటలతో సహా సినేరియా అంతా వర్ణించి చెబుతున్నాడు. అన్న పూర్ణ కూడా ఆసక్తిగా వింటోంది.

"ఏం సినిమారా బాబిగా?" అంది బామ్మగారు.

"స్టంట్ పిక్చర్...నీకు నచ్చదులే" అని కథ కంటిన్యూ చేసాడు బాబిగాడు. ప్రజల టేస్ట్ తెలిసిన డైరక్టర్ లాంటి వాడు బాబిగాడు.

ఇంట్లోవాళ్ళకి నిరాశ కల్గుతుందేమో నని భయం వేసింది కరుణాకరానికి. కానీ వాళ్ళకి అంత షాక్ అన్పించలేదు. పైగా బామ్మగారి మాటలతో వాళ్ళకి ధైర్యం కూడా వచ్చింది. తనకే అనుమానం, భయం ఇలాంటి ఫోబియాలు పోగొట్టుకోవాలి. రోజుకోసారైనా ఇలాంటి భయాలు పోగొట్టుకోవాలని అనుకుంటాడు. కానీ అది పోదు. నీడలా వెంటాడుతుంది.

"లొకేషన్ పొజిషన్ ఏమిటో రేపు లక్ష్మీపతిని కనుక్కోవాలి" అనుకుంటుండగా నిద్రపట్టింది.

నిద్రలో...కలలో..ఓ పెద్దబంగళా.. పూలతోట... ఫర్నిచర్.... డైనింగ్ టేబిల్... షవర్‌బాత్... లాంజ్... పోర్టికో...కరుణాకరం కోరుకున్నవన్నీ కన్పించాయి.

* * *

హైదరాబాద్‌లో రామనాథం ఏం చూడో రెండో కంటివాడికి తెలియదు. బాజీనగర్ లోన్లు శాంక్షన్ అయ్యాయి. అదరూ సంతోషించారు. అతడి సమర్థతకి మెచ్చుకున్నారు. ఆయన చేయలేనిదేం లేదని మరోసారి అనుకున్నారు.

ఇల్లు కట్టటం కాంట్రాక్టు ఎవ్వరికి ఇవ్వాలి? - అదీ ముఖ్యమైన అంశం. ఆ మీటింగ్‌లో హాలకొండయ్యగారు తీవ్రంగా మాట్లాడారు. పేపర్లో ప్రకటన వేసి కొటేషన్స్ అడగమని చెప్పారు. అదే సరైన పద్ధతి అని నచ్చజెప్పారు.

"మీకు తెలీదు. దానివల్ల చాలా చిక్కులున్నాయి. లోయస్ట్ కొటేషన్ ఇచ్చిన వాళ్ళు అల్లాగే కడతారు ఇళ్ళు. కన్‌స్ట్రక్షన్ సబ్ స్టాండర్డ్‌గా ఉంటుంది. లోకల్ వాళ్ళకిస్తే అదిరించి బెదిరించి చక్కగా పను చేయించుకోవచ్చు" అని లాబీయింగ్ చేసాడు లక్ష్మీపతి రామనాథం తరపున. మురళి కొంతమంది మెంబర్ల చెవులు కొరికాడు.





అందరికీ ఆ మాట నచ్చింది. ముక్కూ మొహం తెలినివాడికిచ్చే కంటే లోకల్ కంట్రాక్టర్ కివ్వటం మంచి ఆలోచన అన్నారు. భేష్ అన్నారు. సెభాష్ అన్నారు. చప్పట్లు కొట్టారు.

సభ్యుల్లో చాలామంది - "లోకల్ కంట్రాక్టర్‌కే వర్క్ ఇవ్వాలి. కట్టుబడి దగ్గరుండి పర్యవేక్షించుకోవాలి" అన్జెప్పి అనర్గళంగా మాట్లాడారు.



మాలకొండయ్యగారి మాట మరుగున పడిపోయింది. ఆయన రిటైర్డ్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్. అయినా ఆయనమాటచెల్లలేదు.

రెండువందల ఇళ్ళకి కాంట్రాక్టు హసన్ అండ్ కంపెనీకి పోయింది. హసన్‌కంపెనీ విజయవాడలో రెండు, మూడు కాలనీలుకట్టి మంచిపేరు సంపాదించాడన్నారు. అందరూ ఏకగ్రీవంగా సరే అంటే సరే అన్నారు. ఫారమ్స్‌మీద సంతకాలు పెట్టారు. ఫారంపైన ఏం రాసుందో ఎవ్వరూ చదవలేదు. ఇంటూ పెట్టినచోట సంతకాలు మాత్రం చేసారు. ఎగ్రిమెంట్లు అయిపోయాయి. కాలనీ కట్టుబడి హసన్‌చేతిలోకి వెళ్ళిపోయింది.

స్థలం సొసైటీకి మార్టుగేజి చేసి నలభై వేలు లోన్ మూడు విడతలుగా తీసుకోటానికి డాక్యుమెంట్స్ సిద్ధం అయ్యాయి. ఆ వర్కంతా మురళీగారే చూసారు. ఆయన లాయరవ్వటంవల్ల అందరికీ నమ్మకం ఉంది.

ప్రజల అమాయకత్వంతో ఆడుకోవటం మురళీలాంటి వారికి సరదా అని ఎవరు గుర్తుచేసుకోలేదు.

మాలకొండయ్యగారు స్వంతంగా కట్టుకుంటాను అన్నారు. సొసైటీవాళ్ళు అట్లా వీల్లేదన్నారు. లోన్ రాదన్నారు. 'ఫరవాలేదు' అన్నాడాయన. తర్వాత ఆలోచించి చెబుతాం అన్నారు సొసైటీ వాళ్లు. ఆయన మీటింగ్‌లోంచి వాకౌట్ చేసాడు.

ఎట్లాగోఅట్లా బండి కదిలినందుకు కరుణాకరానికి సంతోషంగా ఉంది.

* * *

"లోన్ శాంక్షన్ అయింది...ఇళ్ళు కట్టటం మొదలెడుతున్నారు" అన్నాడు జనాంతికంగా

"శుభస్య శీఘ్రం" అంది సుందరమ్మ.

"ఎన్నాళ్ళుపడుతుందిటా?" అడిగింది పూర్ణ.

"రెండువందల డెభైరోజులట."

"అమ్మో!"

"అమ్మో...ఏమిటి, ఇల్లు కట్టటం అంటే మజాకాకాదు...ఐరన్ కొనాలి.. సిమెంట్‌కొనాలి...కలప కొనాలి"

"అవన్నీ మీరు చెయ్యగలరా?"

తను అసమర్థుడినని బాగా తెలిసిన వ్యక్తుల్లో మొదటిది అన్నపూర్ణ.

"మనకేం సంబంధంలేదు. అంతా కాంట్రాక్ట్‌బేసిస్" నవ్వుతూ అన్నాడు కరుణ కాలరెగరేస్తూ.

"వాళ్ళేమైనా మోసం చేస్తారేమోనండి ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మటానికిలేదు."

"ఇన్‌కంటాక్స్ ఆఫీసర్‌గారి అమ్మాయివనిపించుకున్నావు మొత్తానికి అందరిమీదా అనుమానమే"

"సర్లెండి,ఇప్పుడాయన గొడవెందుకు మీకు" తండ్రంటే పడదు అన్నపూర్ణకి ఉడికించటానికి అప్పుడప్పుడు ఆ ప్రసంగం కరుణాకరం కావాలనితెస్తాడు అన్నపూర్ణ డైవర్ట్ చేస్తూంటుంది.

"నువ్వు పై ఎత్తున చూసుకోరా బాబూ" అంది మధ్యే మార్గంగా తల్లి.

"ఇంకా ఆమాటన్నావు బావుంది. అన్నింటికీ అనుమానాలయితే పనులు కావమ్మా. కొంత నమ్మకంమీద పోవాలి. మంచి పేరున్న కంట్రాక్టరు. పైగా వాళ్ళకి చెడ్డపేరొస్తుందంటే భయం కదా. అంతా నాకొదిలెయ్యండి" భరోసా ఇచ్చాడు కరుణ.

భార్యాభర్తలు ఆ రోజు 'ఇల్లు ఇల్లాలు' సినిమాకి వెళ్ళారు.

"ఇల్లాలుంది, ఇల్లు రాబోతోంది" సంతోషంగా అన్నాడు పూర్ణచెవిలో.

పూర్ణ మనోహరంగా నవ్వింది.

పిల్లలంతా హిందీ పిక్చర్ కెళ్ళారు. వాళ్ళకి అందులో అమితాబ్ పాడిన పాట ఇష్టం. అమితాబ్‌లాగా పొడుగ్గా షోగ్గా ఉండాలని బాబిగాడి కోరిక.

* * *

హసన్ అండ్ కంపెనీ వాళ్ళు పని మొదలెట్టారు. ఇటుకలు, లారీలు, ఇసుక, కుప్పలు, రాళ్ళగుట్టలు, ఒక షెడ్డు, కూలీలు అటూ ఇటూ తిరగటం కన్పిస్తోంది. సరిహద్దులు పాతి వాటికి ట్యూబ్ లైట్లు పెట్టారు.

ఇంజనీర్ల ప్లాను ప్రకారం గీతలు గీయిస్తున్నారు సున్నంతో. తవ్వేవాళ్లు తవ్వుతున్నారు. మట్టితట్టలు ఎత్తుతున్నారు ఆడకూలీలు.

"స్వామియే శరణం అయ్యప్ప టీ స్టాల్" పెట్టాడు ఒక మళయాళీ. వెంకటేశ్వర కిళ్ళీషాపు అనే ఓ చిన్న సిగరెట్ బడ్డీ కూడా వెలిసింది మూల మీద.

"శ్రీ బాలాజీనగర్ కాలనీ" అనే బోర్డు పెద్దదయింది. ఆ బోర్డుకంటేకూడా హసన్ అండ్ కంపెనీవాళ్ళ బోర్డు బాగా డామినేటింగ్‌గా ఉంది. హెచ్ అనే అక్షరాన్ని ఇల్లుగా, గుర్తుగా వేశారు. అది వాళ్ళ కంపెనీ సింబల్.

ఆరడుగులు పునాది అన్నారు. తీరా పరుజాకరంవెళ్ళి తన ఇంటిపునాది చూసుకుంటే నాలుగడుగులు కంటే లేదు. కూలీలనడిగాడు. "మాకేటితెల్దండిఆఫీస్‌లో అడగండి. అల్లు తవ్వమన్నారు. తవ్వుతున్నాం" అన్నారేగాని కూలీలు ఇతన్ని పట్టించుకోలేదు.

ఆఫీసులో అడగటానికి భయపడ్డాడు. మాలకొండయ్యగారిలా తననికూడా బాయ్ కాట్ చేస్తారేమోనని. అయినా ధైర్యం చేసి ఒక ఇంజినీరునడిగాడు.

"చాలండీ... ఇదిలూజ్‌సాయిల్ కాదు హార్డ్ రెడ్ సాయిల్ ... చాలు .... చాలన్నాగా... మీరేంవర్రీ అవ్వకండి. చాలుసార్ చాలు'' ఇంజనీర్ కాలనీ ప్లాను చూడటంలో మునిగిపోయాడు.

"మరి ఆరన్నారు?" మెల్లిగా గొణిగాడు.

''చూడండి సార్... మీ పేరు నాకు తెలీదు. కాంట్రాక్టుకి ఇచ్చాక అట్లాగే వుంటుంది. ఇంకోటికూడా గుర్తుంచుకోండి. ఈ విషయాలు మీ కంటే మాకు ఎక్కువ తెలుసు... అవునా తర్వాత.... "శాస్త్రోక్తంగా చేస్తే" అనే సామెత మీకుతెలుసు కదూ వెళ్ళిరండి."

"సరేలెండి. వస్తానండి ... థేంక్స్'' ఇంజనీరుతోచెప్పి బయట పడ్డాడు సైకిల్ తీసుకుని.

సైకిలు తొక్కుతుంటే ఆయాసం వస్తోంది మధ్య. పైగా ఎదురుగాలి.

అన్ని విషయాల్లోనూ ఇట్లాగే చేస్తారేమో. మాలకొండయ్యగారు చెప్పిందే కరెక్టేనేమో. తన డబ్బంతా వేస్టవుతుందేమో. ఏమో...అమ్మ చెప్పినట్లుఅన్నింటికీ ఆ పైవాడే ఉన్నాడు. ఏడుకొండలవాడు, వడ్డీకాసులవాడు, ఆపదమొక్కులవాడు. కాలనీకి ఆయన పేరేగా పెట్టింది. అన్నీ ఆయనే చూసుకుంటాడు. పైగా మనకేది ప్రాప్తమో అదే దొరుకుతుంది. అసలు తనుస్థలం కొనగలుగుతాడనిఅనుకున్నాడా లేదే! జీవితాంతం అద్దెకొంపల్లో ఉండే శాపం తప్పింది. అంతే చాలు. అదే పదివేలు.

హసన్ వాళ్ళ ప్లాన్ బాగుంది. చిన్న వరండా, హాల్ కం లివింగ్ రూం... ఎడం చేతివైపు బెడ్ రూం. కుడిచేతివైపు గెస్ట్ రూం కం స్టడీరూం. హాల్లోంచి చిన్న కారిడార్... కారిడార్ పక్కన కిచెన్... ఇంకో వైపు బాత్ రూం లెట్రిన్ అంతే. నా రీస్ట్‌లో బావి...కాంపౌండ్‌వాల్ మనం కట్టుకోవాలి. పక్కగది ఎంట్రన్స్ వాళ్ళకిచ్చుకోవచ్చు. ఇది మినీ యుగం. చిన్న ఫామిలీకి చిన్న ఇల్లు. ప్లానుచాలా ముచ్చటగా ఉంది. కానీ పునాదిలోనే ఇంతమోసం చేసినవాళ్ళు ఈ ప్లానంతా చక్కగా కడతారా? ఇందులో ఎంత పోతోందో కనీసం రూపాయికి ముప్పావలా అయినా వస్తుందా? అర్ధరూపాయివస్తుందా ఏమో.కానీ! ఏదెల్లా జరగాలో అలాజరుగుతుంది. ఆలోచించి ఆలోచించి మనసును క్షోభపెట్టుకోవటం అనవసరం.

సైకిలు తొక్కటమేగాని దూరం తరగటంలేదు. కదిల్చిన తుట్టెలోనుంచి ఈగలు లేచినట్లు ఆలోచనలు పరి పరి విధాలపోతున్నాయి.

అసలు ఫౌండేషన్ గట్టిగా వుండాలి. అది గట్టిగా ఉంటేనే మీద తర్వాతపై చదువులు చదవగల్గుతారు అని ఇంటర్‌లో చేరగానే చెప్పాడు తన కొత్తపిల్లలకి. మరి మన ఇంటి ఫౌండేషనే గట్టిగా పడటంలేదే! అయినా ఛలాహై... నల్గురుతో పాటు నారాయణ. నల్గురితో పాటు చావు, పెళ్ళి సమానం.... అంతే! అందరూ ఏం పట్టించుకోనప్పుడు తను మాత్రం ఏం చేస్తాడు? ఇల్లు చేతికొస్తే అదే చాలు.స్వంత గూడు. రోజులసలే మంచివికావు. ఇవి ఒకళ్ళు ఇంకొకళ్ళని ప్రశ్నించగల రోజులా?

సైకిలు మెట్ల కింద పెట్టి ఇంట్లో కొచ్చాడు.

"పునాదులు మొదలుపెట్టారు పూర్ణా"

"బాగా వేస్తున్నారా? ముందు అదే గట్టిగా వుండాలి"

"అవునురా... అదే ముఖ్యం. మా చిన్నప్పుడు తొమ్మిదడుగులు తీసేవారు తర్వాత మేడవేసుకోవాలంటే పునాదిగట్టిగా ఉండాలి, మాటమీదమాట, మేడమీదమేడ అన్నారు" అంది తల్లి.

కరుణాకరానికి గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. ఇంక వివరాలు చెప్పకూడదు అనుకున్నాడు.

* * *

వర్కు తొందరగానే జరుగుతోంది. గోడలు నాలుగడుగులు ఎత్తులేదాక ఉడ్‌వర్కుప్రారంభమయింది. "ఉడ్స్ అండ్ ఉడ్స్" అనే కంపెనీకి సబ్‌కాంట్రాక్టు ఇచ్చారు. తలుపులు, ద్వారబంధాలు చేస్తున్నారు. ఉడ్స్ అండ్ ఉడ్స్ అనేది ఒక చిన్న కంపెనీ. మురళి బాబాయిగార్కి అందులో వాటా వుందని అన్నారు "ఎవరిదయితేనేం? పని బాగుండాలి" అనుకున్నారు మెంబర్లు.

బలార్షా నుంచి టేకులారీల్లో తెప్పించాం మంచి క్వాలిటీ అనిచెప్పాడు ఉడ్ వర్కు చేయిస్తున్నాయన.

ఇంటికి ఎనిమిది కిటికీలు, నాలుగు అల్మారాలు, ఎనిమిది తలుపులు. మొత్తం ఇరవై శాలీలు. ఇవిగాక బాత్‌రూమ్‌కి, లెట్రిన్‌కి సింగిల్ డోర్‌లు. వెరసి ఇరవై రెండు ఇంటూ రెండువందలు. నాలుగు వేల నాల్గువందల శాలీలు. వందమంది కార్పెంటర్లు పని చేస్తున్నారు. పెద్ద షెడ్డు వేసారు. అది తర్వాత సూపర్ బజారవుతుందిట. ఓ పదిమంది మేస్త్రీలు సూపర్ వైజ్ చేస్తున్నారు పనిని. కర్ర చిత్రిక

పట్టిన తుక్కే ఒక కొండంత ఎత్తు ఉంది.

"ఇదేం చేస్తారు" అని అడిగాడు కరుణాకరం ఒక విశ్వకర్మని.

"అది మీరడక్కూడదు. మేం చెప్ప కూడదు" అన్నాడు వాడు అదేదో తారక మంత్రంలా.

"ఊరికే అడిగా లెండి."

''ఊరికే అడిగారు కాబట్టి చెబుతున్నాను" కరుణాకరాన్నడిగి ఒక సిగరెట్టు తీసుకొన్నాడు. అగ్గిపెట్టి కూడా తీసుకున్నాడు. వెలిగించాడు. గట్టిగాపీల్చాడు. అణు రహస్యం చెప్పబోయే హోమీ భాభాలాగా, రసాయనిక శాస్త్ర రహస్యాలు చెప్పబోతున్న నాయుడమ్మగారిలా తీక్షణంగా చూశాడు.

"మురళీ గారింటికితోల్తాం రాత్రిపూట లారీలో"

''ఆయనేం చేసుకుంటాడు? బాయిలర్‌లో వేసుకుంటాడా?"

కరుణాకరం కప్ప బుర్రని చూసి నవ్వుకున్నాడు మేస్త్రీ.

"రాజమండ్రి కాగితం మిల్లుకు అమ్ముకుంటారు సార్. పౌను అట్టలు తయారు చేయటానికి ఇది ముడి సరుకు. లారీకి పదివేలిస్తారు" షెడ్‌లోకి వెళ్ళిపోయాడు మేస్త్రీ.

"అమ్మో. ఏం తెలివి తేటలు. ఏం తెలివి తేటలు. అంతా డబ్బే. చెత్తకి కూడా డబ్బు. వద్దంటే డబ్బు! ఈ ఇళ్లు కట్టేటప్పటికి వీళ్ళు ముగ్గురూ పండిపోతారు కాబోలు. ఇట్లా సంపాదించిన డబ్బు ఏం చేస్తారు? అందుకనే ఎన్నికలకి అంత ఖర్చు పెట్టారు" అనుకున్నాడు కరుణాకరం.

మాలకొండయ్యగారిని చూడగానే కరుణాకరం ఆలోచనలు ఆగిపోయాయి.

"ఉడ్ వర్క్ చూసి వస్తున్నాను సార్" కరుణకరం చెప్పాడు.

"బాగుందా?"

''బాగానే ఉన్నట్లుందండి. వర్క్ వేగంగా జరుగుతోంది''

"నేనడిగేది స్పీడు కాదు... క్వాలిటీ"

"తెలీదండి. టేకు అన్నారు. నాకు కలప గురించి నాలెడ్జి లేదు"

ఇద్దరూ టీ స్టాల్ దగ్గర కొచ్చారు.

"రెండు టీ"

"టేకు అలా ఉండదండి. అది మారు జాతి చెక్క. మద్ది, ఏగిస, పనస, వేప, మామిడి అన్నీ కలగా పులగం. ఇందులో రూపాయికి మీకు వచ్చేది నలభై పైసలు. మిగతా అరవై పైసలు వాళ్ళవి''

టీ తాగుతున్న కరుణాకరానికి ఈ మాట వినగానే పొలమారింది. నోట్లో టీ ముక్కులో కొచ్చింది.

"అంతేనంటారా?''

"అంటారా కాదు. అంతే"

"మీటింగ్‌లో అడిగితే"

''మెజారిటీ లేదుగా"

''అయితే మాత్రం ఇంత ఘోరం టండీ"

"ఏభయి ఒక్క మంది వగుల్బాజీలు నలభై తొమ్మిది మంది మంచివాళ్ళని మోసంచెయ్యటమే ప్రజాస్వామ్యం అని మీరు చదవలేదా?''

వీళ్ళలా మాట్లాడుకుంటూండగానే గోలగోలగా జనం పరుగెత్తుకురాసాగారు.

అరుపులు. కేకలు. ఏడుపులు.

ఎవరో తాపీ పనివాడు నిచ్చెన జారి పడ్డాడట. తలకి గాయం అయ్యింది. నెత్తురు వరదలాగా కారుతోంది. నలుగురు మోసుకొస్తున్నారు.

దెబ్బ తగిలినతనికి స్పృహలేదు.

వాళ్ళంతా మాలకొండయ్యగారి సాయం అడిగారు. ఆయన జీపు రివర్స్ చేశారు. గాయపడ్డ వాడిని జాగ్రత్తగా పడుకో బెట్టారు. కూలీలు కొంతమంది జీపు ఎక్కారు. జీపు హాస్పిటల్‌కి వెళ్ళింది. మాలకొండయ్యగారే డ్రైవ్ చేశారు. రక్తం చూడగానే కరుణకరం మనసు చెదిరిపోయింది.

దిగులుగా ఇంటిదారి పట్టాడు.

"కాలనీ బలి కోరింది" అనుకుంటున్నారు తట్టలుమోసే ఆడ కూలీలు.

## 5

...తాగిన వాళ్లకు తాగినంత సారా. తిన్నవాళ్ళకి తిన్నన్ని ముక్కలు. సంతర్పణలా జరిగింది. కరువుగొట్టు వాళ్ళలా అంతా రోడ్డుమీద కూర్చుని అన్నాలు అవురావురుమంటూ తిన్నారు. గులాంజల్లుకున్నారు ఒకళ్ళనొకళ్ళుతిట్టుకున్నారు.

కరుణాకరం ఇంటికి వచ్చేటప్పటికి వరండాలో లక్ష్మీపతి కూర్చుని ఉన్నాడు.

"ఆఫీస్ బేరర్‌గా ఎన్నుకోలేదని మాలకొండయ్య ఎంతపని చేసాడో చూసావా?" అన్నాడతను.

"ఏం చేసారు?"

"వర్కర్లచేత స్ట్రయికు చేయిస్తున్నాడు"

"ఛా....ఆయనలాంటివాడు కాదనుకుంటానే"

"అదేనా నీకు తెల్సింది?"

"నేనక్కడనుంచే వస్తున్నాను. ఓ కూలీ నిచ్చెనమీంచి పడ్డాడు. వాడిని ఆస్పత్రిలో చేర్చాడాయన."

"అదే! అదంతా షో"

"అసలేమయింది?"

"ఆ వెధవ చచ్చాడు."

"అయ్యో! పాపం"

"పాపం ఏంటయ్యా మొగుడా ఎవరికి పాపం...వాడికా? మనకా? వర్కంతా ఆగిపోయిండి."

"ఎందుకని"

"కాంపెన్‌సేషన్ కావాలిట"

"అవును...ఇవ్వాలిగా మరి"

"ఇస్తాం....కానీ ఎంత?"

"ఏదో తగ్గట్టుగా"

"కాదుట...ఇరవైవేలు కావాలిట... లేకపోతే హసన్‌మీదా, సొసైటీమీద కోర్టు కెళ్తారట."

"బావగారు ఏమన్నారు?

"ఆయన ఢిల్లీలో ఉన్నారు."

"మురళి"

"అతనే ఆ పనులన్నీ చూస్తున్నాడు"

"పోనీ ఇచ్చేస్తే"

"ఎవరిస్తారు! ... నువ్విస్తావా?... నేనిస్తానా?

"హసన్"

"ఆయనకేం పని?"

"మరేం చేస్తాడుట?"

"కోర్టులో తేల్చుకుంటాను. పైసా ఇవ్వను అన్నాడు."

"అయితే ఈ వ్యవహారం ఇప్పుడిప్పుడే తేలదా?

"కోర్టు వ్యవహారం అంత తొందరగా తేలుతుందా?"

"తేలదులే"

"అయినా ఇదంతా ఆ మాలకొండయ్య కుట్రట. ఇందులో వాడి హస్తం వుంది.నువ్వు వాడితో తిరుగుతున్నావుట"

"అబ్బే, లేదే...ఇద్దరం కలిసి టీ తాగుతున్నాం. ఇంతలో..."

"ఆయన అంత దగ్గరైపోయాడా నీ

"లక్ష్మీపతీ! నువ్వు అనవసర లేనిపోనివి కల్పించకు''

''ఆయనంటే బావగారికి పడదు'

"అవ్వొచ్చు. నేను జస్ట్ టీ కోస,

"ఉడ్ గురించి కామెంటు చేసా'

"ఎవరు చెప్పారు?"

''కన్నన్''

''వాడెవడు"

"స్వామియే శరణం అచ్చ టీ స్టాలు వాడిదే''

వాడు సొసైటీ వాళ్ళ స్పై అని కరుణా కరానికి తెలీదు. చిన్నమాట జ్వాలా వ్యాపిస్తుంది. అందుకే పెదవిదాటితే పృథివి దాటుతుంది అంటారు. ఇదే. సాలె గూడులో ఇరుక్కున్న పిల్లిలా ఫీలయ్యాడు కరుణాకరం.

"ఇలాంటి విషయాల్లో జాగ్రత్తగా ఉండు. బావగారికి, ము తెలుస్తే బాగుండదు. ఇలాంటివే చిలికి గాలి వానవుతాయి. కృతిమించిగాన పడ్డాక నేను కూడా ఏమీ చేలేను" అని వార్నింగిచ్చి వెళ్ళిపోయ లక్ష్మీపతి.

సొసైటీవాళ్ళు ఎంతగారులో, ఎంత తెగించినవాళ్ళో తెలిసింది కరుణాకరానికి. పయోముఖవిషకుంభాలు మేకవన్నె పులులు. వీళ్ళతో చాలా జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే ఇల్లు చేతికిరాదు. గొణుక్కున్నాడు కరుణాకరం.

*     *

కోర్టులో కేసు నడిచింది. మురళి, హసన్, లక్ష్మీపతి హైలెవల్ మానేజ్ చేసారు. కోర్టువాళ్ళు ఈ కేసు గురించి. పెద్దగా పట్టించుకోలేదు. టికి 'వాళ్ళకి' ప్రతిఫలం ముట్టింది.

"ఏదేశంలోనైనా పనిచేసినందుకు డబ్బు వస్తుంది ఈ 'సారే జహాఁసే అచ్ఛా'లో మాత్రం పని చెయ్యనందుకు లుచ్ఛాలకి డబ్బొస్తుంది. బహుమతులొస్తాయి''అన్నారెవరో కోర్టు ఆవరణ లోనే.

కోర్టులో పదవుల్లో ఉన్న వాళ్ళ అల్లుళ్ళకి, కొడుకులకి కాలనీలో ఇళ్ళు న్నాయి. రామనాథం ఢిల్లీనుంచి 'వాళ్ళతో' మాట్లాడాడు ఫోన్లో.

అంతే! అర్థాంతరంగా కేసుక్లోజయి పోయింది.

''డ్యూటీ చేస్తూ పడలేదు. నిచ్చెన మీద నుంచొని బీడీ కాల్చుకోటానికి అగ్గిపెట్టె వెలిగించాడు. రెండు చేతులూ వదిలేటప్పటికి బాలెన్స్ తప్పింది పడ్డాడు. కాంట్రాక్టర్ తప్పేంలేదు. సింపుల్ నెగ్లిజన్స్'' అన్నారు మేజిస్ట్రేటుగారు.

న్యాయం గుడ్డిది. దానికి చెవులేకాని కళ్ళులేవు.

''నిచ్చెనమీద బీడీ కాలుస్తూంటే చూసాను" సాక్ష్యం చెప్పాడు మేస్త్రీ మస్తాను.

"అప్పుడు వాడి నెత్తిమీద ఇటుకలు పెట్టిన బొచ్చె కూడా లేదు...నానుదా సూస్తిని" అని సాక్ష్యం చెప్పాడు టీ కొట్టు కన్నన్.

వాడు 'ఫుల్'కొట్టేస్తే ఎందరినైనా ఫూల్స్‌ని చెయ్యగలడు.

మెడికో లీగల్ కేసు తప్పించినందుకు డాక్టర్‌గారికీ, పి.పి.కి కాలనీలో చెరొక ప్లాటు ఉచితంగా వచ్చాయి. మిగిలిన వాళ్ళకి చేతులు బాగా 'తడిసాయి'.

హంపీ శిథిలాల్లా ఉంది బాలాజీనగర్ కాలనీ. నెలమీద ఇరవై రోజులయినా స్ట్రయిక్ పూర్తికాలేదు. టెంట్ వేసారు. ఎర్ర జెండాలు లేచాయి. కూలీలు స్లోగన్స్

ఇచ్చారు.

బాలాజీనగర్ కాలనీ పని ఆగిపోయిం

* * *

రామనాథం ఢిల్లీ నుంచి వచ్చాడు. కార్మిక నాయకులు, కంట్రాక్టర్లు రామనాథం ఇంట్లో మాట్లాడుకున్నారు. కోర్టుతో సంబంధం లేకుండా రాజీ కుదిరింది. చచ్చిపోయిన కూలీ కొడుకు పీర్రాజుకు వాచ్ మన్ ఉద్యోగం ఇచ్చారు. సొసైటీ ఆఫీసు పక్కన గుడిసె వేసుకోటా నికి పర్మిషన్ ఇచ్చారు. వాచ్ మన్ భార్యకి కాలనీలో పెట్టబోయే స్కూల్లో ఆయా పోస్టు ఇస్తాం - అని గట్టిగా చెప్పారు. ఆవిడ రామనాథం బాబుకి చేతులెత్తి దణ్ణం పెట్టింది.

"పోన్లెండి సార్...సచ్చినోడు మళ్ళీ డు కదా. అంతా మా కరమం ... భవించక తప్పదు. ఏదోరకంగా లి కదా. కనకేటంటే...సచ్చినోడు రాడు...కరమం తప్పదు" మెల్లిగా న్నాడు పీర్రాజు. కామందుల న మందు బాగా పనిచేసింది వాడికి. డి మరణం సహజం అన్పించింది వాడి నిషాలో.



కూలీల నాయకులు...వాళ్ళని సపోర్టు చేసిన లోకల్ రాడికల్ విద్యార్థి నాయకులు..చిన్న చిన్న పొలిటీషియన్స్ అందరూ కుదేళ్ళయిపోయారు.

స్ట్రయిక్ చేయించాడన్న స్కాండల్ మాత్రం మాలకొండయ్యగారికి మచ్చలా పర్మినెంట్‌గా అతుక్కుపోయింది.

వాచ్‌మన్ వీర్రాజుకి త్రీ ఈగిల్స్ బార్‌లో పెట్టించాడు మురళి. స్కూలు వచ్చేదాక ఆయా అక్కర్లేదు కాబట్టి రామనాథం మూడో ఇంట్లో వాచ్‌మన్ భార్య పనిమనిషిగా చేర్చబడింది.

ఈ ఎరేంజిమెంట్సన్నీ రాత్రికి రాత్రి జరిగిపోయాయి ... హూష్ కాకీ లా సమస్య తేలిపోయింది.

* * *

జగత్ సాక్షి సూర్యనారాయణుడి వెలుగుకిరణాలు వెచ్చగా పాకుతూవచ్చి బాలాజీ కాలనీమీద పడ్డాయి. ఆ సౌర శక్తిలో ఏం మహత్యం వుందో తెలీదు.

తుఫాను తర్వాత, భూకంపం తర్వాత, అగ్నిప్రమాదం తర్వాత సహాయక చర్యలలాగా మెల్లిగా పని ప్రారంభం అయింది.

మన తండ్రులు దానకర్ణులు. మన అమ్మలు అన్నపూర్ణలు. మనది కర్మభూమి. గతం గతః అనుకుంటూ - జరిగిందాన్ని ఒక పీడకలలా మర్చిపోయి జీవిత శకటాన్ని నడిపెయ్యడంలో మనల్ని మించిన ఆధ్యాత్మిక బోధకులు లేరు ...

చచ్చిపోయిన కూలీ రెండో మాసికం ఘనంగా జరుపుకున్నారు కూలీ జనం.

తాగినవాళ్ళకి తాగినంత సారా, తిన్నవాళ్ళకి తిన్నన్ని ముక్కలు. సంతర్పణే జరిగింది. కరువుగొట్టు ప్రజల్లా అంతా రోడ్డుమీద కూర్చుని అన్నార్తుల్లా అన్నాలు ఆవురావురుమంటూ తిన్నారు. గులాం జల్లుకున్నారు. ఒకళ్ళనొకళ్ళు తిట్టుకున్నారు. డప్పులు వాయించారు. చిందులేసారు. సినిమా పాటలు పాడారు.

కారు మేఘంలాంటి ఆ గడ్డు సమస్య ఇలా దూది పింజలా విడిపోయినందుకు రామనాథంగారి మూడో ఇంట్లో గ్లాసులు గణగణ మన్నాయి. గాజులు గలగల మన్నాయి.

నవ్వులు కలకల మన్నాయి.
ఎందరో మహానుభావులు
అందరికీ 'వంద'లున్న కవర్లు.
పిల్లివచ్చే... ఎలుకా పార్
ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్.

* * *

స్లాబ్ పొయ్యటానికి చెక్క కూర్పులు కట్టారు. గవర్నమెంటువారిచ్చిన నలభైవేలూ అయిపోయింది.

కాంట్రాక్టు పూర్తయిపోయింది.

స్లాబ్ సొంత డబ్బుతో వేసుకోవాలన్నారు.

ఇక్కడే మెంబర్లందరూ పప్పులో కాలేసింది.

వాళ్ళకేం తెలీదు-లోను తప్ప. గుడ్డిగా సంతకాలు పెట్టిన కాగితాలిప్పుడు వెరిఫై చేసుకుంటే అక్షరాలా అట్లాగే ఉంది. లోను ఎంతవరకు వస్తే అంతవరకే కాంట్రాక్టు. మిగిలింది మెంబర్ల బాధ్యతే అని ఉందందులో.

స్వంతంగా శ్లాబ్ వేసుకోలేనివారికి హసన్ అండ్ కంపెనీవారు కట్టడం పనిలో సహాయం చేస్తారు. అయితే ఇది ఇండివిడ్యువల్ కాంట్రాక్టు. సొసైటీకి ఇందులో సంబంధం లేదు.

కరుణాకరానికి కడుపులో పిడుగు పేలినట్లయింది. శ్లాబ్‌కి ఎంతలేదన్నా

మినిమం ముప్పయి వేలు కావాలి. అది కాక ప్లాస్టరింగ్, ఫ్లోరింగ్, కాంపౌండ్ వాల్, రంగులు గింగులూ వేయించాలి. దానికి ఓ ఏభయి వేలు హీనపక్షం కావాలి. మొత్తం ఎనభై వేలు. ఎవర్ని నడగాలి. ఎవరిస్తారు? ఒకటా రెండా... ఎనభై వేలు. ఇంపాజిబుల్.... టోటల్లీ ఇంపాజిబుల్.

లక్ష్మీపతిని సలహా అడిగాడు.

"ఉన్నపుడు కట్టుకోగురూ" అన్నాడు యధాలావంగా.

మురళీగారినడిగాడు.

''లేకుండా ఎందుకు దిగారు?" ఖండించాడాయన.

మాలకొండయ్యగారినడిగాడు.

''అమ్మేయ్యండి. శారదా నగర్‌లో ఓ నూట ఏభయి గజాలు కొనుక్కొని స్వంతంగా పెంకుటిల్లు వేసుకోండి. ఈ పీటా విరగడయిపోతుంది" సలహా ఇచ్చాడాయన.

కరుణాకరానికి మతిపోయింది.

'ఓన్ యువర్ ఓన్ హవుస్' స్కీము గురించి కనుక్కోటానికి యల్.ఐ.సి.కి వెళ్లాడు.

'బ్రాంచి మేనేజర్. పాలసీ హోల్డర్స్ సర్వీస్' బోర్డు చూసి లోపలికి వెళ్ళాడు.

"నమస్కారమండీ''

''నమస్తే''

"నేను లోకల్ కాలేజి లెక్చరర్ని. ఓన్ యువర్ ఓన్ హవుస్ గురించి..."

''మీకు స్వంత స్థలం ఉందా?

"వుంది"

"ఎక్కడ?"

''బాలాజీనగర్ కాలనీలో''

"అదెక్కడ?"

"రెడ్డి కాలేజి ఉంది కదా... దానికి అవతల''

''అది మీది కాదుగా''

"నాదేనండి''

"కానీ దానికి సొసైటీకి ఫస్ట్ మార్ట్‌గేజ్ ఉంది. అటువంటివాటికి మేం లోన్ ఇవ్వం. ఎక్కడైనా స్థలం విడిగా తీసుకోండి. లక్షకో, లక్షన్నరకో పాలసీ చేయండి. లోన్ ఇస్తా. ప్రీమియమ్ కడుతూ ఉండండి. చివరికి హళ్ళికి హళ్ళి సున్నకి సున్న. మీకు ఇంట్రస్టు, ప్రీమియం పోతాయి. ఇల్లు మిగులుతుంది. చివరికి మీ చేతికేమీ రాదు. కనుక నా మాటవిని స్వంతంగా కట్టుకోండి. లేకపోతే కొనుక్కోండి"

''గారెలు చెయ్యటానికి ఏముందంటే చిల్లు పెట్టటానికి వేలుంది-అన్నాట్ట వెనకటికెవడో'' అమ్మ అప్పుడప్పుడు చెప్తూండే సామెతగుర్తొచ్చింది కరుణకి.

'మీ జీవితాన్ని కాపాడే జీవనజ్యోతి' ఇచ్చిన సలహా అలాగే ఉంది. ఇటీజ్ ఎస్లోగన్ స్కీమ్...నాట్ ప్రాక్టికల్ స్కీమ్.

'మీరు రిటైర్ అయ్యాక ఇల్లు కావాలనుకుంటున్నారా? అయితే రాయండి జీవన్ ప్రకాష్"

'మీ అబ్బాయి ఉన్నత విద్యకి మరో పాలసీ' ఎడ్యుకేషన్ ఎండోమెంట్"

"మీ అమ్మాయి వివాహానికి మారేజి ఎండోమెంట్ పాలసీ టేబిల్ ఫోర్టీన్'

అయితే జీవితభీమా సంస్థ... అందులోని ఉద్యోగులకు మంచి జీతాలిచ్చి భీముళ్ళలా తయారుచెయ్యటానికి తప్ప పాలసీదారులకి ఏం ఉపయోగపడదన్న మాట.

యల్.ఐ.సి. అంటే లైఫ్ ఇన్స్యూరెన్స్

కార్పొరేషన్ కాదు – 'లీగల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఛీటింగ్' అనుకున్నాడు కరుణాకరం కడుపుమండి.

పాలసీలు తీసుకొని లోన్ సెక్షన్ కెళ్ళాడు.

అక్కడొక అందమైన అమ్మాయి కాలిక్యులేటర్ నొక్కి లెక్కలు కడుతోంది.

"నమస్కారం మాస్టారూ" లేచి నుంచుందామె.

"సారీ! నువ్వు నాకు గుర్తురావటం లేదమ్మా!"

"నన్ను మీరు ఎపుడూ చూడలేదు మాస్టారూ! నేను మిమ్మల్ని చూసాను. నా పేరు మాలతి. మిసెస్ మాలతీలింకన్. మావారు మీ గురించి చెబుతూ ఉంటారు. ఆయనకి మీరంటే గౌరవం. మీ 'గ్రామర్ మేడీజీ' చదివాను మాస్టారు. ఈ ఉద్యోగం మీ పుస్తకం పెట్టిన బిక్షే. అన్నట్లు నేనడగలేదు ఇప్పటిదాకా–కాఫీ తాగుతారా టీ తాగుతారా?" నవ్వుతూ అంది.

"సంతోషం అమ్మా... నాకు ఏకలవ్య శిష్యులున్నారన్న సంగతి తెలిసింది. గ్రామర్ మేడీజీ రాసాను. కానీ అమ్మా మాలతీ! లైఫ్ ఈజ్ బికమింగ్ డిఫికల్ట్. దానికే గైడూ దొరకటం లేదు"

కరుణాకరం కళ్ళల్లో నీటిపొర మాలతికి కన్పించింది ఫిల్ములా.

"చెప్పండి మాస్టారూ... నేనేమైనా హెల్ప్ చెయ్యగలనా?"

"నాకు ఆరు పాలసీలున్నాయమ్మా! ఇల్లొకటి మొదలెట్టాను. పీటిమీద ఏమైనా లోన్ వస్తుందా చెప్పమ్మా" పాలసీలున్న కవరు మాలతికిచ్చాడు.

మాలతి జాగ్రత్తగా ఒక్కొక్క పాలసీ చూసింది.

"లింకన్ ఎక్కడున్నాడు?"

"ఇక్కడే డెవలెప్మెంట్ ఆఫీసరుగా ఉన్నారు. ట్రైనింగ్‌కి బొంబాయి వెళ్ళారు. మాది లౌమారేజ్"

"అలాగా...చాలా సంతోషం అమ్మా! మా కాలేజీ మేనేజరుగాడూ ఓ ఏజంటేనటమ్మా! మాకు ఎరియర్స్ వచ్చినప్పుడల్లా అందరిచేత ఓ పాలసీ చేయిస్తాంటాడు. లోనెంత వస్తుందంటావ్?"

"మీ కాలేజీలో భైరవమూర్తిగారిని ఏజంటుగా పెట్టింది లింకనే. మానేజర్ భైరవమూర్తి మంచి ఏజంట్‌ట. పట్టాడంటే వదల్డట. ఆయన్నందరూ బుల్ డాగ్ మూర్తిగారంటారు. ఈమధ్య శ్యామలానగర్‌లో పెద్ద ఇల్లు కూడా కట్టాడు" చెప్పుకుపోతోంది మాలతి–పేపర్‌మీద లెక్కలు వేస్తూనే. అంకెలు గుండ్రటి ముత్యాల్లా బాల్‌పెన్‌లోంచి పొగడపూవుల్లా రాలుతున్నాయి. మొత్తానికి చలాకీ అయినపిల్ల. కరుణాకరం సంతోషం ఎక్కువసేపు నిలువలేదు.

"ఇందులో రెండు పాలసీలు సాలరీ సేవింగ్స్ స్కీముపి మాస్టారు. మీ కాలేజీ వాళ్ళు ప్రీమియం డిడక్ట్ చేసి మాకు కట్టటం లేదు. అప్ టూ ఏప్రిల్ మాత్రమే కట్టారు. ఇంకా ఆరు వాయిదాలు డ్యూ. లోను చాలా తక్కువ వస్తుంది. రెండింటి మీదా మూడు వేలు రావచ్చు. అదీ కష్టం రెండు వేల ఎనిమిది వందలు రావచ్చు"

"ఒక పాలసీ క్వార్టర్లీ మీరు సరిగ్గా కట్టటంలేదు. లాప్స్ అయింది. ఏంకాదు... వేస్టు అయింది"

"మిగిలిన రెండూ ఒకటి హాఫ్ ఇయర్లీ, ఒకటి ఇయర్లీ. ఇవిచేసి ఇంకా రెండేళ్ళు కాలేదు. వాటికి లోన్ ఎలిజిబిలిటీ లేదు" పెదవి విరిచింది.

లెన్. కాఫీ తీసుకోండి. మూడు వేలది చెక్కు ప్రిపేర్ చేస్తాను. సాయంత్రం వచ్చిపట్టుకెళ్ళండి...నాలుగింటికి"

"థాంక్సమ్మా! చూడమ్మా మాలతీ... గ్రామర్‌మేడీజీ గురించి నువ్వు అంత గొప్పగా చెప్పావు... చాలా సంతోషంకానీ ... దానికి పబ్లిషర్‌ఏం ఇచ్చాడో తెల్సా?"

"తెలీదు మాస్టారూ"

"ఒక పూలదండ...అది ఆ రోజే వాడిపోయింది. ఒక్క శాలువా...ఒక్క ఉతుకులో వెలిసిపోయింది"

"నేను చిన్నపిల్లని మాస్టారూ! వాళ్ళు ఇన్నోసెంట్ ఈడియట్స్. క్రానీ దటీజ్ లైఫ్. క్రైస్ట్‌డిడ్‌నాట్ బ్లెస్డ్ ది లెప్పర్స్ ఫర్ థాంక్స్. హి డిడ్ ఇట్ బికాజ్ హి వాంటెడ్ టుడూ ఇట్-మీరు గ్రామరు చెప్పాలనుకున్నారు...చెప్పారు"

"చిన్నపిల్లవయినా బాగా చెప్పావమ్మా! లింకన్ నీచేత బైబిల్ అంతా బట్టీ పట్టించినట్లున్నాడు. చర్చికెళ్తున్నావా?"

"మేం చిన్నఇల్లు కట్టుకున్నాం సార్! మా ఇల్లే ఒక చర్చి. ఒకసారి రండిసార్! మా పాప పేరు కరుణామయి"

"గుడ్... వెరీగుడ్!గాడ్ ఈజ్ గ్రేట్" మనసారా అభినందించి ఇంటి ముఖం పట్టాడు కరుణాకరం.

కరుణాకరం పెంచుకున్న ముప్ఫయి వేల యల్.ఐ.సి. ఆశ మూడువేలకి పడిపోయింది.

ఈకాలం పిల్లలు ఎంత ప్రాగ్మాటిక్‌గా, ప్రాక్టికల్‌గా ఆలోచిస్తున్నారు. చదువు, పెళ్ళి, ఇద్దరూ ఉద్యోగం... వెంటనే ఇల్లు...ఫ్రిజ్...టి.వి.,స్కూటర్ ...కంఫర్ట్స్ ... లిమిటెడ్ ఫేమిలీ... యల్ యూనిట్స్. తనే పొరపాటుచేసాడు. 'అవిభక్త హిందూ కుటుంబాలు [illegible]చాలి' మెల్లిగా మనసులో అనుకున్నాడు.

డెబ్బయిఏడువేలుఎలాతేవాలి...ఎలాగ?

"యల్.ఐ.సి.వాళ్లు ఎంత ఇస్తామన్నారండీ?" పూర్ణ ఆతృత.

శ్లాబ్ ఆగిపోతుందని కంగారు,ఆవేదన నిస్సహాయత, నీరసం,దిగులు.

"మూడిచ్చారు"

"రిక్షాఖర్చు లొచ్చాయన్నమాట" వ్యంగ్యంగా అంది.

"ఈడియట్‌లా మాట్లాడకు- మూడు రూపాయలుకాదు...మూడువేలు"

"అవి ఎవరి ముక్కులోకి వస్తాయిరా కరుణా?" దీర్ఘంతీసింది తల్లి

"బంగారం బాంకులోపెట్టి అప్పు తీసుకోండి. అదికూడా చెప్పాలా? ఇల్లయ్యాక నెలనెలా అద్దెకడుతున్నాం అనుకొని కట్టేసి విడిపించుకోండి. కావాలండే నాపీ ఇస్తాను" అంది తల్లి కరుణాకరం అవస్థ చూడలేక.

మధ్యతరగతివాళ్ళకి బంగారం ధరించటానికి కాదు-అప్పుపుట్టించడానికి అవసరానికి ఆదుకోటానికి.

ఎలాగయినా పెద్ద తలకాయలు పెద్ద తలకాయలే.

ఎదురుగుండా ఇంట్లో ఉన్న బాంక్ ఆఫీసర్ శ్రీధర్ దగ్గరికి వెళ్ళాడు. శ్రీధర్ భార్య అన్నపూర్ణకి ఫ్రెండ్.

"రండి మాస్టారూ"

"ఇదిగో శ్రీధర్...గోల్డ్‌లోన్ కావాలోయ్...శ్లాబ్‌పని ఆగిపోయింది" డైరక్టుగా పాయింట్లోకి వచ్చేశాడు కరుణాకరం.

ప్రతిది ప్రైజ మాస్టారు. రిజర్వ్ బాంక్ కొన్ని నార్మ్స్ పెట్టింది. కష్టం. అర్బన్ బ్రాంచీల్లో మరీ కష్టం. రూరల్ సైడ్ వ్యవసాయదారులకిస్తాం" శ్రీధర్ మాటల్లో మాస్టారికి సహాయం చేయలేకపోతున్నాననే తపన, బాధ స్పష్టంగా వ్యక్తమయింది.

"కలాలే కానీ హలాలు పట్టలేదోయి శ్రీధర్! సాహిత్య వ్యవసాయం తప్ప లౌకిక వ్యవసాయంలో పీసమెత్తు అనుభవం లేదుమరి. శ్రీధరుడివి...నువ్వే ఏదో మార్గంచెప్పు" విషాదంగా నవ్వాడు కరుణ. ఎక్కడికి వెళ్ళినా చుక్కెదురవుతోంది.

"తప్పకుండా మాస్టారూ! మాబాంక్‌లో గ్రాముకి ఎనభయ్యో, తొంభయ్యో ఇస్తారు. యస్.బి.ఐ.లో నూటఇరవై ఇస్తారు. ఈ క్రైసిస్‌లో మనకి కొంచెం కలిసొచ్చినా కలిసొచ్చినట్లే. సిరిపురం యస్.బి.ఐ. బ్రాంచిమానేజర్ నా ఫ్రెండే. ఓ ఉత్తరం ఇస్తాను...మీరు వెళ్ళండి. గోల్డ్ ఇవ్వండి. లెటర్ ఇవ్వండి. రమణని నా క్లోజ్ ఫ్రెండ్. వాడు తప్పక ఇప్పిస్తాడు" అని వెంటనే లెటర్ హెడ్‌మీద నాలుగు వాక్యాలు రాసిచ్చాడు.

'డియర్ రమణా!

ఈయన మా మాస్టారు...శ్రీ కరుణాకరంగారు. వీరికి కావలసిందంతా చేసిపెట్టు. ఈయనో ఫిలాసఫర్ అండ్ గైడ్ టు మీ అండ్ మై ఫామిలీ.

—నీ శ్రీధర్'

"ఈ రమానివాసం ఎలా కట్టావోయ్ శ్రీధరం?"

"మాకు హౌసింగ్‌లోన్ ఇస్తారు సార్! దానితో ఇల్లుమాత్రం కట్టాను. అలంకరణ అంతా రమిడి. డబ్బు మా మామగారిది" సెలయేటి ప్రవాహంలా నవ్వాడు శ్రీధరం"

బాంక్ ఉద్యోగులకెన్ని సౌకర్యాలు.

"శ్రీధర్! బాంకులమీద బెర్నార్డ్‌షా జోక్ తెలుసా?"

"తెలీదు మాష్టారూ! మాకు కరెన్సీ నోట్లమీదున్న లిటరేచర్ తప్ప ఇంకేం రాదు"

"బాంకర్ అంటే ఓ గొడుగు అరువిచ్చి వర్షాలారంభంకాగానే వాపసు తీసుకొనువాడు'' జోక్ చెప్పాడు కరుణాకరం.

శ్రీధర్‌కి నవ్వాగలేదు.

"కానీ మన స్టేట్‌బాంక్ అలాంటిది కాదులెండి! వాళ్ళు అప్పులిస్తారు. మళ్ళీ వసూలు చేసుకోరు. ఎందుకంటే ప్రజలు తీర్చరని...తీర్చలేరని వాళ్ళకి తెలుసు. అప్పులు తీర్చలేనివారికి కావాల్సినంత అప్పుపెట్టే గొప్ప బాంకు మనది"

ఈమాటు కరుణాకరానికి నవ్వాగలేదు.

* * *

అమ్మ గోవర్ధనం గొలుసు, ఒక జత రైలుపట్టా గాజులు, పూర్ణ సైకిల్ చైన్, నెక్లెసు, రెండు జతల మిరియం గాజులు, బిందు గొలుసు, వీర చెయిన్, బాబి ఉంగరం, తన వెంకటేశ్వరస్వామి ఉంగరం-అన్నీ చేతిరుమాల్లో మూటగట్టుకొని వెళ్ళాడు.

అన్నపూర్ణ మంగళ సూత్రాలు నల్లపూసలకి గుచ్చుకొంది సెంటిమెంటల్‌గా. అవి తాకట్టబుల్ కాదు.

గోల్డ్ లోను ఇరవై అయిదువేలు వచ్చింది.

యల్.ఐ.సి.డీ, ఇదీ కలిస్తే శ్లాబ్!

ఆడపిల్లలు రోల్డుగోల్డు రింగులు పెట్టుకుంటే చెవులదగ్గర ఎలర్జీ వచ్చింది. పుష్ప

సుందరమ్మగారికి దుఃఖం పొంగుకు వచ్చింది. ఎప్పుడూ కంటతడి పెట్టని అన్నపూర్ణకి ఆరోజు ఏడుపాగలేదు.

*  *  *

వెంటనే శ్లాబ్ మొదలెట్టేస్తే బాగుండేది. కాని కరుణాకరం ఆలోచన్లు, నత్త నడకలు, మోహమాటాలు, రికమెండేషన్లు- అన్నీ కలిసి ఇరవైరోజులు ఆలస్యం అయింది. పెళ్లు ఆగుతాయి కాని కాల చక్రం ఆగదు.

శ్లాబ్ వేసాక వర్షం కురిస్తే మంచిదే. శ్లాబ్ బాగా గట్టిపడుతుంది. వర్షంకురిస్తే మాత్రం శ్లాబ్ వెయ్యరు.

హసన్ కంపెనీలో పెద్ద మేస్త్రీ పానకాలు.

వాడు చిలక్కొట్టుడు సామానుతో ఓ పెద్ద ఇల్లు కట్టాడు. నాలుగు భాగాలు అద్దెకిచ్చాడు. పైన వాడుంటాడు. ఓవర్ హెడ్ టాంకుంది. అన్ని పోర్షన్సుకి సప్ మీటర్లున్నాయి. పంపులున్నాయి. ఇంజనుంది. బావి వుంది. గోపీ కలర్ వేసిన పానకాలు మేడ దోర జాంపండులాగా ఉంటుంది. పానకాలు మేడ అనిచెప్తే రిక్షా వాడు కూడా తీసుకెళ్తాడు.

"పానకాలూ ... మన శ్లాబోయి"

"దీనికి మీరెందుకొచ్చారు పంతులు గారూ! కాకితో కబురెట్టితే లూనామీద వచ్చెయ్యనా?"

కరుణాకరం డొక్కు సైకిలు స్టాండు వేసాడు. అది సరిగ్గా పడలేదు. గోడకి ఆనించాడు. పానకాలు కొత్త లూనా ముందు అతని సైకిలు దిష్టిబొమ్మలా... పాత ఇనుప సామానులావుంది.

"గుంటూర్లో కాకుల్లేవోయి పానకాలు! మన సొసైటీవాళ్ళు కాకుల్ని కొట్టి గద్దలకి వేసేసారు ... అందుకు నేనే

"కరెట్టుగా సెప్పినారు పంతులుగారు! రాజుల సొమ్ము రాళ్ళపాలని సామెత. సొసైటీ సొమ్ము బార్లపాలవుతోంది. జోరీగల రెడ్డి నిజంగా పండిపోయాడనుకోండి. కూకోండి...టీ తెస్తాను"

త్రీ ఈగిల్స్ బార్ పెట్టకముందు రెడ్డి ఈగలు తోలుకుంటూ అరుగులమీద కూర్చునేవాడు.

"జోరీగలు కాదు- పానకాలు! త్రీ ఈగిల్స్...అందుకే నేను గ్రద్దలన్నాను"

పానకాలు టీ తెచ్చాడు. అచ్చు అది పానకాల టీలాగానేవుంది.

"నువ్వే చేసావా?"

"అవునండి. మా ఆడోళ్ళు పొగాకు పనికెళ్ళారండి"

పానకాలు సార్థక నామధేయుడు. ఎంతొచ్చినా సగం దాస్తాడు.

"పానకాలూ...మన శ్లాబోయి"

"మీరట్లా నీరు కారమకండి. బాగుండదు. నాకు మా చెడ్డకోపం. ఏద్దాంలెండి. ఎంతసేపు...ఏసేద్దాం. ఈవారం వర్షాలు తగ్గనీండి"

పానకాలు దృష్టిలో చిన్నపని అది.

*  *  *

గడియారం తిరుగుతోంది.

కాలెండర్లో కాగితాలుచిరుగుతున్నాయి.

బీరువాలో పెట్టిన డబ్బు తరుగుతోంది.

అప్పుల తాలూకు వడ్డీలు పెరుగుతున్నాయి.

కరుణాకరానికి మానసికంగా దిగులుతో బాటు శారీరకారోగ్యం కూడా దెబ్బతింది.

పొడి దగ్గు, ఆయాసం, టెంపరేచర్- పైగా పైల్సు. కాలేజీకి శెలవు పెట్టాడు. బాగా ఖాయిలాపడ్డాడు. మనిషి సగం

అయ్యాడు.

ఇల్లు మనిషిని తింటుంది అంటే ఇదేనేమో!

"రేపట్నుంచి శ్లాబేద్దాం పంతులు గారూ" అంటూ వచ్చాడు పానకాలు హుషారుగా.

"స్లాబ్వేసేటప్పుడు కూలీలకి అన్నం పెట్టాలి. మేస్త్రీకి పంచెలు పెట్టాలి...అది రివాజు" అన్నాడు.

వంటమనిషి ఎందుకని సుందరమ్మ గారే చెయ్యి చేసుకుంది. పూర్ణ వడ్డించింది. ఆడపిల్లలు సాయంచేసారు. శ్లాబ్ మొదలైంది.

"బాబిగాడేడి?"





"గారడీకెళ్ళాడు" వీర సమాధానం.

"ఎక్కడ?"

"విజయాలో...కృష్ణగారడీకి"

"ఇంత హడావుడిలోనూకూడా వా
కిల్లుపట్టదేమిటి?" విసుక్కున్నాడు కరుణ.

పానకాలు దయవల్ల శ్లాబ్ పడింది. ఇర
ఒక్కరోజులు నీటిలో తడపాలన్నారు
దానికోసం ఓ కుర్రాడిని పెట్టారు. రోజు
పది రూపాయలు. రోజూ సాయంత్ర
వెళ్ళి చూస్తున్నాడు కరుణ.

...మా తాతగారు చేసినఅప్పు మా నాన్న తీర్చకుండానే పోయాడు. అది తడిసి మోపె డైనట్టు నాలుగు లక్షలయింది. నేనూ దాన్ని తీర్చను. నేను మాత్రం ఎందుకు తీర్చాలి. మా పిల్లలు తీర్చుకుంటారు. ఈలోగా నల్లకోట్లవాళ్లు లాగి స్తుంటారు...

పులిమీద పుట్రలా అన్నపూర్ణ వేలు ...డిచిన మేనమామ పుండరీకాక్షయ్యగారు ...గారు సర్కారుకి. వాళ్ళ చిన్నబ్బాయికి ...ంటూరులో కొత్తగా పెట్టిన సబ్బుల ...ంపెనీలో ఇంటర్వ్యూలాంటిదివచ్చిందిట. ...ంకా టైముంది. ఈ లోపల ఏదైనా ...పయత్నం చెయ్యచ్చనే ఉద్దేశంతో వచ్చా ...ాయన.

ఐ.యల్.టి.డి.కంపెనీలో వాసుగారని ...నేజర్. ఆయనచేత సబ్బుల కంపెనీ ...గారికి చెప్పించాలి.

"వాసుగారు నాకు తెలీదు"

"తెలిసేదేముంది కరుణా ... పరి ...యం చేసుకుందాం"

"నేను రానులెండి .... నాకు ఇంటి నుంది"

"అది చూసుకుని అటే పోదాం... ...డుగా రావోయ్. నువ్వేం మాట్లాడొద్దు. ...న్ను చూపించి ఫలానా కాలేజి ...క్చరర్ అనిచెప్తాను ... మాటల్లోదింపి ...ళ్ళింటి పేరూ ... గోత్రం... తిరగేసి ...ట్టరికం కలుపుతాను ... నాపని ...యించుకుంటాను. నీకేం ఇబ్బందుం ...దు. కాదనకు...పదపోదాం"

ఎంత ప్లాన్ వేశాడీయన?

వాడుకుంటానంటారు"

"ఇంటల్లుడిని అంతమాటంటానా?"

"సరే...పదండి"

కాలనీ కెళ్ళారు. పుండరీ మామయ్య గారు ఇల్లంతా చూసారు.

"ఎంతయిందీ?"

"ఇప్పటికి లక్ష! ఇంకా పనుంది- ఫ్లోరింగ్ ... ప్లాస్టరింగ్ ... కలర్స్ ... బావి...పంపు...మోటారు"

"మొత్తానికి మీ నాన్న కంటే ప్రయోజకుడివి అన్పించావు. సంతోషం. బావుంది. గుడ్...వెరీగుడ్"

"ఏదోలెండి ... అన్నీ అప్పులే"

"అప్పులేనిదెవరికి. నాకు నాలుగు లక్షల అప్పుంది. అప్పు చెయ్యటానికి భయపడే మీ నాన్న ఇల్లు కట్టలా. తెలీ కడుగుతాను కానీ ... అప్పులేనిదెవడికో చెప్పు. అప్పులేనివాడిని చూపిస్తే ... చెప్పుతో కొట్టించుకుంటా"

"తీర్చద్దూ" సాగదీసాడు కరుణ.

"ఎవరు ఎవరికి తీరుస్తున్నారోయ్...నీ ...దస్సం బంగారంకాను. రాష్ట్రంకేంద్రానికి తీరుస్తోందా? కేంద్రం యునెస్కోకి తీరుస్తోందా? అసలు అమెరికాలో మనిషి విలువ అప్పునిబట్టి నిర్ణయిస్తారట. ఎంత అప్పుచేస్తే అంత గొప్పవాడు. క్రెడిట్ వర్దీనెస్. అది ముఖ్యం. నీకు అప్పు దొరికిందంటే ఈ సమాజం నిన్ను గుర్తించిందన్నమాట. అప్పుకి భయపడ కూడదు. తీర్చం...తీర్చంగాక తీర్చం... అంతే దట్సాల్"

"వడ్డీపడదూ"

"పడుతుంది...పడనీ. అసలుకే లేని భయం వడ్డీకెందుకు? "అదీ తీర్చం"

"మరి ఎలాగ ... సర్క్యులేషన్ కావద్దూ"

లాగిస్తాం. అందుకే దాన్ని 'లా'అన్నారు. ఏళ్ళూ పూళ్ళూ గడుస్తాయి. మా తాతగారు చేసినప్పు మా నాన్న తీర్చకుండానే పోయాడు. అది తడిసి మోపెడయి నాలుగు లక్షలయింది. నేనూ తీర్చను. నేను మాత్రం ఎందుకు తీర్చాలి. మా పిల్లలు తీర్చుకుంటారు. ఈలోగా నల్ల కోట్లవాళ్ళు లాగిస్తూంటారు. కోట్ల కొలదీ అప్పుల్ని బాంకులవాళ్ళు మాఫీ చెయ్యంటంలా. అదంతా నల్లకోట్ల పుణ్యమే. ఈ నల్లకోట్లవాళ్ళున్నారు చూసావ్ .... మహామేధావులోయ్"

పుండరీగారి మాటల్తో అప్పంటే భయం పోతుంది ఎవరికైనా. కానీ ఆయనకింకో పిచ్చి ఉంది. అది వదలదు. గజ్జి, తామరలాంటిది-వాస్తుపిచ్చి.

"వాస్తుంది చూసావుటోయ్ కరుణా... అది మహా పెద్ద శాస్త్రం. ఇంటినీ..ఇల్లు కట్టినవాడినీ కట్టికుడుపుతుంది ... వాస్తు సరిలేకపోతే. ఇంటికి, మనిషికీ కనిపించని లింకు వాస్తు శాస్త్రం"

"మా ఇంటి వాస్తు బాగానే ఉందా?" అప్పు భయంపోయి వాస్తుభయం బయలుదేరింది కరుణాకరానికి.

కత్తిపోయీ కర్రావచ్చె ఢాం ఢాం ఢాం.
కర్రాపోయీ రొట్టొచ్చె ఢాంఢాంఢాం.
రొట్టెపోయీ పిల్లావచ్చె ఢాం ఢాంఢాం.

చిన్నప్పటి పిల్లల పాట గుర్తుకు వచ్చింది కరుణాకరానికి.

"అంతా బాగానే ఉంది కానీ హాల్లో అంత పెద్ద కిటికీ ఉండకూడదు. అలా ఉంటే జనాకర్షణేతప్ప ధనాకర్షణ ఉండదు. ఎంతొచ్చినా నిలవదు. జల్లెల్లో నీళ్ళలా కారిపోతుంది. కనుక అది తగ్గించు. అయినా ఎవరైనా బాగా తెలిసిన సిద్ధాంతి నడుగు...వాళ్ళే చెప్తారు. పెద్ద కిటికీ

కరుణాకరం మనసు పది ముక్కలైంది. ముక్కలయిన వానపాము ఏ ముక్కకాముక్క కదిలినట్లు ఏముక్క కాముక్క విడిపోయి ఆలోచిస్తోంది.

ఒక ముక్క అప్పుల గురించి
ఒక ముక్క వాస్తు గురించి
ఒక ముక్క కాలేజి గురించి
ఒక ముక్క జీవితం గురించి
ఒక ముక్క బిందు పెళ్ళి గురించి
ఒక ముక్క గృహప్రవేశం గురించి
ఒక ముక్క బాబిగాడి సినిమా పిచ్చి గురించి
ఒకముక్క తన అనారోగ్యం గురించి..

ఇలా వాటిష్టం వచ్చినట్లు అవి ఆలోచించుకుంటూన్నాయి - కరుణాకరంతో ప్రమేయం లేకుండా.

దేవుడి దయవల్ల వాసుగారు ఊళ్ళో లేరు. కలకత్తా వెళ్ళారట. నెలరోజుల దాకా రారట.

వాస్తు భయం, కిటికీ భయం ... కరుణాకరానికి ఇంజక్టు చేసి పుండరీగారు కాకినాడెళ్ళారు.

మనసు సలుపుతోంది కరుణాకరానికి.

ఎంతో ముచ్చటపడి పెట్టించుకున్నాడా పెద్ద కిటికీ. దానికి మామూలు ఇనుప ఊచలు వాడకుండా అందమైన డిజైన్‌లో గ్రిల్ చేయించాడు. గులాబీపూల డిజైన్. ఆ గ్రిల్ అందరూ బాగుందన్నారు. కిటికీ తలుపులు, అందమైన చెక్క ఫ్రేంకి మధ్యన ఓ పేక్ గ్రౌండ్ గ్లాసులు లేతాకుపచ్చవి పెట్టించాలనుకుంటున్నాడు అతని దృష్టిలో ఆ కిటికీ ఒక డ్రీమ్... ఒక కల.

కిటికీ తెరిస్తే గాలీ, వెలుతురూ బాగా

కిటికీ తెరిస్తే రోడ్డుమీద సందడి కన బడాలి.

అసలు మదికీ, గదికీ కిటికీలవసరం.

కిటికీ తెరిస్తే ఫ్రంట్ యార్డ్‌లో పెంచ బోయే ప్రెసిడెంట్ రోజ్‌కి కొమ్మ చివర తొడిగిన బుల్లి గులాబి మొగ్గ కనిపించాలి.

కిటికీ తెరిస్తే ఆకాశం కన్పించాలి.

కిటికీ తెరిచి తనూ, పూర్ణా ఆకాశపు క్షితిజ రేఖలో ఆనందంగా పిల్లల భవిష్యత్తుని ఆశగా వూహించుకు చూడాలి. కిటికీ తీసెయ్యమంటాడేమిటీ ఈ ముసలాయన?

ఎందుకైనా మంచిదని సిద్ధాంతిగారి దగ్గరకెళ్ళాడు. ఆయన గుంటూరులోనే అరండల్ పేట చివర ఉంటారు. ఆయనకి సినిమా హాల్సువాళ్లు పెద్ద పార్టీలు. శాస్త్రం బాగా తెలుసు. ఆయన పేరు ఎవరికి తెలీదు. సిద్ధాంతిగారు అంటే అందరికీ తెలుస్తుంది. వడ్ల మిల్లుల దగ్గర్నుంచి గోల్డ సావళ్ళదాకా కావల్సిన వాస్తంతా ఆయనకి కరతలామలకం.

"తమరి నామధేయం?"

"కరుణాకరం"

"బాగుంది"

"కిటికీ పెద్దది ఉండవచ్చా?"

"ఏ కిటికీ?"

"హాల్లో"

"ఏ హాల్లో?"

"ఇంటి హాల్లో"

"ఏ ఇల్లు?"

"బాలాజీనగర్ కాలనీలో నేను..." ఆలసిపోయాడు కరుణాకరం.

"కాలనీ మొదలుపెట్టేముందు..." గట్టిగా పొడుం పీల్చారు సిద్ధాంతిగారు. సెంటెడ్ స్నఫ్. వాసన బాగుంది.

ఏమంటే ఏమవుతుందో.

'ఈయన తలుపే తీసేయమనచ్చు. గోడపడ గొట్టమంటాడేమో!'

"రామనాథం ప్లాను నాకు చూపాడు. నేను ఆశీర్వదించాను. అందులో వున్నట్లయితే పరవాలేదు. మారిస్తే నేను చూడాలి... చూస్తేగానీ చెప్పలేను"

"మార్చాను" నిజం చెప్పాడు కరుణాకరం.

"ఏం చేసారు?"

"పెద్దది చేసాను.. అదే చేయించాను"

"ఇలాంటివి పెద్దల్ని....పండితుల్ని...లబ్ధ ప్రతిష్టుల్ని అడక్కుండా చెయ్యకూడదు. అయినా పరవాలేదు... నేను ఆశీర్వదిస్తాను"

"ఏం చెయ్యాలో చెప్పండి... అది నేను మోజుపడి పెట్టించుకున్నాను" కరుణాకరం గొంతులో నిస్సహాయత.

"పెద్ద కిటికీ ఉంది చూసారూ... తూర్పువైపు ఉండొచ్చు. శాస్త్రం ఒప్పుకుంటుంది. కానీ దక్షిణం వైపుంటే కొంచెం పరవాలేదు. పడమర పనికిరాదు. ఉత్తరం నీచం... నిషిద్ధం... శాస్త్రం ఒప్పుకోదు" తేల్చేసారు సిద్ధాంతిగారు.

"మా ఇంటి కిటికీ తూర్పునే ఉంది"

"ఎందుకైనా మంచిది. పెద్ద కిటికీ కదా– శుక్రుడు, శని మంచివాళ్ళుకారు. శనైశ్చరతి అన్నారు. వాడిది కుంటి నడక. శుక్రుడు మహామేధావి. కానీ ఏకాక్షి. వాడి వీక్షణం మంచికి కాదు... చెడుకి తప్ప"

వాళ్ళంతా ఏ విజయవాడలోనో, హైదరాబాద్‌లోనో ఉన్నట్లూ, వచ్చి చూసిపోతున్నట్లూ మాట్లాడుతున్నారాయన.

"నన్నేం చెయ్యమంటారో సెలవీ

యండి"

అప్పటికి చేప ఎరసుచూసి గాలాన్ని కొరికింది.

"అట్లా అడగండి. భేషైన మాట చెప్పారు. రెండు కుంచాలు మినుములు శుక్రశాంతికి... రెండు కుంచాలు కందులు శనికోసం దానమివ్వండి"

"ఎవరికిమ్మంటారు?"

"మావాడిని పంపుతాను"

"కుంచాలు లేవు గదండి"

"కుంచం అంటే సుమారుగా మూడు కిలోలు. నా దక్షిణ పాతిక. కిటికీ ఉంచండి.... ఫరవాలేదు"

సిద్ధాంతిగారు పెద్ద బేండే వేసారు కరుణాకరానికి. ఉసూరుమంటూ బయట పడ్డాడు.

కరుణాకరం సైకిలు తొక్కుతున్నాడు.

వెనకాల సిద్ధాంతిగారబ్బాయి బుల్లెట్ మీద వస్తున్నాడు.

దేవుడా...
రక్షించు నా దేశాన్ని
పెద్ద మనుషులనుండీ...
పెద్ద పులులనుండీ
రెండు నాల్కల సర్పాలనుండీ
లక్షలాది దేవుళ్ళనుండీ
వారి పూజారులనుండీ
వారివారి ప్రతినిధులనుండీ
సిద్ధాంత కేసరులనుండీ
సిద్ధులనుండీ... అమ్మలనుండీ... బాబాలనుండీ
శ్రీమద్గురువుం నుండీ
దేవుడా...రక్షించు...రక్షించు!

మనస్సులోనే ప్రార్థించుకున్నాడు కరుణాకరం. అసలు ఈ గేయాన్ని జాతీయ గీతంగా పెట్టాల్సింది-అనిపించిం దతనికి.

సిద్ధాంతిగారి చలవవల్ల తన డబ్బుతో కట్టిన, తనకి అత్యంత ప్రియమైన తన కిటికీని ఎవ్వరూ లీసెయ్యకుండా వుంచుకోగల్గాడు అతి కష్టం మీద.

ఇంటికెళ్ళేటప్పటికి పానకాలు అన్నపూర్ణకి ఫ్లోరింగ్ గురించి లెక్చరిస్తున్నాడు.

కరుణాకరాన్ని చూసి క్షణం ఆగి మళ్ళీ మొదలెట్టాడు. పేం కుర్చీలో నడుం వాల్చాడు కరుణాకరం.

"డబల్ పాలిస్ నల్ల గార్నైటు వెస్తండి"

"గార్నైట్ కాదోయి పానకాలు. గ్రానైటు. అయినా అది మనవల్లకాదు. అది సినిమా తారలకీ, రాజకీయనాయకులకి, వ్యాపారస్థులకి...బ్లాక్‌మనీ ఉన్న ధనవంతులకి బ్లాక్ గ్రానైటు బాగుంటుంది"

"పోనీ మసాయిక్కేయండి" పానకాలు సలహా.

"మొజాయిక్ బాగుంటుందండీ" పూర్ణ సరదా.

"డబ్బుల్లేవు... మొజాయిక్ వద్దులే. ఏదైనా చీప్‌లో చూడు. రెడాక్సైడో... ఇంకేదన్నా?" అన్నాడు కరుణాకరం.

"అదొద్దులెండి. బేతంచెర్ల ఎలదాం రండి ... రెండు లారీలైతే సాలు. సదరపడుగు సుమారు రెండూ తొంబయి అయిదు పైసలండి. కానండి మొనగాడి రాయండి. పాల్లోవా బిళ్ళలాగుంటుంది''

"అదేంటయ్యా! బాటా రేట్లున్నట్లు ఉన్నాయి" అంది అన్నపూర్ణ.

"మామూలు కడప రాళ్ళెయ్యవయ్యా! పెద్దమ్మాయి పెళ్ళికి మార్పిద్దాం. ఇప్పటికే చాలా అయ్యింది"

"బలే ఓరండీ... పెళ్ళంటే కరుసు. అప్పుడసలు కుదద్దు. కట్నమే ఇస్తారా?

ఫ్లోరింగే మార్పిస్తావా?"

"అలా చెప్పవోయ్ పానకాలూ" అన్న పూర్ణకి హుషారొచ్చింది. కరుణాకరాన్ని ఎవరయినా మందలిస్తూంటే పూర్ణకి మహా సరదా. అతనికి లౌక్యం తెలీదని అన్న పూర్ణ గాఢనమ్మకం.

"చేసేదేదో కొంచెం ఎక్కువైనా ముందే చేయించుకోవటం మంచిదిరా నాయనా! రానురాను ధరలు పెరిగి పోతాయి" అంది ముసలమ్మగారు.

"సేతంచెర్లరాయి మా మేడమ్‌గారింట్లో వేయించారు దాదీ...బాగుంటుంది" అంది సీర. అది లోకబాంధవి. దానికి అందరిళ్ళ సంగతీ తెలుసు.

"ఆలోచిద్దాం''

ఖర్చుకి అప్పు చేయాలి. ఈమాట బయట ఎక్కడ? నోట్లిచ్చి ప్రోనోట్లు ఎవరు తీసుకుంటారు ... ఎవరు తీసు కుంటారు?

* * *

ఆలోచించి ... చించి... అన్నగారికి, తమ్ముడికీ ఉత్తరాలు రాసాడు కరుణా కరం.

'మ॥రా॥ శ్రీ అన్నయ్యకి,

కరుణ నమస్కులు. ఇక్కడంతా క్షేమం. ఉభయకుశలోపరి. మా॥ఆ॥స వదినా, చి॥లావణ్యా క్షేమం అని తలుస్తాను.

అమ్మ ఆరోగ్యం అలాగే ఉంది. ఇల్లు దాదాపు పూర్తయింది. అయినా ఇంకా బోలెడు పనుంది. ఇంకా ఫ్లోరింగ్, ప్లాస్ట రింగ్, కాంపౌండ్ వాల్, బావి మిగిలి పోయాయి.

ఉన్న డబ్బూ, అడి వచ్చేమార్గాలూ అన్నీ అయిపోయాయి.

నువ్వు ఒక పదివేలు సర్దితే మిగిలింది ఎక్కడయినా చూసుకుంటాను. అవసరం అలా ఉంది.

నిన్ను ఇబ్బంది పెట్టటం ఇష్టం లేకపోయినా తప్పటంలేదు. అమ్మా, పూర్ణా కూడా రాయమన్నారు నీకు.

వీలుచేసుకుని డి. డి. పంపితే తప్పక లావణ్యా పెళ్ళి టైంకి ఇచ్చేస్తాను.

జవాబుకోసం ఎదురుచూస్తాను.

ఇట్లు నీ తమ్ముడు'.

'చి॥ చిట్టిబాబుకి,

అన్నయ్య ఆశీర్వదించి వ్రాయునది.

కాలనీలో ఇల్లు ప్రీఫోర్త్ అయింది. ఇంకా కొంచెం పైకం కావాలి. ఓ పది వేలు సర్దగలవా? అమ్మ, వదినా, పిల్లలు నిన్నడిగినట్లు రాయమన్నారు. మరదలు ఆరోగ్యం ఎలా ఉంది...జాగ్రత్త. ఢిల్లీలో చలి ఎక్కువగా ఉందని పేపర్లలో చూసాం. ఉన్ని దుస్తులు వాడండి. పండి వాడికి మాటలొచ్చాయా? నీ జవాబుకోసం ఎదురుచూస్తాం.

ఇట్లు నీ– చిన్నన్నయ్య'.

ఉత్తరాలు రాసిన రెండో రోజునుంచే పోస్టుమాన్ కోసం ఎదురుచూడటం మొదలెట్టాడు కరుణాకరం.

ఈమాటు స్పాట్ వాల్యుయేషన్ కూడా ఇంటిపని మూలకంగా మానేశాడు. స్పాట్ కెళితే ఓ రెండు వేలొస్తుంది. కానీ ఇంటిపని వదిలేసి వెళ్ళటం కుదరదు.

రావలసినవి రావు.

ఇవ్వాల్సినవి తప్పవు.

ఎప్పుడూ లోటుబడ్జెటే.

చిట్టిబాబుని ఐ.ఐ.టి.లో మద్రాసులో చదివించింది తనే. తప్పక సహాయం చేస్తాడని నమ్మకం ఉంది. పైగా చిట్టికి పిల్లలంటే అమిత ఆపేక్ష. అన్నపూర్ణకి అనుంగు మరిది. లక్ష్మణస్వామి వంటి

పాడు.

అన్నయ్యా కూడా పరిస్థితినర్థం చేసుకోగలడు. పైగా ఇంటికి నాన్నగారి పేరు కలిసేటట్లు 'పురుషోత్తమ నివాస్' అని పెట్టమని చెప్పింది అన్నయ్యే.

హైదరాబాద్ నుంచీ కార్డు...పదిహేను పైసలు. నాలుగే నాలుగు కలిపి రాతలో.

'బాగ్‌లింగంపల్లిలో ఫ్లాట్ తీసుకున్నాను. ఉన్నదంతా కట్టేయాల్సివచ్చింది. నెంబరింకా ఎలాట్ కాలేదు. చి॥సౌ॥ లావణ్య యూనివర్సిటీలో తన రీసెర్చి గైడ్ సేతుమాధవన్‌ని రిజిష్టర్ మారేజి చేసుకుంది. వాళ్ళు ఈస్ట్ మారేడుపల్లిలో ఉంటున్నారు. దానికి అన్నీ కొనివ్వాలి.

నీకు సహాయం చేయలేకపోతున్నందుకు నేనూ, వదినా విచారిస్తున్నాం. విషయాలు అమ్మకి చెప్పు-అన్నయ్య...'

ఇన్‌లాండ్ లెటర్ చింపాడు కరుణాకరం.

'చిన్నన్నయ్యకి,

పురుషోత్తమ్ నివాస్ పూర్తవుతున్నందుకు కంగ్రాట్స్. నన్ను కంపెనీవాళ్ళు హయ్యర్ ట్రైనింగ్‌కు స్టేట్స్ పంపుతున్నారు. మాది మల్టీ నేషనల్ కదా. హెడ్డాఫీసు స్టేట్స్‌లో ఉంది. ఎగ్జాట్‌గా నేను వెళ్ళేది 'ఇథాకా'...న్యూయార్క్‌కి నార్త్ వెస్ట్‌గా సెన్‌దాస్ వసవర్ ప్లెయిన్. అక్కడ లిక్విడ్ క్రిస్టల్స్‌లో రీసెర్చి జరుగుతోంది.

విజయ, చంటి కూడా నాతో వస్తున్నారు.

చాలా క్రూషియల్ మూమెంట్లో అడిగావు...బట్ మై హేండ్స్ ఆర్ టైట్ సారీ...ఏమనుకోవద్దు.

అమ్మకీ, వదినకీ సమస్కారములు.

ఛీర్స్ టు బిందు, బాబీ అండ్ పీడూ.. ఎయిర్ టిక్కెట్స్, పాస్‌పోర్ట్స్, వీసా వచ్చాయి. లండన్‌లో ఆగాలనుకుంటున్నాము. సీయూ ... చిట్టిబాబు.

ఉవ్వెత్తునలేచిన గాజు కెరటాలు విరిగి నేలమీదపడి ముక్కలు ముక్కలుగా, చిందరవందరగా, తుంపులు తుంపులుగా పగిలిపోయాయి. ఎక్కడ చూసినా గాజు పెంకులు ... బాకుల్లా ... బాకుల్లా ... కత్తుల్లా...గాజు పెంకులు.

కలలాంటి కలత నిదురలో సీసలు నిలువుగా, పొడుగ్గా ఉన్నాయి. అందరూ ఎంత ఎత్తుకి ఎదిగిపోయారు. తను మాత్రం...లేజీగా...రిప్‌వాన్ వింకిల్‌లా ... శాపం పొందిన ఊర్మిళాదేవిలా నిద్రపోయాడు ఇన్నాళ్ళూ.

తను అనుకున్నదేమిటి? జరిగిందేమిటి?- మథనపడ్డాడు కరుణాకరం. నిర్లిప్తంగా నిలబడిపోయింది పూర్ణ.

"ఎంత రిజిష్టరు పెళ్ళి అయితే మాత్రం ఉత్తరం ముక్క రాయలేడా? ఎందుకూ నా కడుపున చెడబుట్టాడు''

ఆరోజు సుందరమ్మగారు అపరకాళిలాగా, పూనకం వచ్చిన గణాచారిలా ఉంది.

"పోనీ చంద్రానికి రాస్తే?" అన్నాడు కరుణాకరం.

"వద్దు...రాయొద్దు మనం ఇద్దరం రాజమండ్రి వెళ్ళి...విశాలకీ, అతనికీ పరిస్థితి చెప్దాం. అతను అర్థం చేసుకోగలడు" అంది పూర్ణ-ఒక నిశ్చయానికి వచ్చినట్లు.

"రిటైర్డ్ ఇన్‌కంటాక్సు ఆఫీసర్‌గారు పుల్లవేస్తారేమో?"

"అటే చూద్దాం. ఇదేం ముష్టికాదుగా. ప్రోనోటు రాసిద్దాం. ఆయనకి అసలు కంటే వడ్డీయే ముద్దు" ఆరోజు పూర్ణకి

కోపం రావటం తొలిసారిగా చూసాడు కరుణాకరం.

* * *

లేడిని తిన్న కొండచిలువలా బద్ధకంగా సాగుతోంది రైలు. మొహం మీద కంతి లేచినట్లు కంపార్టుమెంటు తలుపు దగ్గరగా గుంపుగా జనం. వేళ్ళాడుతున్నారు. రిజర్వేషన్ అనేది పేరుకే.

జనం... జనం.. ప్రభంజనంలా జనం ఎక్కుతున్నారు. ముసలీ ముతకా ... పిల్లా జెల్లా....





ట్రంకుపెట్టెలు ... సూట్ కేసులు... ట్రావెలింగ్ బాగులు ... విప్పేసిన మంచాలు ... స్టీలు గిన్నెలున్న గోనె సంచులు...తట్టలు...

బీడీలు కాల్చేవారు.చుట్టరికాలు కలుపుకుంటూ చుట్టలింటించేవారు....చార్మినార్ బాబులు...

పుట్టింటివారిచ్చిన కొత్తచీరలో మెరిసిపోతున్న వెన్నెలరంగు ఆడకూతురు... స్కూటరివ్వలేదనే కోపంతో భార్యతో పలక్కుండా ప్రకృతిని తీవ్రంగా కోపంగా చూస్తున్న కొత్త అల్లుళ్లు...దగ్గుతున్న ముసలాయనకి టాబ్లెట్టు ఇస్తున్న ముసిలి ముత్తయిదువ బామ్మగారు...

'ఈనాడు'లో రాజకీయాలు చర్చిస్తున్న ఆంధ్రా ఎక్స్‌ప్రెస్...గాంధీగారి బఠాణీపప్పు పేపర్లో వేయించిన పప్పులమ్ముతున్న ఎర్రబనీను కుర్రాడు..కరుణాకరం కళ్ళు రైలుపెట్టెను రివ్యూ చేసాయి.

రెండు చెక్క ముక్కలకి వేలు అడ్డం పెట్టి రెండో చేత్తో కొత్తరకం మ్యూజిక్ ఇస్తున్న గుడ్డిదంపతులు యాసగా పాట పాడుతున్నారు.

రైలుపెట్టె ఇండియాకి దర్పణం లాంటిది.

గుడ్డిజంట పాట మార్చారు.

'పయనించే ఓ చిలకా
ఎగిరిపో పాడైపోయెను గూడూ'

టక్కు...టక్కు...టకటక్కు టక్కు.

"వాళ్ళకో పదిపైసలు వెయ్యండి...పోతారు" అన్నపూర్ణ సెంటిమెంటు చెబుతోంది.

కోపం వచ్చి కరుణాకరం అర్ధరూపాయి వేసాడు.

జోడి పక్షులు అక్కడినుండి కదిలారు.

ఈసారి వాళ్ళు ఎందుకోగాని పాట మార్చారు.

వెనక పెట్టెలోనుంచి వాళ్ళ పాట వినబడుతోంది.

"గూడంటే గూడూకాదూ
మేడంటే మేడాకాదూ
పదిలంగా నేసిన పూరిన
పొదరిల్లు మాది...
పొదరిల్లు మాది...
టక్కు...టక్కు...టక టక్కు టక్కు"

రాజమండ్రి వచ్చినా పనికాదేమోనని భయపడుతున్న అన్నపూర్ణ మొహం విప్పారింది.

కరుణాకరానికి సిక్స్త్‌సెన్స్ చెబుతోంది.

చంద్రం దగ్గర డబ్బు అప్పు దొరుకుతుంది.

అదృష్టవశాత్తూ ఇన్‌కంటాక్స్ ఆఫీసర్‌గారు లేరు. అసలు [illegible]లేదు. అప్పులు ... వడ్డీలు వసూలు చేసుకోటానికి పిఠాపురం వెళ్ళారు.

ఆయన నెలకోసారి పిఠాపురం వెళ్తారు. తెలిసీ తెలీనివాళ్ళు బాకీల వసూళ్ళకని అంటారు. తెలిసినవాళ్ళు ఉన్నది వదుల్చుకోటానికని అంటారు. ఆయన ఇన్‌కం మీద టాక్స్ వేసేందుకు అక్కడో పీటలమ్మ వాసుంది.

అన్నపూర్ణకి, విశాలకి చిన్నతనంలో తల్లిపోయింది.

కరుణాకరం చంద్రానికి ఇంటికథ పాయింటు పాయింటుగా వివరాలు చెప్పినట్లు చెప్పాడు.

మధ్యతరగతివాడి స్వంత గూడు వెనుక ఎంత గోడు!

కరుణాకరానికి ఎలాగయినా సహాయం చెయ్యాలనుంది చంద్రానికి. విశాల చంద్రాన్ని ప్రోత్సహించింది.

తల్లిలేకపోయినా తనే తల్లిలా పెంచింది విశాలిని పూర్ణ. కానీ పూర్ణ పెద్ద కుటుంబంలో పడింది.

కరుణాకరం కూడా పెద్ద సంపాదనాపరుడు కాదు...పెద్ద కుటుంబంనుంచి విడిపోయి వేరే వుండమని సలహా ఇచ్చాడు తండ్రి. ఆ సలహా చెవిని పెట్టి అత్తగారింట్లో కలిసిపోయింది అన్నపూర్ణ. అక్కడొచ్చింది అభిప్రాయ భేదం. అన్నపూర్ణకి తండ్రి దూరమయ్యాడు.

విశాలకి మాత్రం అన్నపూర్ణంటే అమిత ప్రేముంది. "నాన్నగారిచేత డబ్బు ఇప్పించలేను కానీ నా దగ్గరుంది.

ఒక ఇరవై వేలు మాత్రం ఇవ్వగలను. ఇల్లు మాత్రం ఆపకండి. ఆయన్నడిగి ఇప్పిస్తాను" అని ధైర్యం చెప్పింది.

విశాల మనసు మెత్తనిది. చంద్రం సహృదయుడు. ఇతరులు బాధపడితే చూడలేని దంపతులు వాళ్లు.

ప్రోనోటు రాసిస్తానన్నాడు కరుణాకరం.

"మనలో మనకి ప్రోనోట్లు ఏమి ఉండీ అన్నయ్యగారూ!" అనేశాడు చంద్రం.

"బాంధవ్యం వేరు. వ్యవహారంవేరు. దేనికదే! నయంకదూ! మా ఊళ్ళో మాకి సహాయం చేస్తామన్న వాళ్ళెవరూలేరు"

"దానిదేముందిలెండి. మా దగ్గరుంది కాబట్టి చెయ్యగలిగాం. లేకపోతే ఏం చేస్తాను"

"దీనితో ఫ్లోరింగ్, ప్లాస్టరింగ్, బావి అయితే ఒడ్డున పడ్డట్టే"

"నీళ్లు ఎంత లోతులో పడుతున్నాయి" రావాలని టాపిక్ మార్చాడు చంద్రం.

"డెబ్బయిలో పడ్డవాళ్లున్నారు. నూట ఇరవైలో పడ్డవాళ్ళున్నారు. ఎవరి అదృష్టం వాళ్ళది"

ఇల్లుకట్టే వాళ్ళకి కొన్ని పడికట్టు మాటలుంటాయి. అవి వాడటం బాగా అలవాటయింది కరుణాకరానికి ఈమధ్యలో.

"బావి ఈశాన్యంలో ఉండాలంటారు. అదొక్కటే తెలుసు నాకు వాస్తులో" చంద్రం వాస్తుకి మార్చాడు.

ఎంత ప్రయత్నించినా వాళ్ళ టాపిక్ 'ఇల్లుకట్టటం' పరిధిదాటి పోవటంలేదు. అదొక వలయం.

ఇల్లు కట్టేవాళ్ళకి ఇంటి విషయాలు మాట్లాడుకోటం సరదా...మానియా హాబీ ....గర్వం...

రాష్ట్రం మంటకలిసిపోయినా వాళ్ళకి ఏం ఫరవాలేదు.

దేశం సర్వనాశనమయిపోయినా వాళ్లకి నష్టంలేదు.

వాళ్ళ ఇంటికి ఎలివేషన్ బాగా రావాలి. వాళ్ళకి అన్ని ఫెసిలిటీస్ ఉండాలి. అన్ని వస్తువులూ...సిమెంటునుంచీ, మరమేకులందాకా చౌకగా రావాలి. గవర్నమెంటుని వాళ్లు తిట్టినట్లు ఎవరూ తిట్టరు బహుశా.

దేశం వాళ్ళకి అన్నీ ఇవ్వాలి.

వాళ్లు దేశానికి ఏదన్నా ఇచ్చే ప్రయత్నమే చేయరు-తిట్లు, శాపనార్థాలు తప్ప.

కరుణాకరం పూర్తిగా ఈ కోవలోకి చెందడు. కానీ మొత్తానికి ఇల్లు కడుతున్న వాడికి ముఖ్యలక్షణమైన స్వార్థం మొలకెత్తింది. తొందరగా పూర్తవ్వాలనే తపన మొదలైంది.

అన్నపూర్ణకి చీరపెట్టింది విశాల.

"ఇప్పుడివన్నీ ఎందుకే?" అంది పూర్ణ.

"రేపు మీ ఇంటికి గృహప్రవేశానికి వచ్చినపుడు నాకు పెడుదువుగానిలే" అంది విశాల దబాయింపుగా.

"ఏమోనే..నీనోటి చలవవల్ల ఆగృహప్రవేశం అయిపోతే అన్ని దేవుళ్ళకే వెయ్యేసి నమస్కారాలు ... ప్రజల్లో పడతాం" అంది పూర్ణ కళ్ళు వత్తుకుంటూ.

ఆఫీసురూంలో కరుణాకరం ప్రోనోటు రాస్తున్నాడు.

'ఆస...లేటిన ... అసగా ... రాజమండ్రిపుర ఇన్నీసుపేట కాపురస్తులు లేటు మంగాపతి రాజారావుగారి కుమారుడు ఈ చంద్రశేఖరరావుగారికి గుంటూరు

బాడీపేట కాపురస్తులు లేటు కేతరాజు పురుషోత్తమరావుగారి ద్వితీయకుమారు డైన కరుణాకరరావు రాసి ఇచ్చిన ప్రొంసరీ నోటు-' అంటూ ప్రారంభిం చాడు.

చంద్రం గుమాస్తా దేవయ్యగారు... చంద్రం దగ్గర జూనియర్ సత్యనారాయణ సంతకాలు చేశారు.

అందరికీ థాంక్స్ చెప్పాడు కరుణాకరం.

"విష్ యూ ఎ హేపీ హోమ్" అన్నాడు చంద్రం. కరుణాకరానికి అలవాటు ప్రకారం కళ్లు చెమ్మగిల్లాయి. రక్తం పంచుకు పుట్టిన అన్నదమ్ములు కార్డుతో ఇన్‌లాండ్ లెటర్ తో సరిపెట్టారు. ఏ తల్లో కన్నబిడ్డ చంద్రం. దేవుడిలా అవసరానికి ఆదుకున్నాడు. "ఎ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ ఫ్రెండ్ ఇన్ డీడ్" పైకే అనేశాడు కరుణాకరం.

"నేను ఒక్క ఫ్రెండునే. కానీ మీరు బాగా చదువుకున్నవారు. ఇంగ్లీషు, తెలుగు సాహిత్యాల్లో నిష్ణాతులు. మీరు మోర్ దేన్ ఎ ఫ్రెండ్" అన్నాడు చంద్రం.

కరుణాకరం సాహిత్యాభిమానాన్ని మెచ్చుకొనే బహుకొద్ది మందిలో చంద్రం ఒకడు.

వంటింటిలో పూర్ణా, విశాలా తీవ్రంగా అనేక విషయాలు మాట్లాడుకుంటు న్నారు.

గుంటూరు నేత జరీ చీరలతో మొదలె ట్టారు చర్చ.

తర్వాత ఆడపిల్లల పెళ్ళిళ్లు చేయించే వారు.

ఆపైన సీరియల్స్ గురించి చర్చించారు.

పాత సినిమాలని పొగుడుకొన్నారు.

కొబ్బరితో కొత్తరకం వంటకాలు తయారు చేయటం గురించి పరిశోధిం చారు.

గాస్ స్టౌ ప్రమాదాలూ మాట్లాడుకుని భయపడ్డారు.

రాజీవ్‌గాంధీ ఎక్కడికి వెళ్ళినా సోనియాగాంధీని తీసికెళ్తాడని మెచ్చు కున్నారు.

అప్పుడు ఆగారు అలిసిపోయిన పూర్ణా, విశాలా.

చంద్రాన్నీ, విశాలని ఒకసారి మంత్రాలయం వెళ్ళమని సలహా ఇచ్చింది పూర్ణ.

స్టేషన్‌కి సెండాఫ్‌కి వచ్చారు చంద్రం, విశాల. సింగిల్ సీట్‌లో కిటికీ దగ్గర కూర్చున్నాడు కరుణాకరం. ఎదురుగా కూర్చుంది అన్నపూర్ణ. ప్లాట్ ఫారం మీదనుంచొని మాట్లాడుతున్నారు చంద్రం విశాలా.

స్టేషన్ పెళ్ళి పందిరిలా సందడిగా ఉంది.

"మీరు వడ్డీ గురించి ఆలోచించకండి అన్నయ్యగారూ. ఐఏమ్ నాటే మాన్ ఆఫ్ మనీ... అసలు కూడా మీకు వీలున్నప్పుడు తీర్చండి... ఇంతకంటె ఎక్కువ సహాయం చెయ్యలేక పోతు న్నాను... వదినగారికి రావాల్సింది లెజి టిమేట్‌గా ఇచ్చెయ్యమని మామయ్య గారికి చాలా మా చెప్పాను... ఆయన వినరు" చంద్రం సంజాయిషీ ఇచ్చుకునే ముద్దాయిలా మాట్లాడాడు.

"థాంక్స్...డాక్టర్ చంద్రంగారూ" అన్నాడు కరుణ చంద్రానికి షేక్ హాండిస్తూ.

"అదేంటండోయి. నా వృత్తే మార్చే శారూ" చంద్రం కరుణ చెయ్యి వదల్లేదు.

"అవునయ్యా చంద్రం. చిన్నపుడు చదువుకోలేదా ... "అప్పిచ్చువాడు వైద్యుడు" అని"

"ఆదా"

ఇద్దరూ ఆహ్లాదంగా నవ్వుకున్నారు.

"వెళ్ళగానే ఉత్తరం రాయవే అక్కా" చెప్పింది విశాలం.

"గృహ ప్రవేశానికి పది రోజులు ముందు రావాలి" పూర్ణ ఆహ్వానం చెల్లెలికి.

"నాదేంలేదు ... మీ మరిదిగారికి చెప్పు"

అన్నపూర్ణ చంద్రంవైపు భావ యుక్తంగా చూసింది.

"తప్పకుండా వస్తాం ... కానీ ముందర రావటం కుదరదు. క్లయింట్లూ, జూనియర్లూ ఇబ్బంది పడతారు. విశాలని పంపుతాలెండి" ప్రామిస్‌చేశాడు చంద్రం.

టా... టాలతో రైలు బయలుదేరింది.

రకరకాల భావాల్ని మోస్తున్న మనుషులు, వాళ్ళని మోస్తున్న రైలు, రైలుని మోస్తున్న భూమి, భూమిపైన వెలసిన ప్రకృతి-అంతా గిర్రుమని తిరుగుతున్నట్లనిపించింది కరుణాకరానికి.

ఇదంతా ఓ పెద్ద కాస్మాస్.

అణువులో బ్రహ్మాండం వుంది.

బ్రహ్మాండంలో అణువుంది.

ఇంట్లో గదిలా...గదిలో మదిలా.

మదిలో కలలో...కలలో ఊహలా.

* * *

ఇంటికొచ్చాక కళ్ళు తిరిగి...ఒళ్ళంతా తిమ్మిరెక్కినట్లయి, తల దిమ్ముగా ఉంటే ప్రయాణం బడలికలెమ్మని ఒకరోజు ఊరుకున్నాడు కరుణాకరం.

మరి అన్నపూర్ణ కూడా అంత ప్రయాణం చేసిందిగా!

ఎందుకయినా మంచిదని, రోజులు బాగులేవులే అని డాక్టర్ దగ్గరికెళ్ళాడు.

ఆయన పది టెస్టులు రాసిచ్చాడు. ఈ.సి.జినుంచీ యూరిన్‌దాకా.

కాలేజీకి శెలవుపెట్టి అన్నీ చేయించాడు.

సాయంత్రం లాబ్ క్లినికల్ రిపోర్ట్స్, ఎక్స్‌రే, ఈ.సి.జి. తీసుకొని డాక్టర్‌దగ్గర కెళ్ళాడు. అన్నపూర్ణ రిక్షాలో సాయం వచ్చింది. తలపోటు ఇంకా తగ్గలేదు.

"కొంచెం బి.పి. ఉంది. అనవసరంగా ఏవో ఆలోచిస్తున్నట్లున్నారు. పెద్ద సీరియస్‌కాదుగానీ...కొంచెం జాగ్రత్తగా ఉండండి. ఇమోషనల్‌గా ఉండటం హార్ట్‌కి మంచిదికాదు. ఫాట్స్ తగ్గించండి...లైట్ డైట్" డాక్టరు చెప్పుకుపోతున్నాడు.

కరుణాకరానికి నుదుటన చెమటపట్టింది. ఆ స్వేదబిందువులమీద లైటుపడి వింత నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. మనస్సేకాదు గుండెకూడా అలిసిపోయిందన్న మాట.

"ఈయనకి రైస్ తగ్గించమ్మా. ఉప్పు కూడా. చపాతి నూనె లేకుండా కాల్చి- అదే పుల్కాలు మంచివి"

"అలాగేనండి ... టెన్నేమంటారు" అడిగింది పూర్ణ భయంగా.

"మందులు రాసిస్తున్నాను. తగ్గిపోతుంది. ఏం భయంలేదు. అయినా జబ్బుల పేర్లు మీకెందుకు?" అన్నాడు డాక్టరు.

మంచంమీదనుంచి లేస్తే కళ్ళు తిరుగుతున్నాయి.

"రాయిలాంటివాడికిదేం జబ్బురా నాయనా! ఇదంతా ఆ కిటికీ ప్రభావం ఏమో" అంది సుందరమ్మగారు.

"వాస్తూలేదూ గీస్తూలేదు. వయస్సు ప్రభావం అంతే" అన్నాడు కరుణాకరం.

పిల్లల్ని స్కూళ్ళకి, కాలేజీకి పంపి

అన్నపూర్ణ వెళ్ళింది కాలనీకి.

**7**

**....అంకయ్య లాంటివాడికి సొంతగూడుకట్టుకోవటంకష్టం కాదు. రామనాథంలాంటి వాళ్ళకి సమస్యలేదు. ఇటు చిన్నవాడికి, అటు పెద్దవాడికి సమస్యకానిది, తనకి కొరక రాని కొయ్యలా గడ్డు సమస్యగా తయారైంది ఎందుకు?**

పానకాలు పెట్టిన కూలీల్లు నాపరాళ్ళు పరుస్తున్నారు.

"ఏటండమ్మగోరూ... మీరొచ్చారు?" పానకాలు కళ్ళు పెద్దవయ్యాయి.

"మాష్టారికి వంట్లో బాగులేదు ... ఫ్లోరింగెంతవరకు వచ్చింది?"

"అయిపోవచ్చిందిలెండి"

"అయిపోతుందిలే. ఎప్పటికి అని?"

"ఈరోజుకే అవ్వాలండి. కాని ఈ కూలీనాకొడుకులు ఎగనూకారండి..." ఇంకా ఏదో అనబోయి నాలిక్కరుచుకున్నాడు పానకాలు. ఆడకూతురు దగ్గర అలాంటి మాటలు మాట్లాడటంబాగుండదని అతనికి తెలుసు.

"నాపరాళ్ళేమిటి? మరీ గొగ్గులు గొగ్గులువి తెచ్చావు. కొంచెం మంచివి తేలేకపోయావా పానకాలూ"

"ఏళ్లాసండి ... కడపనుంచొచ్చాయి. ఏసినాక సూడండి...బగుషోగ్గా ఉంటది. ఇడిగా సూత్తే రాయి అందం తెలీదు" సర్దాడు పానకాలు.

మాటలు చెప్పేవాడు కోటలు కడతాడని ఇందుకే కాబోల్లు అన్నారు.

"నేనున్నాగా మీరెళ్ళండమ్మా ఎండగా ఉంది"

"మనిషుండేనే పనిచెయ్యరు. లేకపోతే సరేసరి"

"ఈ పానకాలు అందర్లాంటోడు కాదండి.. ఈ ఓల్ మొత్తం టవున్లో అడగండి....మేస్త్రీ పానకాలంటే ... ఏం చెప్తారో ... అంతెందుకు ... యిజియా టాకీసుమీద ఈమాటు సూడండి...మేస్త్రీ ...పానకాలు అనుంటుంది."

రాజమండ్రీ డబ్బు నాపరాళ్ళ పాలవుతోంది.

ఇంకా బావి పనొకటుంది. డబ్బు చాలుతుందో...లేదో.

"నీయమ్మ ఏందిరా! అరిసెలు సేస్తున్నారా?...దిమ్మిసా సేస్తున్నారా. సరిగా కొట్టండెహే...ఎగుడు దిగుడొచ్చిందంటే ...నీళ్లపోవు ... నీయమ్మ ... నాకు మాటొస్తుంది...మీకెన్నిమాట్లు సెప్పాలిరా" కూలీల్ని అదిలించాడు పానకాలు.

ఇదంతా ఇల్లు కట్టేవారిముందు మేస్త్రీలు చేసే షోబిజినెస్ అనీ తర్వాత వాళ్ళూవాళ్ళూ ఒకటయిపోతారు, ఈ పోట్లాట జనంకోసం అనీ తెలీదు అన్నపూర్ణకు.

"రిగ్గు సంగతి మాట్లాడావా?" అన్నపూర్ణ హేండ్‌బేగ్‌లోంచి చిన్న చేతిరుమాలుతీసి నుదురుతుడుచుకుంది.

"అసలియన్నీ....ఆ సొసైటీ...నా కొడుకులు... సెయ్యాలండి ... ఆళ్లు... నావని నట్టేట్లో ముంచినట్లు మెంబర్లని ముంచేసినారు...ఆడారిగ్గోడు... తెగబెట్టు సేస్తున్నాడు."

పానకాలు తప్పంతా ఇతరులమీద తోసేసాడు. అది అతని డిప్లొమసీ. మాటలుజల్లి రూపాయలు కోసుకోటం... అతని నిత్యవ్యవహారం.

"మాట్లాడు పానకాలు...ఓ పది

చూపాయిదెక్కువిస్తామని చెప్పి...పని
కావాలి...ఆవతలాయన డబులు పెట్టుకొని
...మంచం ఎక్కాడు"

"చూస్తానమ్మా ... చెప్పారుగా ...
రేపీపాటికి...చూడండి... దిగొస్తుంది...
గంగమ్మతల్లి పొర్లుకొస్తుంది."

"మొన్న ఇంజనీరు గారింట్లో వేసా
రట"

"అవునండి, ఎనభైకి పడింది గంగా
భవాని.''

"మంచినీళ్ళా...ఉప్పునీళ్ళా!"

"ఉప్పు నీళ్ళంటే .... ఉప్పునీళ్ళే,
మంచినీళ్ళంటే...మంచినీళ్ళే నండి"

"అదేమిటి పాసకాలూ! ఒకేచోట
రెండూ ఎట్లా పడతాయి?"

"అసలు పడేది ఉప్పువేనండి..కాని
అది చెప్పటం ఎవ్వరికీ ఇష్టం ఉండదండి
...మంచినీళ్ళంటారండి"

అన్నపూర్ణకి ఆశ్చర్యం వేసింది.

అన్నీ అబద్ధాలే...అందరూ దగా
కోర్లే. అందరికి రెండు నాలికలే. అను
కున్నది చెప్పరు...చెప్పింది....చెయ్యరు
...చేసింది అనుకోరు...అనుకున్నది
చెయ్యరు.

ఛీ...ఛీ...ఏం మనుషులు. త్రికరణ
శుద్ధిలేని రెండుకాళ్ళ జంతువులు...జంతు
వులేనయం.

"స్వీట్ వాటర్...స్వీట్‌వాటర్ అని
చెప్పారే?"

"కొబ్బరి నీళ్ళండి...వప్పుడుపడుతుంది
...సబ్బుతో నురగొస్తుంది...త్రాగ
టానికి పంపుకనెక్షన్లు వచ్చేదాకా కొంచెం
ఇబ్బంది"

ఎంత స్వీట్‌గా ఉంటాయనిపైటి
వారి మాటలు.

మధ్యాహ్న మార్తాండుడు నడినెత్తి
మీదికొచ్చాడు.

ఎర్రటి ఎండ...అన్నపూర్ణ కోపంలా
...వేడిగా తీక్షణంగా ఉంది.

"జగత్సాక్షి ఆయనపని ఆయన
చేసుకుపోతున్నాడు. మనవల్లే ఒప్పటం
లేదు" నిట్టూర్చింది పూర్ణ.

"జాగ్రత్తగా చూడు పాసకాలూ...
రిగ్గసంగతి ఏమైనాసరే రేపు లేప్పెయ్యాలి
...ఇంక నాప్పకు పనులు...బోలెడు
వడ్డీలు పోస్తున్నాం" వస్తే ఆనేమాటని
వత్తిపలికింది పూర్ణ.

"ఎంత మాటంటమ్మా...మీడబ్బంటే
నా డబ్బు కాదంటండి...ఎవరి డబ్బయితే
ఏటండి...తప్పదా"

"అదే వచ్చిన గొడవ....మా డబ్బు
మాదికాదు...మీదే"

"పాసకాలంటే డబ్బు దగ్గర నికార్స
యిన మనిషండి...నావాళ్ళకి...లారీకి
...అన్నిటికి రసీదులు తీసుకున్నానండి
...ఇవిగోండి...పంతులుగారికివ్వండి"

చిన్న చిన్న మడతలు పెట్టిన రసీదుల
దొత్తి పైజేబులోంచి తీసిచ్చాడు.

ఒక్క రోజులోనే పూర్ణకి వయణా
పరం పడుతున్న కష్టం అర్థం అయింది.

ఓ పక్కన ఫ్లోరింగ్ పని పూర్తవు
తోంది.

ఈశాన్యం దిక్కున ఉన్న రిగ్గ
భూమితల్లి గుండెల్లో గునపంలా
గుచ్చుకొని ... స్క్రూ డ్రైవర్‌లా
దిగుతూ లోపలికి దూసుకుపోతోంది.

ఎనభై అడుగులకి నీరు పడలేదు.

పెద్ద బండరాయి పడింది.

"గంగమ్మ తల్లికి పూజ చెయ్యాలి"
అన్నాడు పాసకాలు.

"మాటపడాల్సివ్వండి... నేను చేయించే
స్తాను" అన్నాడు బ్రతకతో వంత

పాటగాడిలా పానకాలు అసిస్టెంటు.

పర్సులోంచి తీసి పందనోటు, ఇర వై నోటూ ఇచ్చింది పూర్ణ. "చిల్లర నాలుగు రూపాయలు లేవు" అన్నాడు అసిస్టెంటు.

'పీళ్ళు చిల్లర దేవుళ్ళు. పానకాలు లాంటివాళ్ళు ఉత్సవ విగ్రహాలు... రామనాథం, మురళీ, లక్ష్మీపతీ మూల విరాట్టులు' అనుకుంది పూర్ణ.

'ఈ దక్షిణలు ఇవ్వలేకే ఆయన వాళ్ళని రోజూ తిడతారు' అనుకుంది అన్నపూర్ణ. ఆమెకు ఇప్పుడు అర్థమవు తోంది డబ్బులు ఎలా కరిగిపోతున్నా యనే విషయం.

'మంచి వాళ్ళని మోసం చేస్తే వాళ్ళకి తప్పక చెడు జరుగుతుంది. ఎప్పటికైనా అనుభవిస్తారు... మన ఉసురు తగలక



'పోదు' మనసులోనే శపించింది అన్న పూర్ణ సొసైటీవాళ్ళని.

కానీ వాళ్ళు శాపాలకీ, కోపాలకీ, తాపాలకీ, పాపాలకీ అతీతులు. దేవుళ్ళు వాళ్ళనేం చెయ్యరు. చెయ్యలేరేమో కూడా! దేవుళ్ళు కూడా వాళ్ళపక్షే పలుకుతుంటారు.



మధ్యతరగతివాళ్ళు సమాజానికి కాదు- దేవుడికికూడా అపోజిషన్ మనుషులే... అది వాళ్ళకర్మ.

* * *

నూటఇరవై అడుగుల లోతున పడ్డాయి నీళ్ళు. పుడమి తల్లికి పురిటి నొప్పులొచ్చినట్లు లోగిలిలో గంగ పెల్లుబికింది.

బురదగా ఉన్నాయి నీళ్ళు.

ఆ నీళ్ళు ఉప్పు కషాలు...

కరుణాకరానికి బాగులేదని లక్ష్మీపతి కలుగచేసుకున్నాడు. కరెంట్ కనెక్షన్ వచ్చింది...కానీ వైరింగ్‌లో పప్పులో కాలేయించాడు లక్ష్మీపతి...అదే అతని తెలివి.

ఎలక్ట్రీషియన్ అయిదు పాయింట్లు పెట్టాల్సినచోట పది పెట్టాడు. బిల్లు రెట్టింపయింది. డబ్బుకోసం ఇంటికొచ్చిన ఎలక్ట్రీషియన్‌తో పోట్లాడుకరుణాకరం వాడూ అరిచాడు. చివరికి అలిగి డబ్బు తీసుకోకుండా రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు.

"అదేదో లక్ష్మీపతిగారికే ఇవ్వండి" అన్నాడు మళ్ళీ వెనక్కొచ్చి.

"ముళ్ళ కంచె మీద గుడ్డని మెల్లగా తీసుకోవాలి. లాగితే చిరుగుతుంది. పోనీ నీకంత కష్టంగా ఉంటే వాడికి నేనిస్తాలే. ఆ అయిదువేలూ నీ దగ్గరున్నపుడే ఇమ్మాగానీ..." లక్ష్మీపతి జేబులోంచి ప్రింటెడ్ ప్రొఫార్మా ప్రాంసరీ నోటు తీసాడు. అది వల...అందులో ఎన్ని చేపలయినా పడతాయి. అదివేట.... చేపలవేట.

నిద్రలో నడిచే సోమ్నాంబులిస్టులా సంతకం పెట్టాడు కరుణాకరం.

కరెంటువాడి గొడవ ఇంత త్వరగా పరిష్కారం అయినందుకు అన్నపూర్ణ సంతోషించింది.

ఇది మామూలేనని...

ఎలక్ట్రీషియన్ రత్నం అందరితోనూ ఇలాగే పోట్లాడతాడని... లక్ష్మీపతివాళ్ళ రెస్క్యూకి వచ్చి... నోటు రాయించుకుంటాడని... నూటికి నెలకి మూడు రూపాయలు వడ్డీ చచ్చినట్లు ఇవ్వాలని పానకాలు చెబితే తెలిసింది.

కరుణాకరానికీ, పూర్ణకీ సంతోషం చప్పబడింది.

ఎంత దగా! ఎంత ఘోరం! ఎంత మోసం!

"నాన్నగారూ ... మీరే కాపాడండి. ఈ అప్పులు ఎలా తీర్చను? ఎన్ని ఇన్‌స్టాల్‌మెంట్సు ఎంతమందికి ఇవ్వమంటారు. చెప్పండి నాన్నగారూ?"

దగుల్బాజీ సొసైటీకి కట్టడం ఎలా?

తోడల్లుడు చంద్రానికివ్వటం ఎలా?

తోడేలుడు లక్ష్మీపతికివ్వటం ఎలా?

లోన్లు తాలూకు కోతలు పోగా వచ్చిన జీతంరాళ్ళతో ఇల్లు గడపటం ఎలా?

బిందు పెళ్ళి చేయటం ఎలా?

బాబిగాడిని ఐ.ఐ.టి.కి పంపటం ఎలా?

బంగారం విడిపించుకోవటం ఎలా?

వీరని కాలేజీలో చేర్పించటం ఎలా?

అసలు గృహప్రవేశం ఎట్లా?

"నాన్నగారూ... మీరెక్కడున్నారు? కరుణాయిని మర్చిపోయారా? నాన్నగారూ...మీరన్నది నిజం...నిజం...ఇది డబ్బుకాదు...చెమట....రక్తం...."

నాన్నగారి ఫొటోకి వేసిన మూడు రంగుల ఖద్దరు నూలు దండ వెలిసిపోయి వెక్కిరిస్తున్నట్లు కనిపించింది. అది గతించిన వైభవానికి మిగిలిన విషాద చిహ్నం!

బిందుకి, వీరకి నాన్నగారు వసన చెరి మూడువేలూ ఎఫ్.డీలు విత్‌డ్రా చేసాడు. తాతగారు తన ముద్దుల మనవరాళ్ళ పెళ్ళిళ్ళకోసం వేసిన డబ్బు రాళ్ళ కోసం రప్పల కోసం డ్రా చేసాడు. ఇంట్రస్ట్‌తో ఎనిమిదివేల నాల్గువందలొచ్చింది.

కాలేజి కాంపౌండ్‌లో ఉన్న చెత్త బాంకులో గృహలక్ష్మి పథకానికి నెలకి వంద చొప్పున కట్టిన ఎకౌంటు క్లోజ్ చేసాడు. అయిదు వేలొచ్చింది.

"గృహప్రవేశం ఎప్పుడు?" కాజువల్‌గా అడిగాడు బ్రాంచి మానేజర్.

"చూడాలండీ....ఇంకా పన్లున్నాయి"

అతనికి తన అసక్తత మీదా, అనారోగ్యం మీదా కోపం వచ్చింది.

అతనికీమధ్య తరచుగా వస్తోంది కోపం.

ఆలోచనల్ని మేస్తున్నాడతను.

ఇంకా లోపల ప్లాస్టరింగ్ కాలేదు.

అల్మారాలకి తలుపులు పెట్టాలి.

కాంపౌండ్‌వాల్‌కి పక్కవాళ్ళు కలవటం లేదు ... కాదు కాదు ... కలిసిరావటం లేదు.

"ముందర రెండు గదులు ప్లాస్టరింగ్ చేయించి ఇంట్లోకి వెళ్ళిపోవాలి. కనీసం అద్దె కలిసొస్తుంది" అన్నాడు తల్లితో.

"పంతులుగార్నడుగు ... మంచి ముహూర్తం పెడతారు. ఆయన చెబ్తే మంచిది..." అంది సుందరమ్మగారు.

"వెళ్ళిపోదాం అంకీ...నేనింక తిరగలేను" అంది పూర్ణ.

"బి.ఎ.తో ఆపేస్తాను డాడీ! టైప్ షార్ట్‌హాండ్, నేర్చుకుంటాను...యమ్.ఎ. చదవను" అంది బిందు.

"బస్సులో వెళతాను డాడీ స్కూలుకి" అంది వీర.

మీటింగ్‌కి వెళ్ళాడు. ఏదో సినిమా అవుట్‌డోర్ అమరావతి దగ్గర కృష్ణ ఒడ్డున జరుగుతోందిట. సినిమావాళ్ళకి వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో సన్మానం. దూళ్లో పెద్దలు, రోటరీలు, లయన్లు, లయనెస్సులు ఏర్పాటుచేసారు.

చిరంజీవి ఫ్రెండ్స్‌యూనిట్ యాక్టివ్ మెంబరుగా బాబిగాడికి అక్కడ ఎన్నో పనులున్నాయి.

చెంగల్వ పూదండలు కట్టించాలి.

హాలంతా బెలూన్లు కట్టాలి.

రంగు కాగితాలు చిన్నవిగా కట్‌చేసి తోరణాలు అలంకరించాలి.

తళుకు కాగితాలు తుంపులు తుంపులుగా చేసి ప్రేక్షకులమీద బాల్కనీలోంచి చల్లాలి. సన్మానసభ రక్తి కట్టించటానికి శాస్త్రిగారిని పిలవాలి. ఆయనకి నటుల వివరాలు చెప్పాలి. దానికి గరంమసాలా చేర్చి ఆయన వాళ్ళని స్టేజిమీదకి ఆహ్వానిస్తారు.

వూళ్ళోవున్న ఫాన్స్ ఎసోసియేషన్స్ అన్నీ ఫెడరేషన్‌గా ఏర్పరచి దాని ఆఫీసుకి ఒక స్వంత భవనం ఏర్పాటు చేయాలనే శ్రీ సుబ్బారావుగారి బృహత్తర కాంక్షకు చందాలు వసూలు చెయ్యాలి.

అవసరం అయితే అనూరాధ డిస్కో డాన్స్ పెట్టి ప్యాటన్ టిక్కెట్లు అమ్మాలి.

అన్నిటికంటే ముఖ్యం పెద్ద పళ్ళెం అంత బాడ్జీలు అందంగా కుట్టించాలి.

కనుక బాబిగాడు ఇంట్లోవాళ్ళకి దిక్కడు దొరకడు.

పంతులుగారింటికి తనే వెళ్ళాలి.

* * *

బాబిగాడు చిరంజీవి ఫాన్స్ మీటింగ్‌కి

ఎళ్ళయిన కరుణాకరానికి నచ్చలేదు. స్టాఫ్ రూంలో దిగులుగా కూర్చున్నాడు కరుణాకరం.

ఏం తోచనప్పుడు

ఏం చెయ్యాలో తెలీనపుడు –

ఆతనికి వూరటనిచ్చేది తల్లిలాంది. కాలేజీ స్టాఫ్‌రూం.

"సార్...కాఫీ తెమ్మంటారా?" ఆప్యాయంగా పలకరించాడు అంకయ్య.

అంకయ్య స్టాఫ్‌రూం ప్యూన్.

అంకయ్యని అందరూ లైక్‌చేస్తారు. అతను అందరికీ అంకుల్.

"వద్దు అంకయ్యా. ఎన్ని కాఫీలు తాగినా ఈ తలనొప్పి తగ్గదు" కరుణాకరం దేని గురించో మధనపడుతున్నాడని అర్థం అయింది అంకయ్యకి.

"ఇలాంటి తలనొప్పులు అందరికీ వుంటాయి బాబూ. ఈ భూప్రపంచంలో అప్పులేనోడూ, నొప్పిలేనోడూ వుండడు బాబూ. నేసెప్తున్నాగా. ఇంతకీ ఏంటి బాబుగారూ మీనొప్పికి కారణం"?

"అదే అంకయ్యా...ఇల్లుకాలేదు"

"అవుతుందండీ. ఈదేశంలో టైంకేటవుతోంది సెప్పండి. క్లాసులవుతున్నాయా? పరీక్షలవుతున్నాయా... సెప్పండి. అయినా మీకుతెలీదేంటిబాబూ"

"అవుననుకో. డబ్బుసర్దుబాటుకావటం లేదు. నేను ఈ పనుల్లో సతమతమవుతుంటే మా వాడు సినిమా పిచ్చిలో పడ్డాడు" కరుణాకరాన్ని వేధిస్తున్న రెండు సమస్యలు – డబ్బు...బాబిగాడు సినిమా ఫాన్స్ సంఘాల పిచ్చి.

"అబ్బాయిగారిది సిన్నతనం బాబయ్యా! దానికి మీరు... దిగులు పడాల్సిందేంలేదు. నాన్నగారు కష్టపడుతున్నారు అని తెలుసుకున్న రోజునా బాబు అభిమాన సంఘాల జోలికిపోడు. మీకీ తలనొప్పిరాదు. ఇంక డబ్బు... నెలనెలా చీటీ కట్టండి"

"చీటీయా?" ఉలిక్కిపడ్డాడు కరుణాకరం. అతని దృష్టిలో చీటీ కట్టడం ఏదో చిన్న చిన్న ఉద్యోగులు చెయ్యాల్సినపని.

"అవును బాబూ... చీటీయే. మీకు అప్పు కావాలంటే ఎవ్వరూ ఇవ్వరు. ఇచ్చినా ఒకటికి రెండుమాట్లు ఆలోచిస్తారు. చీటీ అయితే మనకి అవసరం అయితే పాట పాడుకుంటాం... లేకపోతే లేదు"

"నిజమే అంకయ్యా! ఇన్నాళ్ళూ నేను చీటీకట్టటం ఏదో తక్కువతనంగా భావించాను" కరుణాకరంలో పశ్చాత్తాపం కనిపించింది.

"తక్కువతనం, చిన్నతనం ఏంలేదు. బాబూ! అందర్నీ అప్పులడిగేకంటే... ఇది నయం కదా"

"మన లెక్చెరర్లు ఈ మాటు పెడితే చేరాలి"

'మనోళ్ళందరికీ చీటీపాట లున్నాయి బాబూ... ప్రతినెలా కొత్తదొకటి ప్రారంభిస్తారు. ఈమాటు నేచెప్తానుండండి... పదిమంది మెంబర్లుంటారు. నెలకి రెండొందలు. తలకి మొత్తం రెండువేలు ఏ కరుసుకైనా వస్తుందికదా! పాట డబ్బులు పోను మిగతాది కట్టెయ్యచ్చు" చెప్పాడు అంకయ్య.

"నీకిల్లుందా అంకయ్యా?"

"లేదుబాబూ...అద్దిల్లే"

"మరి కట్టాలనుకోవటంలేదా?"

"అనుకుంటున్నాను బాబూ! కానీ సమయం, సందర్భం కుదరద్దా మరి"

"ఏమైనా ప్రయత్నం చేస్తున్నావా?"

"దానికేం లోపంలేదు బాబు!

మొన్ననే సెక్రెటరీగారిని ప్రాధేయపడి అడిగాను. ప్రిన్సిపాలుగారుకూడా చెప్పారు- కాలేజీగ్రౌండ్ చివర కాంపౌండ్‌వాల్ దగ్గర స్థలం ఇస్తాం అన్నారు. నాకు అయిదు వేల సీటీపాటొకటుంది బాబు! అదొస్తే రెండునిట్టాళ్ళ గుడిసె ఒకటి వేసుకుంటాను...హాయిగా వుంటాం. గేమ్స్ రూం నుంచీ లైటుకూడా తీసుకోమన్నారా సెక్రెటరీబాబు'' అంకయ్య ప్రణాళిక కరుణాకరానికి నచ్చింది.

"మరి ఆలస్యం దేనికి?"

"మీ అందరి గురించేనండి ... ఆడ గుడిసేసుకుంటే నా వుద్యోగం మారి పోతుందండీ! నైట్‌వాచ్‌మెన్ అయిపోతా. మీకు ఇంక కాఫీలు తెచ్చేవాడుండడు. దానిగురించే ఆలోచిస్తున్నానండీ" అంకయ్య మాటల్లోని నిజాయితీ, అతని ఉద్యోగంపై అతనికున్న గౌరవం ప్రతిధ్వనించాయి.

కరుణాకరానికి తలనొప్పి తగ్గింది.

ఆలోచన సాగింది.

అంకయ్యలాంటివాడు స్వంతగూడు కట్టుకోవటం కష్టంకాదు. అతనికి స్థలం ఎవరో ఇస్తారు. చీటీ పాటతో ఇల్లు వచ్చేస్తుంది. కాలేజీయే కరెంటు, నీళ్ళూ ఇస్తుంది.

రామనాథంలాంటివాళ్ళకి సమస్యలేదు. కావాలనుకుంటే అతను పదిళ్ళకొని పదిళ్ళు అమ్మగలడు.

ఇటు చిన్నవాడికీ-

అటు పెద్దవాడికీ-

సమస్య కానిది... తనలాంటి మధ్య తరగతివాడికి కొరకరాని కొయ్యలా గడ్డు సమస్యగా తయారయింది. దానికి కారణం మధ్యతరగతివాడు...

కోరికలు తగ్గించుకోలేడు.

వనరులు పెంచుకోలేడు.

ఆ రెండింటి సంఘర్షణలో

నలిగిపోతూ వుంటాడు తనలాగా!

''వస్తాను అంకయ్యా''

"మంచిది బాబూ! దిగులుపడి లాభం లేదు బాబూ! మా అబ్బాయి... చేతికి ఎదిగిన కొడుకు అవసరానికి ఆదుకుంటాడనుకున్నాను. సినీమాల్లో జేర్తానని ఇంట్లోంచి పారిపోయాడు బాబూ"

కరుణాకరానికి తన కష్టం ఎంత చిన్నదో అప్పుడు తెలిసింది.

"రావోయ్...కరుణా....రా...రా... ఏమిటి చిక్కిపోయావు...'' పంతులు గారి పలకరింపులో ఆత్మీయత, ఆప్యాయత ప్రతిబింబించాయి.

ఆయన నెరిసిన జుట్టు వెనక్కివాలి ముసలిసింహం జూలులావుంది. తెల్లటి వెండితీగెల గడ్డం, మధ్యన చిరునవ్వు మబ్బుచాటున చంద్రవంకలా మెరుస్తోంది.

పున్నయ్యపంతులుగారు రవీంద్రనాథ టాగూరులా వున్నారు. బెర్నార్డ్‌షాలా వున్నారు. కార్ల్‌మార్క్స్‌లావున్నారు... శకుంతల ఇంటికి తిరిగి వచ్చేసినా దిగులు చెందని కణ్వమహర్షిలా వున్నారు. అచ్చంగా నాన్నగారిలా వున్నారు.

అప్రయత్నంగా నమస్కరించాడు కరుణ చేతులు జోడించి. జీవితంలో కోరికలు లేనిమనిషి ఆయన. కాదు ... మహా మనిషి ... పౌరహితమే ఆయన వృత్తి.

"ఇష్టకామ్యార్థిరస్తు...కూర్చో"

"కొత్తింట్లోకి చేరిపోవాలనుకుంటున్నాను".

"అస్తు ... శుభమస్తు ... శుభం భూయాత్"

"మంచి ముహూర్తం చూడమంది...

అమ్మ"

"చూద్దాం...తొందరపడకు... అవస్యంచూద్దాం ... కానీ మూఢమిలో ఎవ్వరూ వెళ్ళరు...ఒక్కనెల. ముప్పయి రోజులు... ఓపికపట్టు... నీబాధ నాకు తెలుసు. కానీ మూఢమి...గురుమూఢమి నలభై రోజులు. పదిరోజులయింది. ఇంకా నెలుంది..." చేతిలోని వారి పంచాంగం బల్లమీద పెట్టారు.

... నెలరోజులు.

అంటే ముప్పయి యుగాలు... ముప్పయి యుగాలకి లక్షకీ...సూటికి ధర్మవడ్డీ రూపాయి చొప్పున ఎంత అగును?

ఇంట్రెస్ట్ ఈజ్ ఈక్వల్టు పి. యన్. ఆర్ బై హండ్రడ్.

"ఏమిటో... గురుమూఢమిట. నెల రోజులు ఆగమన్నారు" చెప్పాడు కరుణాకరం ఇంటికొచ్చి.

"మీ భాగోతం పేపర్లో పడింది. చూసారా?" పూర్ణ పేపరు ఇచ్చింది.

కాలేజి గురించేమోనని అదిరిపడ్డాడు కరుణ. కాదు...

"బాలాజీనగర్ హవుసింగ్ సొసైటీలో కుంభకోణం! సభ్యులధనం రెండు కోట్లు కృష్ణార్పణం"

దినపత్రికలో మొదటి పేజీలో హెడ్డింగు.

కోదండరామయ్యగారు అపోజిషన్ ఎమ్మెల్యేగారిచేత అసెంబ్లీలో ప్రశ్న వేయించారుట.

"వాళ్ళ పాపం పండింది. ఒక ఐ.ఏ.ఎస్ ఆఫీసర్ని ఎంక్వయిరీకిగాను వన్మాన్కమిటీగా వేస్తార" సంతోషం కన్పడింది పూర్ణ మాటల్లో.

"ఎంక్వయిరీ జరిగి తీరాల్సిందే... దోషులకు శిక్షపడి తీరాల్సిందే" అంతా తన చేతుల్లోనే వున్నట్లు కళ్ళెగరేసింది పూర్ణ.

"ఆకలీ, బాధలు, ఆందోళనలూ, సమస్యలూ విరివిగావున్న విచిత్రసౌధం మాది. డెభైకోట్లు బక్క ప్రాణులున్న బీద దేశంమాది. దేవుడా రక్షించు. పెద్ద మనుషులనుండీ నీతుల రెండు నాల్కలు సాచి బుసలు కొట్టే నిర్హేతుక క్రూర సర్పాల నుండి రక్షించుదేవుడా... రక్షించు".

* * *

"దీనల్లి సిగతరగా... ఊరెంత మారిపోయిందండీ! ఇల్లు కనుక్కునేటప్పటికి...నా మతోయిందండి...నాన్నగారు పోయాక అమ్మగారిని సూడాలనెప్పి వచ్చానండి బాబూ! ఈడ పేరే చెర్లతో పొలాలు కొని నిమ్మలేసామండి"

తుపాకీ గుండులా, ఉరుములేని పిడుగులా ఊడిపడ్డాడు వెంకటస్వామి.

వెంటనే గుర్తు రాలేదు కరుణాకరానికి.

కళ్ళజోడు మార్చాలి కాబోలు... సైట్ పెరిగినట్టుంది మధ్య.

"ఏం వెంకటస్వామీ...బాగున్నావా?" పలకరించింది పూర్ణ.

"ఏం బాగులెండి.... అదే ఎగసాయం... పోదు. రాదు... వదల్దు" అన్నాడు.

పదెకరాల సుక్షేత్రంలాంటి బంగారం పండే రెండు పంటల నాన్నగారి పొలం మగతాకు చేసి తనే కొనుక్కున్న ఒకప్పటి కౌలుదారు... నేటి బడా భూస్వామి వెంకటస్వామి. నాన్నగారి భాషలో వెంకులు.... పెద్దన్నయ్య వయసుంటుం దతనికి.

"పెద్దమ్మగారున్నారాండి"

"ఇక్కడే ఉన్నారు... వంట చేస్తు

న్నారు...కూర్చో"మంచినీళ్ళ చెంబుతో ఇచ్చింది పూర్ణ.

"అబ్బాయి గారేటలాగున్నారు"

"వంట్లో సరిగా లేదు"

"పెద్దబాయిగారీ మద్దిన అయిదరా బాదులో కన్పించారండి... కార్లో పోతు న్నారు... అళ్ళల్లుడిగారిదంట కారు... మా బాగుందండీ. మా ఊళ్ళో ఎలిసిన ఏణుగోపాలస్వామి ఊరేగే ఎండి రథంలాగుంది లెండి"

కరుణాకరం ఏం మాట్లాడలేదు. కొన్ని కొన్ని సమయాల్లో మౌనం మంచి సమాధానం.

మాటకి ఒకే అర్థం... మౌనానికి వెయ్యి అర్థాలు.

"సిన్నాయన ఢిల్లీయేగదండి"

"ఢిల్లీలో లేరు... ఫారిన్ వెళ్ళారు"

"అదెక్కడండి?"

"అమెరికా"

"అయితే మన కరణంగారబ్బాయి గారున్న సోటన్నమాట. నాకెందుకు తెలవదూ... బలేఓరండి అక్కడన్నీ మెసి న్లంట. అన్నానికి మెసిను... సున్నా నికి మెసిను"

"అదే. అదే...అక్కడే! మెషిన్ల లోనే పని" కరుణాకరం వివరించకుండానే తెలిసింది వెంకటస్వామికి.

సుందరమ్మగారు వరండాలోకొచ్చింది చేతులు తుడుచుకుంటూ.

ఎప్పుడో విన్న మాటలా ఉంటే ఎవరో చూద్దామని వచ్చిందావిడ.

"దండాలండి...పెద్దమ్మగారు"

"ఏం వెంకటస్వామి... అలివేలు, పిల్లలూ బావున్నారా?"

"అయ్...అదే బాగులెండి..మంగమ్మకి కడుపు సూలండి. స్పెసలిట్టుకి సూపిం చాలని తీసుకొచ్చానండి. పిల్లలంతా కొబ్బరి సెట్లనాగా తయారయ్యారండి. ఎగసాయం సేత్తున్నారండి"

"తిన్నగా ఇక్కడే దిగక పోయారా"

"ఈడ దగ్గర పేరేసెర్లలో సవుగ్గా వస్తే పొలంకాని నిమ్మతోటేసామండి. అక్కడో షెడ్డుందండి ... ఆడున్నా మండి. వచ్చి వారం పైనే అయిందండి"

"డాక్టరేమన్నాడు... వచ్చి వారం అయ్యిందా?"

"కొయ్యాలన్నాడండి! మందులవల్ల కాదన్నాడండి. ఆసుపత్రిలో నెలుంటే.. అప్పుడు సేస్తారంటండి ఆపరేసను"

"పాపం. దిగులుపడకు. తగ్గుతుంది అబ్బాయి వచ్చి డాక్టరుతో మాట్లాడు తాడులే అంతా నయమవుతుంది ..." అంది సుందరమ్మగారు.

"మంచి మారాజు... పెద్దాయనెళ్లి పోయాక ఈడకి రాలేక రాలేదండి. ఏంటో మరి మనసొప్పక బేగొచ్చానండివెళ్ళిపోయి వస్తానండి" అని లేచాడు వెంకటస్వామి.

"వంటయింది భోజనం చేసిపోదూ గాని ఉండు. అలా ఖాళీ కడుపుతో పోకూడదు..."

"యేరే భోజనం ఎందుకులెండి. మేం రోజూ తినేది మీ పొలంలో పండే గింజలే నండి. వత్తానండి అన్నట్టు మరిసేపాయా నండోయ్ పెద్దమ్మగోరూ... మీ పొలం పక్కనే నూనెగాసు పడిందండి. యకరం మూడు లక్షలు సెప్తున్నారండి. దరమ పెబువులు ఆయనమ్మేసారుగానీండి... లేపోతే ఆ గజలచ్చిమి మీ ఇంటోనే ఉండి పోయేదండి పర్మెంటుగా"

కరుణాకరం వళ్ళు వేడెక్కింది.

పూర్ణకి మాట రాలేదు.

"ప్రాప్తంలేదు నాయనా! ఏంచేస్తాం?

ప్రారబ్ధం" అంది సుందరమ్మగారు వేదాంతిలా.

వెంకటస్వామి కాకీసంచీలోంచి ఒక బ్రౌను కవరుతీసి కరుణాకరానికిచ్చాడు.

"మన పెద్దాయన కివాలిసిన రొక్కం అండి నోటిమాటమీన అప్పట్లో అయిదు వేలిచ్చారండి నాకు. ఇప్పటి మాటకాదండి. మనదానికి కాయితం గీయితం లేదండి... వడ్డీతో కలిపి మొత్తం పదేలండి ... అది మీకిచ్చేదాకా నాకు తోసలేదండి మీసొమ్ము మీకిస్తే మంగమ్మకు జబ్బు తగ్గుతుందని





పించిందండి" వెంకటస్వామి సుందరమ్మ గారికి నమస్కరించాడు. పురుషోత్తంగారి ఫొటోమీద చేతులు పెట్టి కళ్ళకద్దుకున్నాడు.

"వస్తానండీ"

మనిషి రక్తం మరిగిన పెద్దపులులూ, ధనమదంతో పంజావిసిరే సింహాలు, విషసర్పాలూ, పదితలల రాక్షసులూ వుండే ఈ దేశంలో ఇంకా అక్కడక్కడ ఒక చంద్రం; ఒక పానకాలూ, ఒక వెంకటస్వామి ఉన్నారు. క్రూరమృగాలు సంచరించే జనారణ్యంలో సాధుపుంగవులు వున్నారు.

అందుకే భూమి ఇంకా బద్దలయి పోలేదా? అందుకే ఇంకా అడపా తడపా వర్షాలుపడి కొద్దో గొప్పో పంటలు పండు తున్నాయా?

వెంకటస్వామికి డబ్బిచ్చినట్లు నాన్న గారు ఎప్పుడూ చెప్పలేదే? కనీసం డైరీలో కూడా పద్దుపుస్తకంలో కూడా రాయలేదే.

పట్టినోటిమాటకి ఇంకా విలువుందా? ఇంపాజిబుల్.

"ఆ వెంకన్న బాబే నీ రూపంలో వచ్చాడు వెంకటస్వామీ. ఇల్లు ఒకటి కట్టిస్తున్నాం. నాయనా డబ్బంపక చిన్నబ్బాయి అలా గిలగిల్లాడి పోతు న్నాడు" అ ం ది సుందరమ్మగారు బొంగురుపోయిన గొంతుతో.

"ఇన్నాళ్ళకో స్వంత గూడంటూ కడు తున్నారు. సంతోషం తల్లీ సంతోషం... అంతా ఆ పెద్దాయన చలవ, మంచితనం ఆదే మీకు శ్రీరామరక్ష. కరుణబాబూ రెండ్రోజులాగి మళ్ళీ కనిపిస్తానండి... ఉంటానండి" సెలవు తీసుకున్నాడు వెంకటస్వామి.

**8**

...పానకాలుపైకి అలా కన్పించినా ఎంత పెద్ద మనసు! అతనికి తన కష్టమర్ల కష్టం తెలుసు. తర్వాతవాళ్లే అతనికి స్నేహితులైపోతారు. 'ఇంకా మంచి మనుషులు వున్నారు ఈ లోకంలో- గంజాయి వనంలో తులసి మొక్కల్లా'

తన ఇల్లు పూర్తయిపోతుందనే ఆత్మ విశ్వాసం ఏర్పడింది కరుణాకరానికి ఇప్పుడు.

"మంగమ్మకి ఎలాఉందో చూసి రారా?"

"వెళ్ళానమ్మా. ప్రజా నర్సింగ్ హోమ్ట. ఆడాక్టర్‌గారు మాకాలేజీ కమిటీ సెక్రటరీయే. ఆయనకి చెప్తాను. ఆయన పెద్ద పేరున్న సర్జన్"

ఆరోజే ఆస్పత్రికెళ్లాడు. ఓల్డుక్లబ్ రోడ్డులో ఉందది. రూం కనుక్కోవటం కొంచెం కష్టం అయ్యింది. నర్సింగ్‌హోం చాలా పెద్దది. రోగులుండేందుకు డాక్టరు గారు కట్టిన బృహత్ సౌధం అది. ఆక్కడ ఒక్కొక్క గదీ ఒక్కొక్క ఇల్లుకిందే లెక్క.

దివినుండి భువికి దిగివచ్చిన అశ్వనీ దేవతల్లా, తెల్లటి హంసల్లా ఉన్నారు డాక్టర్లు. కడిగిన ముత్యాల్లా మెరుస్తున్న నర్సులు కంగారుగా అటూ ఇటూ తిరుగు తున్నారు.

"నొప్పికి తట్టుకోలేకుండా నలికిల పాములా మెలికలు తిరుగుతుంటే సూది మందిచ్చిందిడాక్టరమ్మ" భయంగాచెప్పాడు వెంకటస్వామి అదే ఆపరేషనయినట్లు.

"ఏం ఫరవాలేదు. డాక్టరుగారితో మాట్లాడాను. చిన్న ఆపరేషన్ చేస్తే సరి పోతుందన్నారు. ప్రాణభయం లేదు. నువ్వనవసరంగా బెంబేలు పడిపోకు" ధైర్యం చెప్పాడు కరుణాకరం.

"నేనదే సెప్పానండి. అల్లదిగో ఆ ఎడ్డు నర్సమ్మ నాకంతా సెప్పిందండి. ఓ పదిరోజులాగి....మల్లిచ్చి...బిడ్డసంచీ లేదండీ....అది తీసేస్తారంట........ ఆ ఎడ్డు నర్సమ్మకి బాదేవంత ఓర్పండి. కన్నతల్లిది సల్లని మాటండి..." చెప్పాడు వెంకటస్వామి.

"మన రామనాథం బాబుగారి తాలూ కాండి" అప్పుడే బయటినుంచొస్తున్న పాన

కాలు చెప్పాడు.

ఈపాటి సన్నమాట బాసగారేసారు త్రి.

అది సరేగానీ ... పానకాలు! ఆశ్చర్యంగా ఉంది. నీకు వెంకటస్వామి తెలుసా?"

"తెలుసా...బలే వోరండి మీరు... మాబాగా అడిగారండి. ఆళ్ళ పేరేసెర్ల నిమ్మతోటలు సేసేది...మా పెద్దోడేనండి తోటలో మోటారు సెడ్డేసింది పానకాలే నండి...అదేనండి మాకూ ఈయనకూ బంధం" వివరించి చెప్పాడు వెంకట స్వామి.

పానకాలు పైకల్లా కన్పించినా ఎంత పెద్ద మనస్సు! అతనికి తన కస్టమర్ల కష్టం తెలుసు. తర్వాత వాళ్ళే అతనికి స్నేహితులయిపోతారు. పానకాలు గుంటూర్లో ఇళ్లు కట్టించిన చాలామందికి చక్కని ఫ్రెండ్!

"ఉన్నారు...ఉన్నారు...ఉన్నారు గాక ఉన్నారు. ఇంకా మంచి మనుష్యులు ఉన్నారు... దేవుడేజంట్లు దేశంలో అక్కడక్కడ... గంజాయి తోటలో తులసి మొక్కల్లా... ఇంకా మంచి మనుషులు ఉన్నారు" అనుకున్నాడు కరుణాకరం.

కొందరి పర్సనాలిటీలో ఏదో తెలియని అజేయమైన శక్తి ఉంటుంది.

వెంకటస్వామి వచ్చాక పనులన్నీ చకచకా అయిపోతున్నాయి.

అల్లా ఉద్దీన్ అద్భుత దీపంలో లాంతరు రుద్దితే వచ్చే భూమ కేతువులా పనులన్నీ చేసుకుపోతున్నారు కూలీలు.

మధ్యాహ్నం వెంకటస్వామి...పానకాలు...కృష్ణాశ్రమాని కెళ్ళారు... నిలువెత్తు సిమెంటు స్థంభాలు తెచ్చారు. నిమ్మతోటలో పనిచేసే కూలీలొచ్చారు. గోతులు తీసి స్తంభాలు పాతారు. పంప లావుగా, పైన సన్నంగా చిన్నచిన్న కుతుబ్‌మీనార్ల లాగా ఉన్నాయి అవి.

పెద్ద బజారులో ఇనుపకొట్టుకి వెళ్లి ముళ్ళతీగె పన్నెండు చుట్టలు తెచ్చాడు వెంకటస్వామి రైపుబండిమీద. సిమెంటు స్థంభాలకున్న కొక్కేలకి తీగతో లాగికట్టారు.

ప్రహరీగోడబదులు అందమైన ఫెన్సింగ్ తయారయింది.

"దీనిమీదకి పూలతీగలు పాకిస్తే బగు జోగ్గా ఉంటది" సలహా ఇచ్చాడు వెంకట స్వామి కరుణాకరానికి.

"అలాగే...చేద్దాం''

పానకాలుకి వెంకటస్వామి ఏంమంత్రం వేసాడో తెలీదు. రోజూ వచ్చే పదిమంది కాకుండా నలభయిమంది పనివాళ్ళు వచ్చారు.

పానకాలూ వెంకటస్వామి జంటకవుల్లా మిషనరీ జీల్‌తో ఇంటిపని చేస్తున్నారు.

ఇల్లు కట్టించటంలో కంటె ఇల్లు కట్టి పెట్టటంలో ఓ సరదా ఉంది. ఓ తృప్తి ఉంటుంది మేస్త్రీ పానకాలులాంటి వాళ్ళకి.

ఒక కోటింగ్ ప్లాస్టరింగ్ అయిపోయింది.

ఇంటిముందుభాగం పెరడు చదును చేసారు. మొక్కలు పెట్టుకొనేచోట మాత్రం గుండ్రంగా పళ్లాలు కట్టారు.

ప్లాస్టిక్ సంచుల్లో వుండే సున్నంరాళ్ల తెచ్చి డ్రమ్ముల్లో వేసారు. పిట్టమాక్కెసిలిమందు, తుమ్మజిగురుండలు, మైలు తుత్తం కూడా నూరివెయ్యమన్నాడు వెంకటస్వామి. అవేస్తే మంచి తెలుపు వస్తుందిట. బాగా అంటుకుని సొరగూళ్ళ పట్టుకుంటా ఉంటుందిట.

వెదురు కర్రలకి జనపనార కుచ్చులు

పురికొసతోకట్టి డజను కుంచెలు చేసాడు వెంకటస్వామి. మూడు వరుసలు సున్నం కొట్టారు ఇంటికి. తెల్లగా మెరిసిపోతోంది ఇల్లు.

కాలేజి పరీక్షలొచ్చాయి. కరుణా కరానికి ఇన్విజిలేషన్ వేసారు. ఏకొంటు అంతా అన్నపూర్ణే చూస్తోంది.

"నాకు పనులున్నాయి. వదిలెయ్యి వయ్యా" అనడిగాడు భైరవమూర్తిని. ఇన్విజిలేషన్ వర్క్ తప్పించుకుందామన్నా కుదరలేదు.

"పనులు లేనిదెవరికీ" అన్నాడు భైరవమూర్తి.

తలుపులకి రంగులెయ్యటానికి సబ్ కాంట్రాక్టు వద్దన్నాడు వెంకటస్వామి. వాళ్ళు రంగులు తాగేస్తారన్నాడు. అందంగా వెయ్యరన్నాడు. పేడఅలికినట్లు అలుకుతారన్నాడు. వాళ్ళకి వర్క్ రాదు అన్నాడు.

పెద్దవి అయిదు రంగు డబ్బాలు తెచ్చాడు. ముందు లైట్ బ్రౌన్ రంగు ప్రైమరీవేసి దానిమీద స్కైబ్లూ రంగేసారు.

"వెంకటస్వామీ .... నీ ఋణం ఎలా తీర్చుకోవటం" అన్నాడు కరుణాకరం.

"ఇది ఋణం కాదు బాబూ ఋణంకాదు నేసెపుతున్నాగా ఇశ్వాసం. మనిసి మనిసికి పక్కవాడికి తోటివాడికి చేసేసాయం... ఆరోజు నాన్నగారునాకిచ్చిన అయిదువేలు నా ఇంటిసినిలబెట్టింది బాబు...కనుక నేనే ఆయనకు ఋణపడ్డాను. అది ఈయిదంగా తీరుసుకుంటున్నాను ఆ తండ్రి సేతికి ఎముకలేదుబాబు. అయనెంతమందికి డబ్బు ఇచ్చారో ఆళ్ళందరూ తిరిగిస్తే ఇట్టాంటి ఇళ్ళు వందకట్టచ్చుబాబూ...వంద. ఆయన మాటకోసం బతికినమనిషి. నోటుకోసం ఓటుకోసం. దేబిరించే సీపు మనిసికాదు... సింహం సింహంలాంటిమనిసి. కసకేటంటే నేసెప్పేది ఇదిరుణంకాదుబాబు... అమాట మీరనకండి... నేననాలా... నాపిల్లలనాల మా యావిడనాల" ఆవేశం లావాలా చిమ్మింది వెంకటస్వామి మనసులోంచి.

"మనిషి చేసిన మంచి బాంకుల్లో డబ్బులాంటిది. అది పెరుగుతుంది.పిల్లల్ని పెడుతుంది. విత్తనం చెట్టయినట్లుగా కొండంత అవుతుంది ... అదే అదే నాన్నగారు చేసింది." వెంకటస్వామి మాటలతో కరుణాకరం మనసులో కమ్మిన కారు మబ్బులు విడిపోయాయి. చీకటి తెరలు తొలగిపోయాయి. "అవును నాన్నగారు మంచితనంతో నిర్మల హృదయాల్లో ఫిక్సెడ్ డిపాజిట్లు వేసారు.

తగాదా పరిష్కారం చేసినట్లునటించి వంచించి ప్రోనోటు రాయించుకున్న లక్ష్మీపతికీ... మాటకోసం పైసా పైసా లెక్కకట్టి...అవసరానికి తెచ్చిచ్చి అండగా కొండగా నిలిచిన వెంకటస్వామికి ఎంత తేడా.

వెంకటస్వామి విజయ ఐరావతం.

లక్ష్మీపతి విషకీటకం.

ఈ నగరం ఒక మహారణ్యం... జనారణ్యం! నక్కలూ ... పులులూ, పాములూ తిరిగే జనారణ్యం. కానీ ఇక్కడే గోవులున్నాయి. హరిణా లున్నాయి. నెమళ్ళున్నాయి కోయిలలు న్నాయి.

కరుణ కళ్ళు భావావేశంతో చెమ్మ గిల్లాయి.

"దశమి శనివారం రాత్రి ఒంటి గంటా పదహారు నిమిషాలకి అంటే తెల్ల వారితే ఆదివారం అనగా దివ్యమైన ముహూర్తం ఉందోయ్ కరుణా ఇంక నీదే

ఆలస్యం." అన్నారు పంతులుగారు.

"నాదేం లేదు పంతులుగారూ... అంతా రెడీ! మీరే దగ్గరుండి శుభకార్యం జరిపించాలి."

కొత్త ఇంట్లో తలుపులూ... గొళ్ళేలూ ఎవరూ ఎత్తుకుపోకుండా బాబిగాడు, వాడి ఫ్రెండ్సూ పడుకుంటున్నారు. రౌండ్స్ ప్రకారం కాపలా కాస్తున్నారు. టార్చిలైట్ మఫ్లర్ కొన్నాడు దానికోసం.

గృహ ప్రవేశ మహోత్సవ ఆహ్వాన పత్రికలు వేయించాడు కరుణాకరం.

"పురుషోత్తమ నివాస్"

తెల్లటి పాలరాతి పలకమీదచెక్కించి సిమెంటు స్థంభానికి తాపటం చేయించాడు. రెండోవేపు కె.కరుణాకరరావు ఎం.ఎ. అని రాయించాడు.

శనివారం రాత్రి గృహప్రవేశం.

ఆదివారం పొద్దున్న సత్యనారాయణ వ్రతం.

రాత్రి డిన్నరు.

అందరికీఆహ్వానాలిచ్చాడు స్వయంగా.

సొసైటీ వాళ్ళకి, ఎల్.ఐ.సి వాళ్ళకి, బాంక్ వాళ్ళకి, పాకకాలుకి, కూలీలకి.

హసన్ అండ్ కంపెనీ వాళ్ళకి బి. పీ తగ్గించిన డాక్టరుగారికి, మాలకొండయ్యగారికి, వెంకటస్వామికి, పుండరీకాక్షయ్యగారికి, నాన్నగారి మిత్రులకి, సిద్ధాంతిగారికి బావి తవ్విన వాళ్ళకి, కాలేజి స్టాఫుకి, లక్ష్మీపతికి, ఎలక్ట్రిషియన్కి ఎవ్వరికీ మర్చిపోలేదు.

చంద్రానికి ఉత్తరం రాసి కార్డు పంపాడు-

అన్నయ్యకి ప్రత్యేకంగా హైదరాబాద్‌కి రాసాడు-

"తప్పకరావాలి. నువ్వు ఈ ఇంటికి పెద్దవాడివి. దగ్గరుండి ఈ శుభకార్యం జరిపించాలి" అంటూ.

చెల్లెలినీ, బావగారినీ భీమవరంవెళ్ళి స్వయంగా ఆహ్వానించి వచ్చాడు.

"శ్రమయినా తప్పదు...ఇంటల్లుడు. స్వయంగావెళ్ళి పిలవండి" అని సుందరమ్మగారు పట్టుపట్టటంవల్ల భీమవరం ప్రయాణం తప్పలేదు.

అందర్నీ పిలిచాననే అనుకున్నాడు కరుణాకరం.

ఒక పని తలపెట్టాక కొన్ని పొరపాట్లు జరగటం సహజం.

ఇంటిముందున్న శ్రీధర్‌కి పిలుపు వెళ్ళలేదు.

"ఆ బాంకు మేనేజరు శ్రీధరాన్ని పిలిచారటరా!" అని సుందరమ్మగారు గుర్తుచేసేదాకా ఆతనికి గుర్తు రాలేదు.

"అవునమ్మా.... మరిచేపోయాను... ఈ పనుల హడావుడిలో పడి" అని నాలిక్కొరుక్కున్నాడు కరుణాకరం.

"భలేవాడివిరా అబ్బాయి! ఇంకా నయం...సమయానికి గుర్తువచ్చింది కాబట్టి సరిపోయింది. లేకపోతే ఏమనుకునేవాళ్లు... అవసరం తీరాక అందరూ ఇంతే అనుకోరూ" అంది సుందరమ్మగారు, శ్రీధర్ గోల్డ్‌లోన్‌కి ఎంత సహాయం చేసాడో గుర్తుచేస్తూ.

"ఇప్పుడే వెళ్తున్నానమ్మా... ఆడవాళ్ళెవరైనా రావద్దూ"

"అమ్మ పనిలో వుందిట నాన్నా! నేవస్తా పద ... నేవెళ్ళనా బామ్మా" గట్టిగా కేకేసింది బిందు.

"నిక్షేపంలా!కన్నెపిల్ల పార్వతీదేవితో సమానం" అంది ముసలావిడ.

కరుణాకరం, బిందూ వెళ్లేసరికి శ్రీధర్, భార్యా, శ్రీధర్ తమ్ముడు శివరాం కారంబోర్డు ఆడుకుంటున్నారు.

"నేను పూనా ఛాంపియన్ని. తెలుసా వదినా" అంటున్నాడు శివరాం.

"రండి చూస్తారూ..." అన్నాడు శ్రీధర్ పెళ్ళాని చూసి.

"మా నూతన గృహప్రవేశమహోత్సవానికి..." కరుణాకరం మాట సగంలో వుండిపోయింది.

"తప్పక రావాలి" పూర్తి చేసింది బిందు-శ్రీధర్ భార్యకి బొట్టుపెడుతూ.

"ఇంటి యజమానులేనా... గెస్ట్సు కూడా రావచ్చా?" బిందు వేపు చూస్తూ అడిగాడు కెప్టెన్ శివరాం.

"ఆహ్వానమనేది సకుటుంబ, బంధు, మిత్ర సపరివారంగా, ఎల్లరకూ అని తెలీదూ" అంది బిందు.

వాళ్ళు వెళ్ళిపోయాక-

"ఆ గడుగ్గాయి ఏం చదువుతోంది వదినా?" శివరాం అడిగాడు.

"ఏం...ఆ పిల్ల నచ్చిందా?"

"నచ్చితే చెప్పు...అన్ని వివరాలూ తెలుసుకుందాం" అంది వదినగారు.

"ముందు వివరాలు కనుక్కో... తర్వాత చూద్దాం"

"పది సంబంధాలు చూస్తే వంకలు పెట్టిన మిలట్రీ మరిది గారికి ... ఇంగ్లీషు మాస్టారమ్మాయి మీద కన్ను పడిందన్నమాట. ఎవరికెక్కడ రాసి పెట్టుందో అంటారందుకనే" వదినగారి మాటలకి ఏం జవాబు చెప్పాలో తెలీలేదు.

"ఇంక చాల్లే వదినా!"

శివరాం సిగ్గు పడటం చూసి ఆమెతో పాటు శ్రీధర్ కూడా నవ్వాడు.

* * *

బావిగాడు షామియానాలు, వంట సామగ్రిని చేరవేయించటంలో హడావుడిగా తిరుగుతున్నాడు.

వాడికి క్షణం తీరికలేదు. డాబామీద భోజనాలకి ఏర్పాట్లు చేయించాడు తన ఫ్రెండ్స్‌తో కలిసి.

"భరత ఖండే
భరత వర్షే
కృష్ణాతీరే...

"గణానాం గణపతిత్వా..."

"నమస్కారం పెట్టండి"

"ఓం కేశవాయస్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా...
ఆచమనం చెయ్యండి"

చుట్టూరా తిరిగి ఆత్మప్రదక్షిణం చెయ్యండి· అంటే అహం బ్రహ్మాస్మి... నాలోనే దేవుడున్నాడని అర్థం.

గోమాత పవిత్రమైనది.

ముందర ఆవుదూడా వెళ్ళాలి.

తర్వాత మీ ఇంటి ఇలవేల్పు పటం పట్టుకుని దంపతులు గృహప్రవేశం చెయ్యాలి.

"కుడికాలు పెట్టనోయ్ కరుణా... అమ్మా పూర్ణా! నువ్వుకూడా"

పంతులుగారు గోపంచకం ఇల్లంతా చల్లారు.

ఆయన మంత్రాలు...మాటలు జలపాతంలా మారుతున్నాయి. ఇంత సందడిలో ఇంకా రాని అన్నయ్య- వదినల గురించి, చెల్లెలు- బావగారి గురించి, దూరంగావున్న చిట్టిబాబు గురించి ఆలోచిస్తోంది కరుణాకరం మనస్సు... పెల్లి వారింది.

వెచ్చటి వెలుగు ఊరంతాపాకింది.

ప్రత్యక్షదైవం భానుమూర్తి తేన లాంటి మార్త్యంకిరణాలు కిటికీలోంచి ప్రసరించి ఇల్లంతా వెండిపూతను పూస్తున్నట్టు పరుచుకుంటున్నాయి.

కిటికీలోంచి ఫెన్సింగ్ దాకా పూల కుండీలు. కుండీల్లో రకరకాల క్రోటన్లు... పూలచెట్లు...వాటికి కొమ్మలు...కొమ్మ కొమ్మకి రెమ్మలు... రెమ్మల చివర వేలాడే తారల్లా రంగు రంగుల పువ్వులు.

ఇది ఇల్లుకాదు- ఆకాశంలో పూసిన హరివిల్లు.

ఆకుపచ్చని కొబ్బరాకులతో అల్లిన సరివిపాదులు. అదోక రకమైన పచ్చి వాసనలు వెదజల్లుతున్నాయి.

ఆకుపచ్చని మామిడి తోరణాలు.

కలంకారీ డిజైన్లున్న షామియానాలు.

కొత్త పట్టుచీరల గరగరలు - సీతాకోక చిలుకలు.

కాఫీ గ్లాసుల గలగలలు - సిగరెట్టు పొగలు.

సీమసెంటు వాసనల గుమగుమలు.

అనుభవాల జ్ఞాపకాలు.

పొగడ పువ్వుల పలకరింపులు.

మొగడ నవ్వుల చిలకరింపులు.

చామంతి పూలదండ వేసిన నాన్నగారి ఫోటో దగ్గర అగరొత్తుల ధూమాలు.

కాసపుపువ్వులాంటి కిటికీ కరతల
నేలం నింగీ కలిసినచోట
తెలితెలి మబ్బుల వలయంలో

నాన్నగారి చిరునవ్వులాంటి వెండి జాబిలమ్మ అందర్నీ దీవిస్తున్నట్లు, ఆనందం పంచుతున్నట్లు మెల్లిగా కదులుతున్న సమయము.

విశాల సింగారంగా తిరుగుతోంది.

అందరికీ కాఫీ, టిఫిన్లు అందాయో లేదో కనుక్కుంటోంది.

అన్నపూర్ణ మహాసాధ్విగా వంటవాళ్ళకి ఆర్డర్లిస్తోంది. ఎందుకు మొదటిసారిగా చిన్ని టిష్యూ చీర కట్టుకుంది. చీర మాటిమాటికీ నిజంగా ఒకసారిగా జారిపోయేలావుంది.

బాలగారు మెన్నెలో గళ్ళషర్టు టక్ చేసాడు. ఇంత సంబరాన్ని చూస్తున్న సుందరమ్మగారి కళ్ళలో ఆనందం, తృప్తి తొణికిసలాడాయి. సత్యనారాయణవ్రతం పీటలమీద పూర్ణకి, కరుణాకరానికి పట్టు బట్టలు పెట్టారు విశాల, చంద్రం.

"ఎటెండింగ్ సెమినార్ ఎట్ బెంగుళూర్. అనేబుల్టు అటెండ్ ఐవిష్ది ఫంక్షన్ ఆల్ సక్సెస్-అన్నయ్య"

హైదరాబాద్ నుండి టెలిగ్రాము వచ్చింది.

ఈ శుభకార్యానికైనా వస్తారనుకుని వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్న సుందరమ్మగారి కళ్ళలో నీరూరింది. ముఖ్యంగా మనవరాలు లావణ్య, ఆమె భర్తను చూడవచ్చనుకుంటోందామె.

కానీ...

ముసలావిడ కన్నీటి బిందువు ఖరీదెంత?

ఆమె ఆనందభాష్పాలకి విలువకట్టే షరాబులేరీ...ఎక్కడున్నారు? హైదరాబాదులోనా...ఢిల్లీలోనా...అమెరికాలోనా. సర్పవరంలోనా... గుంటూరులోనా... ఎక్కడ?

రావలసినవాళ్లు రాలేదు.

చెల్లెలు, బావగారూ తిరుపతికెళ్లారు.

ఎప్పటినుంచో అనుకుంటుంటే ఇప్పటికి కుదిరిందట వాళ్ళకి. భీమవరంనుంచి వస్తున్న స్నేహితుడి ద్వారా కబురు చేసారు వాళ్ళు.

"హోమ్...స్వీట్ హోమ్
ఆల్ ది బెస్ట్...చిట్టిబాబు"

కేబుల్ వచ్చింది. చదువుతుంటే కరుణాకరం గొంతు బొంగురుపోయింది. తోబుట్టువులు ఎవరూ రాలేదన్న తీరని అసంతృప్తి అతన్ని కలచివేస్తోంది.



"కాఫీ తీసుకోండి" అన్నపూర్ణ కాఫీ తెచ్చింది.

అందరిలోవున్నా ఒంటరిగాఫీలయ్యాడు కరుణాకరం.

ఈ ఇల్లు ఎవరికోసం? కేవలం ఇల్లు కట్టాలనే అర్థ్ కోసమా?
గాజు సౌధాలలో నివసించాలనే ఆర్తి కోసమా? రేపు పింటూ, బాబీ, పీరూ కూడా బయటికెళ్ళిపోతే చిట్టిదాయిలా... వెన్నెలి ... పిట్టల్లా రెక్కలొచ్చి ఎగిరిపోతే... తనకా... తనకా ఈ ఇల్లు? ఎవరిదీ ఈ [illegible] ఏం జావాబుమింటు?

ఇది కలా ... కల్లా?' ఆలోచిస్తూ నిద్ర లాంటి మగతలోకి జారుకున్నాడు కరుణాకరం.

ఆపరేషనయి కోలుకుంటోంది మంగమ్మ.

వెంకటస్వామికి భార్య అనారోగ్యం గురించిన దిగులు తగ్గిపోయింది.

కరుణాకరం గృహప్రవేశం పనుల్లో హెనకాలుతో పాటు ఉత్సాహంగా తిరుగుతున్నాడు.



బాబిగాడి సూపర్ విజన్‌లో డాబామీద డిన్నర్ ఎరేంజిమెంట్లు పకడ్బందీగా జరిగాయి.

చంద్రానికి, పంతులుగారికి, పానకాలుకి వెంకటస్వామికీ... బట్టలు పెట్టాడు కరుణాకరం.

తెలుగు శాస్త్రిగారు ఇల్లు కట్టటంలో ఉన్న కష్టాల్ని వర్ణిస్తూ కరుణాకరాన్ని, అన్నపూర్ణని మెచ్చుకుంటూ ఆశువుగా కవిత చదివాడు.

"నేనొక ఇల్లు కట్టుకుంటాను
అన్నా! నేనొక ఇల్లు కట్టుకుంటాను
ఎ. సి. సి. సిమెంటుతో కాదు.
ఎత్తయిన సాగర కెరటాలతో
గట్టి ఇనుముతో కాదు
వట్టి మలయమారుతంతో. బల్లార్షా టేకు
కలపతో కాదు-
హమేషా కైపు వలపుతో
నేనొక ఇల్లు కట్టుకుంటాను.
అన్నా! నేనొక ఇల్లు కట్టుకుంటాను.
పైన నభస్సు నా ఇంటికి స్లాబు
కింద వసుంధర నా ఇంటికి ఫ్లోరు.
నా ఇంట్లో రెండే రెండు దీపాలుంటాయి.
మమ్మల్ని సత్యంగా నిత్యంగా దీవిస్తుంటాయి.
శ్వేతకాంతి చిందే సూర్యుడు.
శీత కాంతి చల్లే చంద్రుడు.
అన్నా! నేనొక ఇల్లు కట్టుకుంటాను
నేనొక ఇల్లు కట్టుకుంటాను"

శాస్త్రి శ్రావ్యంగా వినిపించాడు వచన కవిత. చప్పట్లు మార్మోగాయి.

చప్పట్లు కొట్టేటప్పటికి శాస్త్రికి ఏదో శక్తి ఆవహిస్తుంది. అసలే తెలుగు శాస్త్రికి మైకు పిచ్చి వుంది-మైకు ముందు నిలబడితే కనీసం మూడు గంటలైనా వదలక పోవటం. ఆవేశంతో ప్రారంభించాడు శాస్త్రి తన ఉపన్యాసం.

"సోదరులారా! సోదరీమణులారా!

ఆదిమానవుడు ....వన్యమృగాల్ని వేటాడుతూ ఎండా వానల నుంచి తప్పించుకోటానికి కొండగుహల్లో నివసించాడు.

తర్వాత చెక్కలతో, కర్రలతో గడ్డితో గుడిసెలు వేసుకోటం నేర్చుకున్నాడు.

మానవునిలో శాస్త్ర విజ్ఞాన వికాసం ఎక్కువైనప్పటినుంచీ సున్నంతో, కలపతో, పెంకులతో ఇళ్ళు నిర్మించటం ప్రారంభించాడు.

సిమెంటు, ఇనుము కలిసిన నేటి ఆధునిక గృహాల దాకా మానవుడిని ఈ ఇల్లు ఎంత ఆలోచింపచేసిందో తెలుసుకుంటే ఆశ్చర్యంగా వుంటుంది"

'హియర్...హియర్!' అరుపులు.

'భోజనాల టైం అయింది' వెనక నుంచీ కేకలు.

"శాస్త్రిగారు డయాస్ దిగాలి" ఒక శ్రోత కోరిక. ఇంక లాభం లేదు... శాస్త్రి వదలడేమో అని భయం వేసి లక్ష్మీపతి వెళ్ళి చెయ్యిపట్టుకొని చెవుల్లో ఏదో చెప్పి తీసుకొచ్చాడు.

''థాంక్స్'' అని గట్టిగా అన్నారు కొందరు.

'భోజనాలకి లేవండర్రా' పిలుపు వచ్చింది.

దానికోసమే ఎదురు చూస్తున్నారు చాలా మంది. గుంపుగా అందరూ లేచారు. వచ్చిన అతిథులందరూ భోజనాలకెళ్ళటం శివరాంకి తెరిపిగా వుంది.

ఓణీ, లంగా వేసుకున్న దంతం బొమ్మ లాంటి బిందు కోసం అతని కళ్ళు వెతుకుతున్నాయి కానీ టిష్యూ చీర

కట్టుకున్న వన దేవత ప్రత్యక్షమయింది.

"భారతదేశ సరిహద్దులను కాపాడు తున్న సైనికాధిపతులకు ప్రణామములు' బిందు నవ్వుతూ నమస్కారం పెట్టింది.

'తెలుగు భాషలో నీకేకాదు? ప్రవా సాంధ్రులమైన మాకునూ ఒకించుక ప్రవేశ, ప్రావీణ్యములు కలవు" శివరాం బిందుని ఉడికించాలని అన్నాడు.

"ఏదీ లెఫ్ట్...రైట్...లెఫ్ట్...అదా" అంది బిందు.

"చూపించమంటావా నా తడాఖా
దేశ భాషలందు తెలుగు లెస్స
ఆ విషయం మాకు బాగా తెల్సు.
అందమైన అమ్మాయీ బిందు
ఎప్పుడిస్తావు మాకు విందు
ఆ సంగతి చెప్పండి ముందు
నేను కోరుకుంటున్నాను నీ పొందు'

అన్నాడు శివరాం గేయాలు విన్న స్ఫూర్తితో.

"ఏమిటా మాటలు ... ఎవరైనా వింటారు"

"ఎవరైనా వింటారు
ఎవరైనా చూస్తారు
అని అంటే ఓ భాయీ
ఆ అమ్మాయి ప్రేమిస్తోందనోయీ"

శివరాంకి అంత్య ప్రాసలు ఆశువుగా వస్తు న్నాయి.

'మీ వదిన' అంది బిందు.

ఏం మాట్లాడకుండా బుద్ధిగా నుంచు న్నాడు శివరాం.

"అంత భయమేల సిపాయీ
ఇవాల్టికి మీకు గుడ్‌బాయ్!" తుర్రున పరుగెత్తింది బిందు.

బాబిగాడు దూరం నుంచీ అంతా గమనిస్తున్నాడు. చిరంజీవి సినిమాలు విపరీతంగా చూసే వాడికి సీను ఇట్టే అర్థం అయిపోయింది.

అందరూ కరుణాకరాన్ని అభినం దించారు.

"కంగ్రాచ్యులేషన్స్"

"మొత్తానికి సాధించావోయ్"

"మీ నాన్న చెయ్యనిపని చేసావు."

"మొత్తం ఎంతయింది?"

"మోడల్ బాగుంది"

"టవున్‌కి కొంచెం దూరం"

"బావిలో మోటారు పెట్టారా?"

"ఎన్నయినా చెప్పు...స్వంత ఇల్లు స్వంతిల్లే"

"పైకిలా కన్పిస్తాడుగానీ కరుణాకరం కార్యవాది"

"అందరూ తలోచెయ్యీ వేసారు"

"ఇంటద్దెకి డబులవుతుంది వడ్డీ"

"కానీ ఫ్రీడమ్ వుందిగదా"

"దేనికయినా పట్టుదల ఉండాలి"

"మంచి ఫ్రెండ్సున్నారు"

"అన్నగారు మంచి పొజిషన్లో ఉన్నాడు"

"తమ్ముడు ఫారిన్‌లో ఉన్నాడు"

"మనవల్లవుతుందా?"...

అందరూ తలొక రకంగా అభినందిం చారు.

డాబా మీద మొగవాళ్ళకి భోజనాలు.

ఆడవాళ్ళకి కింద షామియానాలో.

వంటలు బాగున్నాయి.

అడిగి అడిగి మరీ వడ్డించారు బాబు గాడి ఫ్రెండ్స్. "వద్దు...వద్దు" అంటే బలవంతంగా వేసారు లడ్డూలు.

కరుణ వచ్చినవాళ్ళందరినీ పర్సనల్‌గా రిసీవ్ చేసుకున్నాడు.

ప్రమదావనం బాధ్యత అన్నపూర్ణ- విశాల చూసుకున్నారు.

భోజనాలయ్యాక చేతులు కడుక్కోవటం ఒక సమస్య అయింది. ఎక్కడ కడగాలి?

పైనుంచి కడుగుతే కుదరదు. ఇంటి ముందర ఆడవాళ్ళు భోజనాలు చేస్తున్నారు. ఇంటి వెనుక గాడి పొయ్యిల్లో వంట జరుగుతోంది. డాబామీదవాళ్ళంతా కిందకి దిగుతున్నారు చేతుల్లో గ్లాసు పట్టుకొని. మళ్ళీ అక్కడ నీళ్ళుండవనే అనుమానం.

సందులో రెండు రేకు డ్రమ్ములు నిండా నీళ్ళు, అరడజను ప్లాస్టిక్ మగ్గులు, నాలుగు టర్కీ టవళ్ళు పెట్టారు.

అతిథులు అందరూ ఒకేసారి దిగటంతో మెట్ల మీద ప్రెజర్ పెరిగింది. స్టెయిర్ కేస్ బాగా ఇరుగ్గా ఉంది.

క్షణంలో సగం సేపు కన్ఫ్యూజన్. స్టెయిర్ కేస్ సైడ్ వాల్ విరిగిపడింది. పెద్ద ప్రమాదం ఏం జరగలేదు కానీ, చిన్న చిన్న దెబ్బలు, కేకలు, గోల. ఇంకా అయిదు మెట్లుండగా సైడ్ వాల్ పడింది. దానిమీద లక్ష్మీపతి పడ్డాడు. అతని మీద మాలకొండయ్యగారు పడ్డారు. కొంతలో కొంత నయం. లక్ష్మీపతి చేతిలో గ్లాసు దూరంగా పడింది. అతని కుడిచెయ్యి మెలికపడింది.

ఆ చేతిమీద మాలకొండయ్యగారు వినాయకుడిలా కూర్చొని ఉన్నారు. కింద షాక్ కి ఆయన లేవలేకపోయారు. జరిగిన సంఘటన అలాంటిది. కాసేపు ఎవరి మెదడూ పని చేయలేదు. మాలకొండయ్యని పానకాలు లేవదీసాడు.

వెంకటస్వామి లక్ష్మీపతిని లేవనెత్తాడు అతని చెయ్యి వేలాడుతోంది.విరిగింది కాబోలు-నొప్పితో మూలుగుతున్నాడు.

కలకలం...గందరగోళం.

ఏముంది...ఏంలేదు...సింపుల్.

బాబిగాడు స్కూటర్ మీద లక్ష్మీపతి గారిని ఆస్పత్రికి తీసుకెళ్తానన్నాడు.

ప్రిన్సిపాల్ గారు కారిచ్చారు. ఆయన కారు ఎవ్వరికీ ఇవ్వరు. ఆయనకు కారు రెండో పెళ్ళాం.

లక్ష్మీపతికి తోడుగా ఆస్పత్రికి బాబీ, చంద్రం వెళ్ళారు.

కరుణాకరం మనస్సు చివుక్కుమంది.

అన్నపూర్ణ నీరుకారిపోయింది.

చీమూ నెత్తూరూ చెమటతో కట్టుకున్న ఇల్లు క్రాకిస్తే గుండెకి బీటిచ్చినట్లయింది.

ఆస్పత్రిలో నర్సమ్మ లక్ష్మీపతి చేతికి సిమెంటు కట్టుకడుతోంది.

"సొసైటీవాళ్ళు సరిగా కట్టలా" అన్నాడు వెంకటస్వామి.

అప్పటికి పరిస్థితి అదుపులోకొచ్చింది.

నెమ్మదిగా అందరి మనసులు కుదుటపడసాగాయి. జరిగిందానిని గురించి తలోకరకంగావ్యాఖ్యానించుకుంటున్నారు,

అతిథులు ఒక్కొక్కరే కరుణాకరం దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

ఆ రోజురాత్రి రామనాథం ఇళ్ళ మీద ఇన్ కంటాక్స్ రెయిడయింది.

* * *

"నేను వెంకటస్వామి పెళ్ళానికాపరేషన్ అంటే ఆస్పత్రి కెళ్ళానండి... అప్పుడీ కుర్రనాకొడుకులు సేసిన పని ఇది. దాన్దేముంది....మళ్ళీ కట్టేసేద్దాం. మీరేమివ్వద్దులెండి" పానకాలు జరిగిన విషయం చెప్పి తప్పు ఒప్పేసుకున్నాడు.

"అదికాదోయ్ నా బాధ. గృహప్రవేశం రోజునే అట్లా జరిగిందేమిటా అని. లక్ష్మీపతి చెయ్యి విరగటం... ఇవన్నీ నా మనస్సుని బాధ పెడుతున్నాయి" కరుణాకరం బాధపడ్డాడు.

ఈ గోలంతా సద్దుమణిగేటప్పటికి పన్నెండయింది. ఇంట్లో ఎవరూ నిద్రలు పోలేదు. అంతా హాల్లోకి చేరారు.

"పొద్దున్న నువ్వు వ్రతంలో ఉన్నావు ఆ పోస్టు అబ్బాయి అతని పేరు నాకు గుర్తుండదు... ఈ ఉత్తరాలిచ్చి పోయాడు" రెండు కవర్లు తెచ్చి ఇచ్చింది సుందరమ్మగారు.

డాక్టర్ కె. సి. బాబు
ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లిక్విడ్
క్రిస్టల్స్,

ఇథాకా,
న్యూయార్క్ స్టేట్.

'ప్రియమైన అమ్మకి,

చిట్టిబాబు నమస్కరించి రాయునది.

మేం పన్నెండు వేల మైళ్ళ దూరంలో ఉన్నా మా మనస్సంతా 'పురుషోత్తమ నివాస్'లోనే ఉంది. నాన్నగారిచేత చదివించి రికార్డు చేసిన లలితా సహస్రనామం వింటూ ఫ్రెండ్సందరికీ లంచ్ ఎరేంజి చేసాము.

ఇక్కడ నేను తయారుచేసిన ఒక ఇన్‌స్ట్రుమెంటు కంపెనీవాళ్ళకి నచ్చింది..

దాని గురించి రాసినా మీకు అర్థం కాదు.

దానికి కంపెనీవాళ్ళు అయిదు వేల డాలర్లిచ్చారు. అంటే మన డబ్బులో ఏభయివేలు అవుతుంది. ఆ చెక్కు దీనితో పంపుతున్నాను.

'పురుషోత్తమ నివాస్' నాన్నగారి కలల రూపం. ఆ కలలకి రూపం దిద్దిన చిన్నన్నయ్యకు ఇది నా బహుమతిగా అందజేయి.

ఇట్లు
నీ
-చిట్టిబాబు'.

రెండో ఉత్తరం పెద్ద వదిన అన్నపూర్ణకి రాసింది.

చి॥సౌ॥ అన్నపూర్ణకు,

సుశీలక్కయ్య దీవించి రాయునది. సమయానికి సహాయం చెయ్యలేకపోయినందుకు మీ బావగారూ, నేను చాలా ఫీలయ్యాము. కానీ అప్పటి మా పరిస్థితులు అలాంటివి. మామయ్యగారు మహోన్నతమైన వ్యక్తి. ఆయనకు వీలుపడనిది మా మరిది చేసాడు ... సంతోషం. లావణ్య పెళ్ళి వల్ల ఇంట్లో పరిస్థితి అగమ్యగోచరంగా అయింది. అది వెళ్ళినదగ్గర నుంచీ నాకేం తోచటంలేదు. ఆయనకు ఎప్పుడూ మీటింగులు ... సెమినార్లూను. నాకు తోడనుకో. లేక మీకు నేను చేయగల సాయంఅనుకో...ఏపేరైనా పెట్టు. చి॥ఏకవీరని హైదరాబాదు పంపించు. ఇక్కడ వుండి చదువుకుంటుంది.ప్రస్తుత పరిస్థితుల్లో సహాయం చెయ్యలేకపోతున్నామని మరిదికి చెప్పు. అత్తయ్యగారికి నమస్సులు.

చిరంజీవులకి ఆశీస్సులు.

నీ సుశీలక్కయ్య'.

"మా తమ్ముడు చూసావా వజ్రం"

"మా అక్కయ్య చూశారా ... మాణిక్యం"

"మీరంతా రత్నమాణిక్యాలేరా ... అందుకే నాకే చింతలేదు. అయితే మీ అందరికీ చెప్పాల్సిన చల్లని కబురొకటుంది"

అందరికీ సస్పెన్సు ఎక్కువైంది.

అందరివైపూ ఒకసారి చూసి మొదలెట్టారు సుందరమ్మగారు.

"మన ఇంటి ఎదురుగా బాంకాఫీసరు లేడూ...అదే మన శ్రీధరం"

"అతని భార్య పొద్దున్న సత్యనారాయణ వ్రతానికొచ్చి రహస్యం

చెప్పింది"

ఉత్కంఠ పెరిగింది అందరిలోనూ.

"వాళ్ళ మరిది శివరాం మిలటరీలో కెప్టెన్‌ట"

"అవును...పూనాలో వున్నాడు"

"అతనికి మన బిందు నచ్చిందట పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాట్ట"

"కట్నం...కానుకలూ"

"వస్తున్నారా నాయనా! కట్నం అక్కర్లేదుట. రిజిస్టర్ మారేజి అయితే మంచిదని చెప్పాడుట"

హిమబిందు సిగ్గుతో మొగ్గయి ముడుచుకుపోయింది.

"నువ్వు చూసావుటే? ఆ అబ్బాయిని" అడిగింది పూర్ణ.

"చూడటమేమిటి... వాళ్ళు పొద్దున్న షామియానాలో మాట్లాడుకున్నారుకూడా" అన్నాడు బావిగాడు స్పైలాగా.

బిందు సిగ్గుపడుతూ లోపలికి పరిగెత్తింది.

"అందుకనే ఇల్లు కట్టినవేళా పెళ్లి జరిగిన వేళా అన్నారు. అంతా ముహూర్త బలం నాయనా"

కరుణాకరం మనస్సు నుంచి బిందు సమయంలో జరిగిన విషాదమేఘం విడిపోయింది.

ఆనందం అంచులు దాటింది.

అన్నపూర్ణకి అంతా రంగుల కలలా ఉంది.

"డాడీ...ఈ శుభసమయంలో నేను, ఫ్రెండ్స్ ఇళ్ళకెళ్ళటం మానేసి... అంటే సినిమాలకు వెళ్ళటం మానేసి బాగా చదువుకుని చిట్టిబాబయ్యలాగా పెద్ద సైంటిస్టునైపోతా. అప్పులన్నీ తీర్చేస్తా... ప్రామిస్! మా బాస్‌మీద ప్రామిస్"

"మధ్యలో ఆయనెవర్రా"

"డేరింగ్... డాషింగ్... డైనమిక్...

అంతా గొల్లుమని నవ్వారు.

హాయిగా నవ్వుకున్నారు.

సంతృప్తి, సంతోషం నిండిన ఆనంద నిలయం అది.

## 9

...మాలకొండయ్యగారు దేవుడులాంటివాడు. ఆయన సొసైటీని మంచి పద్ధతుల్లో నడపాలనే సదాశయంగల పాతకాలంమనిషి. ఆవిధంగా ఆయన తమ సంపాదనకి అడ్డురావటం రామనాథం ప్రభృతులకి ఇష్టంలేదు.

ఉషోదయం అయింది.

బాలాదిత్యుని అరుణకిరణ సముదాయం అందర్నీ చేతనుల్ని చేసింది.

టిఫిన్, కాఫీలు ముగించి పేపరు చూస్తున్నాడు కరుణాకరం.

"శుభోదయం" అంటూవచ్చాడుశాస్త్రి.

"రా, శాస్త్రీ....ఏమిటి విశేషాలు?"

"లక్ష్మీపతిని చూసొద్దాం..."

"ఏం...మళ్ళీ ఏమయినా....?"

"ఏం కాలేదు. కానీ చూసిరావాల్సిన బాధ్యత మన మీద వుంది"

"సరే...వెళ్దాం"

వాళ్ళు వెళ్ళేటప్పటికి లక్ష్మీపతి బెడ్ మీద పడుకునివున్నాడు.

"రండి..." అతని గొంతులో ఏదో పశ్చాత్తాపం వినిపించింది. మొహంలో గిల్టీనెస్ కనిపించింది.

"సారీ ... లక్ష్మీపతి! మా ఇంట్లో సికీవిధంగా జరగటం నాకు చాలా బాధగావుంది" అంటూ కరుణాకరం లక్ష్మీపతి పక్కన కూర్చున్నాడు.

కాసేపయ్యాక-

"శాస్త్రీ ... నీకు ఇల్లు కట్టుకోవాలని లేదా?" ప్రశ్నించాడు లక్ష్మీపతి.

"కట్టుకోలేని నా అసమర్థతని కప్పి పుచ్చటానికి అలాంటి కల్పిత జగత్తులో విహరిస్తాను లక్ష్మీపతీ! నా మాటలు నీకింకా అర్థం కాలేదా? బ్రహ్మ కమలాసనుడు, విష్ణువు పాల సముద్రంలో పన్నగం మీద శయనిస్తాడు, శివుడు మంచుకొండమీద కూర్చుంటాడు ... త్రిమూర్తులకేలేని ఇల్లు మనకెందుకూ - అంటూ వుంటాను" శాస్త్రి మాట్లాడుతుంటే దగ్గుత్తికపడింది.

కరుణాకరం, లక్ష్మీపతి మౌనంగా వింటున్నారు "పలాయనతత్వం...ఎస్కేపిజం...అందుకే కావ్యాల్లోనూ ప్రబంధాల్లోనూ జీవించటం. మా నాన్నగారు గుళ్ళో పూజారి. నెలకి ఆరవయి రూపాయిలు జీతం. మేం ముగ్గురం అన్నదమ్ములం. మా అమ్మ కరణంగారింట్లో వంటలు చేసుంది. ఊళ్ళో మాది పూరిల్లు. ఈ వూరొచ్చేవరకూ నేను కరెంటు దీపం చూళ్ళేదు''...శాస్త్రి చెప్పుకుపోతున్నాడు.

"అనవసరంగా అడిగాను...నిన్ను బాధ పెట్టాను. నా నొప్పి మర్చిపోటానికి నీ మనస్సులో వున్న బాధని రేపాను" లక్ష్మీపతి క్షమార్పణ చెప్పుకున్నాడు.

"నేను బాధపడను. సిమెంటు గొట్టాల్లోనూ, పేవ్‌మెంట్లమీదా, సత్రం అరుగులు మీదా కాలం గడిపే లక్షలాది అభాగ్యులకంటే నేనెంతో నయం అనుకుంటాను. కనీసం మూడొందలిచ్చి ఒక నీడ అద్దెకుతీసుకున్నాను. సరే...నాకంటే అదృష్టవంతుడు కరుణాకరం... స్వంత గూడు ఏర్పరుచుకున్నాడు. ఆ ఆనందంలో...ఆవేశంతో కవిత్వం చదివాను. ఇమోషనల్ థాట్స్ పొయెట్రీ కాదు ... ఇమోషన్స్ రికాపిట్యులేటెడ్ ఇన్ ట్రాన్క్విలిటీ ఈజ్ పొయెట్రీ'! శాస్త్రి వాక్ప్రవాహానికి, ఇంగ్లీషుకీ ప్రమాన్పడి పోయారు మిత్రులు.

"శాస్త్రీ...అంతమంది జనం వుంటే నాకే చెయ్యి ఎందుకు విరిగిందంటావ్? సంభాషణని తన మీదకి మార్చుకున్నాడు లక్ష్మీపతి.

"ఇంక నువ్వు మొదలెడతావా"? సోది" విసుగ్గా అన్నాడు కరుణాకరం.

"కాదు కరుణాకరం! నాలో రగులుతున్న అగ్నిపర్వతాన్ని మీతో పంచుకోవాలను కుంటున్నాను. నన్ను చెప్పనీ...మధ్యలో అడ్డంరాకు'' లక్ష్మీపతి ఆవేదనా భరిత కంఠం జీరపోయింది.

"మల్లికార్జునం అనే బ్రోకర్... నాకు తెలుసు రామనాథంగారి బానిస వాడు. కాలేజీ టీచర్స్ కోపరేటివ్ సొసైటీ వెలుగులోకి రాకుండా చేసింది నేనే...అంటే మా బావగారి ప్లాను అదంతా. అందరూ అట్లా ఎవరి కుంపటి వాళ్ళు పెట్టుకుంటే రామనాథంగారి వ్యాపారం మూలపడుతుంది. కరుణాకరం లాంటి వాళ్ళని బాలాజీనగర్ లోకి లాగాలి. ఒక్క కరుణాకరమే కా ..ఇలాంటి ఈగల్ని సాలెగూటి లాగటం నావంతు. తర్వాత వాళ్ళని పిప్పిచెయ్యటం రామనాథంగారి వంతు. అప్పుడుగానీ ఆయన చేతుల్లో వున్న బినామీప్లాట్లకి ధర పలకదు. వూరికే మాటలు చెబితే సునాయాసంగా డబ్బు చేతికొస్తే చేదా...డబ్బుశాస్త్రీ... ధనాశ అన్నిటికంటే చెడ్డవ్యసనం. వ్యభిచారంకంటే ... జూదంకంటే తాగుడుకంటే ధనాశ పెద్ద వ్యసనం

అది మహమ్మారి...పడితే వదలదు... నేను ఆ మాయలో పడి...రామనాథంగాడు చెప్పినట్లల్లా చేసాను.

"రామనాథంగారంటావేమిటి? కనీసం బావగారను' కరుణాకరం మందలించాడు.

"లేదు...నీకొకసారి చెప్పాను.... కరుణాకరం...ఆయన ధనాశవ్యసనానికి బలిఅయిపోయిన మూగజీవం ... మా అక్కయ్య ...ఆమె జీవచ్ఛవం ... మా అక్కయ్యకి ఆ దుర్గతి పట్టటానికి ఆ దుర్మార్గుడే కారణం. ఇంక నేను ఆనెత్తురు కూడు తినను. తినలేను...నా పేరుతో



చాలా స్థలాలున్నాయి ఒకటి శాస్త్రికిస్తాను ...!" ఆవేశంతో అన్నాడు లక్ష్మీపతి.

"ఆవేశంతో అన్నగారిలా వాగ్దానాలు చెయ్యకు"

"వాగ్దానాలుకాదు కరుణాకరం ఈ కుహనాజీవితం మీద రోతపుడుతోంది. నెంబర్‌టూ లాంటి వాళ్ళని రామనాథం గారుఎందుకు పోషిస్తారో తెలుసా?"

లక్ష్మీపతి ప్రశ్న అర్థంకాలేదు.

"తెలీదు" అన్నారు ఇద్దరూ.

"మీకు తెలీదు...ఆ మాటకొస్తే మా నల్గురికీ తప్ప ఎవ్వరికీ తెలీదు...నాకూ, రామనాథం, మురళీ, హసన్‌లకి తప్ప ఎవ్వరికీ తెలీదు. వ్యాపారంలో అడ్డం వచ్చిన అధికారుల్ని నైతికంగా పతనం



చెయ్యటానికి వాడే ఆయుధం నెంబర్ టూ" కచ్చితో వున్నవన్నీ చెప్పేస్తున్నాడు లక్ష్మీపతి

"మాలకొండయ్యగారు మొదట్నించీ ఏదో చెప్తూనేవున్నారు" మధ్యలో తన సందేహం బయటపెట్టాడు కరుణాకరం.

"మాలకొండయ్యగారుదేవుడుకరుణా.. ఆయన సొసైటీని మంచి పద్ధతుల్లో నడపాలనే సదాశయంగల పాతకాలం మనిషి. పానకంలో పుడకలా ఆయన అడ్డురావటం రామనాథం ప్రభృతులకి ఇష్టంలేదు. ఆయన చెప్పేవన్నీ నిజాలు ...కానీ వాటిని మసిపూసి మారేడుకాయలు చెయ్యాలి నేనూ ...మురళీ...హసన్...అదే మాపని."

"ఈ విషయాలన్నీ వింటుంటే నాకు నిజంగా భయంగా వుంది. లక్ష్మీపతి "కరుణాకరానికి ఈ సంభాషణ గాభరా పుట్టిస్తోంది.

"భయం పోగొట్టుకో కరుణాకరం... ఈసమాజంలో భయపడాల్సింది ఏదీలేదు నీకు సహాయం చేస్తున్నట్లు 'నటించే! వాళ్ళంతా నీకు పరోక్షంగా హాని చేస్తున్నారు... వాళ్ళనుంచీ దూరంగా వెళ్ళిపో ... ఎలక్ట్రీషియన్ రత్నంచేత పోట్లాట పెట్టించిరాయించుకున్న ప్రోనోట్లు నా దగ్గర దాదాపు వందవున్నాయి" లక్ష్మీపతి కళ్ళల్లో నీటి పొరలుకమ్మాయి.

"ఇంత మందిని అప్పుల భయంలో ముంచినందుకు ... దేవుడు వేసిన శిక్ష ఇది. నా చెయ్యి అందుకే విరిగింది ..."

"పోనీలే లక్ష్మీపతీ...మర్చిపో" శాస్త్రికి కూడా లక్ష్మీపతి మీద జాలికల్గింది.

"పోనిస్తున్నాను శాస్త్రీ... అందుకే నీకు ఒకస్థలం.... అసలురేటుకే ఇస్తాను నువ్వు డబ్బు ఇప్పుడివ్వద్దు ... నీ దగ్గరున్నప్పుడివ్వు... కనీసం ఈ మంచి పనన్నా చెయ్యనీ"

"అయితే శాస్త్రిని కూడా ఒక ఇంటి వాడిని చేస్తానంటావ్?'' అన్నాడు కరుణాకరం నవ్వుతూ.

"హాస్పటల్ నుంచీ డిశ్చార్జి కాగానే శాస్త్రి పేరున స్థలం రిజిస్ట్రేషన్ చేయిస్తాను'' లక్ష్మీపతిమాటల్లో తేటదనం కన్పించింది.

శాస్త్రి మొహం సంభ్రమాశ్చర్యాలతో వెలిగిపోతోంది. అతని ఆనందం చూసిన లక్ష్మీపతికి ఒక మంచి పని చేస్తున్న సంతోషం కల్గింది.

"వస్తాం" అని బయలుదేరారు శాస్త్రీ కరుణాకరం.

శాస్త్రి సైకిలెక్కాడు.

కరుణాకరం నడిచి ఇంటికి చేరాడు. కానీ నడక బాధ అనిపించలేదు, మనస్సు తేలిగ్గా వుంది.

గూటికిచేరాడు కరుణాకరం.

పానకాలు చేసిన తప్పు దిద్దుకుంటున్నాడు.

సుందరమ్మగారు బిందు పెళ్ళిగురించి మాట్లాడుతోంది.

అన్నపూర్ణ అందరికీ అన్నం వడ్డిస్తోంది.

"థెంక్యూవ్ డాడీ! అందరం కలిసి భోంచేద్దాం'' అన్నాడు బాబీ.

"అవును" అంది బిందు.

''ఇంటి పనుల్తో అందరం కలసి భోంచేసి చాలా రోజులయింది నాన్న" అంది పీర.

భోజనానికికూర్చున్నాడు కరుణాకరం తృప్తిగా చూసింది సుందరమ్మగారు.

స్వంత గూట్లో భోజనం చేస్తున్న ఆనందం అందరిలో వెల్లివిరిసింది. ★

ఇంజినీరింగ్, మెడికల్ ఎంట్రన్స్ పరీక్షలో మంచి ర్యాంకు సాధించటానికి వీలుగా ఇంటర్మీడియట్ రెగ్యులర్ సిలబస్‌తో పాటు మొదటినుండి ఎంట్రన్స్ కోచింగ్ ఇచ్చే పూర్తి రెసిడెన్షియల్ విద్యాసంస్థ!!

# రాయలసీమ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

(రిజిష్టర్డు)

స్టేట్‌బ్యాంక్ కాలనీ, V. C. మిల్స్ పక్కన,
రేణిగుంటరోడ్,
అక్కారంపల్లి, (B. O.) తిరుపతి.

* మీ అబ్బాయి రోజూ కాలేజీకిగాని, ట్యూషన్‌కుగాని వెళుతున్నాడో లేదో, బాధ్యతవహించి చదువుతున్నాడో లేదో పట్టించుకునే టైము అవకాశం మీకుందా?
* విద్యార్థి భవిష్యజ్జీవితాన్ని తీర్చిదిద్దే TURNING POINT ఇంటర్ స్థాయిలోనే ఉంటుందని గుర్తించారా?
* అయితే మీ అబ్బాయి ఇంటర్మీడియట్ చదువు 2 సంవత్సరాల బాధ్యత మాకు వదిలేయండి!
* మీ అబ్బాయిని మా సంరక్షణ, పర్యవేక్షణలో ఉంచడం ద్వారా మీ బాధ్యతను మేమే స్వీకరించి చదివిస్తాం!!
* ఇంగ్లీష్ గ్రామర్ కోసమే ప్రత్యేకంగా ఒక లెక్చరర్‌ను నియమిస్తాం!!!

**8,9,10 తరగతులకు కూడా అడ్మిషన్లు గలవు**

# చతురత ఫీచర్

ఇప్పటి వేగానికే గుండె బాదుకుంటూ 'రేస్ డ్రైవింగు కాదిది...రాష్ డ్రైవింగు' అని వాపోయే ప్రజలు రేపటిరోజున వచ్చే కార్లను చూసి ఏమంటారో వేచి చూడాల్సిందే!

నిస్తేజంగా పడివున్న మనదేశ కార్ల పరిశ్రమలలో 'మారుతి' ఓ మలుపునే తీసుకువచ్చింది. హర్యానాలోని గుర్‌గాన్‌లో ఇండో-జపనీస్ సమిష్టి ఉత్పత్తిగా తయారయిన మారుతి, భారతదేశంలోని నగరవాసులెల్లరికీ సుపరిచితమే! ఇదే అనుకుంటూంటే దీన్ని మించిన డిజైన్లతో మన రోడ్ల మీద మెరుపులా దూసుకుపోయే కార్లు త్వరలో సాక్షాత్కరించబోతున్నాయి.

విజ్ఞాన, సాంకేతిక రంగాలలో వస్తున్న అనూహ్యమైన మార్పుల ప్రభావం కార్ల పరిశ్రమ మీదకూడా పడింది. విదేశాలలో పాతదయిపోయిందనుకున్న కారును చెత్తకుండీలోకి విసిరేసి కొత్త కార్లను కొనేసుకుంటారు ధనవంతులు. వారి అభిరుచులకు తగ్గట్టుగా



కార్ల తయారీలో కొత్త మోడల్స్ గురించి అహర్నిశలూ ఆలోచిస్తుంటారు - అక్కడి కారు పరిశ్రమ యజమానులు. కానీ, మన దేశంలో దాదాపు గత 30 యేళ్ళుగా ఒకే రకమైన మోడల్స్‌ను వాడటం చూస్తే ఇక్కడి పరిశ్రమల అలసత్వం బోధ పడుతుంది. మన ప్రజలలో కొత్తరకం కార్లమీద ఆకర్షణ ఒక్కసారిగా పెరిగి పోయేసరికి మన కార్ల పరిశ్రమ కూడా కదిలి విదేశీ సాంకేతిక సహాయంతో కొత్త మోడల్ కార్లను తయారుచేయ వలసిన పరిస్థితి ఏర్పడింది.

అంబాసిడర్, ఫియట్, స్టాండర్డ్ కారు మోడల్స్ మాత్రమే మొన్నమొన్నటి వరకు మనదేశ రోడ్లమీద రాజ్యంచేశాయి. ప్రస్తుతం మనదేశంలో సంవత్సరానికి దాదాపు 60 వేల కార్లకు డిమాండువుంది. 1990 నాటికి ఈ అంకె 1,21,000కు చేరుకుంటుంది. ఇప్పటివరకూ ప్రీమియర్ 118 కారుకు 1లక్ష 18వేల దరఖాస్తులు వచ్చాయంటే-కొత్త కార్లపై వున్న మోజు అర్థమవుతోంది. మారుతి కారు నిర్మాణ దశలో వుండగానే లక్షకుపైన ఆర్డర్లు సంపాదించింది. మారుతి వాన్, జీప్‌లకు 95వేల ఆర్డర్లున్నాయి.

స్టాండర్డ్ రోవర్ కారు రేటు లక్షాడెబ్బయి అయిదువేల రూపాయలే అయినా రెండు లక్షల డెబ్బయి అయిదువేలకు బ్లాక్



మార్కెట్లో అమ్ముడుబోతోంది. టాటా వారి హోండా, బిర్లావారి కాంటెస్సాలకు బుక్కింగ్స్ ఇంకా మొదలుకాలేదు. మారుతి కారు తదుపరి మోడల్ ఈ సంవత్సరంలో మొదలు కావచ్చు.

కోట్ల రూపాయలను పెట్టుబడి పెడుతోంది. కొన్నేళ్ళలో తమ కారును ఎలాంటి విదేశీ సహాయం లేకుండానే తయారుచేయాలనే ఆలోచన కూడా ఈ సంస్థకి ఉంది.



ట్రాక్టర్లు, మోటారుసైకిళ్ళ ఉత్పత్తికి ప్రసిద్ధిచెందిన ఎస్కార్ట్ కంపెనీ కూడా ఈ కార్ల తయారీలో ప్రవేశించి మొదట ఓ లక్ష కార్లను ఉత్పత్తి చేయబోతోంది. ఆ కారు వెల కేవలం 47 వేల రూపాయలే గనుక మారుతికి గట్టి పోటీగా తయారవవచ్చు. భారీ పరిశ్రమగా గుర్తింపుపొందిన హిందుస్థాన్ మోటార్స్ తమ కార్ల ఉత్పత్తిని జపాన్‌లోని ఇసూజూ కంపెనీ సహకారంతో విస్తృతం చేసేందుకు 600

ఈనాడు కార్లపై వున్న మోజు, అవసరం వాటిని బ్లాక్ మార్కెట్లోనైనా కొనేందుకు దారితీస్తోంది. కార్ల ఏజన్సీ కేటాయింపులలో కూడా ఎన్నో అవినీతి పనులు జరుగుతున్నాయి. మారుతి కార్ల డెలివరీలో అలాంటి ఎన్నో విషయాలు వెలుగులోకి వచ్చాయి. సుప్రీంకోర్టు ఆ సంస్థను ఈ విషయమై హెచ్చరించింది కూడా!

కార్లు బుక్‌చేసేవాళ్ళలో చాలా మందికి ఆ కార్ల అవసరం నిజంగా వుండదని పరిశీలకుల అభిప్రాయం. కాని



అలా చేసినందువల్ల వారికి కొంత లాభం వస్తుంది. కార్ల అలాట్‌మెంట్ ప్రారంభం కావటంతోనే డిపాజిట్‌ను వెనుకకు తీసుకొనేవారి సంఖ్య పెరుగుతుంది. దాంతో కారు విలువ నల్లబజారులో సైతం పడిపోతుంది. మారుతి డీలక్స్ మోడల్ కారు విషయంలో అదే జరగటం గమనించవచ్చు!

ప్రస్తుతం మనకున్న కారు మోడల్స్, రాబోయే కార్ల మోడల్స్‌ను విశ్లేషించి చూస్తే కార్లలో ఎంత మార్పు రాబోతోందో తెలుస్తుంది.

ప్రస్తుతం ఉన్న హిందుస్తాన్ కాంటెస్సా 1970 నాటి వోక్సల్ విక్టర్ మోడల్‌కు కొత్త రూపం మాత్రమే. అదికూడా కలకత్తాలోని హిందుస్తాన్ మోటార్స్‌వారి ఉత్పత్తే! చూపులకు బాగున్నా కాంటెస్సాలో ఆధునిక యంత్ర పరికరాలేమీ లేవు. మోరిస్ ఆక్స్‌ఫర్డ్‌కు ఉండే ఇంజనూ, గేరుబాక్సులే దీనిలో కూడా ఉన్నాయి. సున్నితమైన ఏర్పాట్లవల్ల స్టీరింగ్ వీల్ అనువుగా వుంటుంది. బ్రేకులకు వుండే డ్రమ్ములు పాత డిజైనువే! ఎయిర్ కండిషనర్ విధానం కూడా అవకతవకగానే ఉంటుంది.

బొంబాయిలో తయారయ్యే ప్రీమియర్ పద్మిని మన దేశంలో ప్రసిద్ధి చెందిన కారు. ఇది 1962 నాటి ఇటలీ ఫియట్‌కు నకలు మాత్రమే. ఐరోపా, అమెరికా దేశాలలో దీనికి రైట్ హేండ్ డ్రైవింగ్ సౌకర్యం ఉంది. పద్మిని కారు ఉత్పత్తి ప్రారంభమై ఇరవయ్యేళ్ళు దాటినా దానిలోని వైపర్ స్థానాన్ని ఇప్పటికీ సరిచేయలేదు. దాని స్టీరింగ్ వీల్



చాలా పాతది. పద్మిని యొక్క గరిష్ఠ వేగం గంటకు 125 కి.మీ.

బెంగుళూరులో తయారయ్యే డాల్ఫిన్ కారులో పైకి కనబడే భాగాన్ని ఫైబర్‌గ్లాస్‌తో తయారుచేస్తారు. రెలియంట్‌లో ఉండే మూడు బేరింగుల పుష్‌రాడ్ ఇంజనునే దీనిలోనూ వాడారు. సీట్లు కూడా చాలా అనుకూలంగా వుంటాయి. బ్రేకులు ఫెయిల్ అయ్యేముందు కారులోవుండే ఓ ఎర్ర బల్బు వెలిగి కారులోనివారిని హెచ్చరించే ఏర్పాటువుంది. ఒక బ్రేకు పాడయిపోయినా కారును నడిపించవచ్చు. దాని టైర్లు బాగా చిన్నవి. వీటిని తయారుచేసిన కొత్తలో పాడయినపుడు రిపేరు చేసేందుకు చాలా కష్టమయ్యేది. ప్రస్తుతం పెద్దపెద్ద నగరాలలో దీని రిపేరుకు కావలసిన సౌకర్యాలు లభ్యమవుతున్నాయి. డాల్ఫిన్ కార్లు మద్రాసు, బొంబాయి నగరాలలో ఎక్కువగా కన్పిస్తాయి. దాని ఫైబర్ బాడీకుండే రంగులు తొందరగా వెలిసిపోతాయి. అయినా మళ్ళీ రంగు వేయించే అవకాశంలేదు. దాని గరిష్ఠవేగం గంటకు 125 కిలోమీటర్లు.

ప్రీమియర్ ఆటోమొబైల్స్‌వారు ఇటలీలోని ఫియట్ – 124కు నకలుగా ప్రీమియర్–118 ఎన్.ఇ.ను రూపొందించారు. ఇంజను, గేర్‌బాక్స్‌లు జపానులోని నిస్సాన్ కంపెనీ వుత్పత్తులు. ఎత్తు ప్రదేశాలు ఎదు



కూర్చుకోవడం ఈ ఇంజను ప్రత్యేకత. మిగిలిన కార్లకు ఇలాటి సౌకర్యాలు లేవు. ముందు చక్రంలో ఆధునికమైన డిస్క్ బ్రేకులు, నాణ్యమైన పాలీయురేథిన్‌తో తయారయిన స్టీరింగు, రెండు బ్లోయర్ ఫేనులు, ఒక క్వార్ట్జ్ గడియారం దాని లోని అదనపు ఆకర్షణలు. డిక్కీలో ఆరు సూట్‌కేసులు చులాగ్గా పడతాయి.

జపానులోని సుజూకీసంస్థ సహకారంతో మొదలుపెట్టిన మారుతీకారు ఏరో డైనమిక్ సూత్రాలపై ఆధారపడి ఉత్పత్తి చేయబడుతోంది. దాని కలరింగు కూడా ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ననుసరించి చేస్తున్నారు. ప్రస్తుతం మారుతి ఎరుపు, గోధుమరంగు, నీలం, తెలుపురంగులలో లభ్యమవుతోంది. స్టీరింగ్‌లాక్, ఇగ్నిషన్ తలుపులు, డిక్కీలు-అన్నింటికి కలిపి డిక్కీ చిన్నదే అయినా వెనుక సీట్లు జరపడంద్వారా మరికొన్ని సామాన్లు పెట్టుకొనేందుకు ఖాళీ ఏర్పరచవచ్చు. మారుతి'లోని 'సుజుకి' వారి ఇంజను వల్ల పెట్రోలు కలిసివస్తుంది. కారు వెళ్తున్నపుడు విండ్‌స్క్రీన్‌పై సబ్బు నీళ్ళు జల్లుగాపడే ఏర్పాటువుంది. ఆ వెంటనే వైపర్లు అద్దాన్ని శుభ్రంగా తుడిచివేస్తాయి. కారులోని బ్రేకులకు రెండు లైనింగులు వుండటంవల్ల ఒక బ్రేకు పనిచేయక పోయినా ప్రమాదం వాటిల్లే అవకాశం లేదు. దీనిలో 3 బ్లోయర్ ఫేన్లున్నాయి. డీలక్స్ మోడల్‌తో ఒకఎయిర్‌కండిషనర్, స్టీరియో సెట్, సీట్ బెల్ట్, క్వార్ట్జ్ గడియారం, సీటుకు తోలు కవర్లు ఉంటాయి. రేడియేటర్‌లోని ద్రవం 8 నెలలు వరకు వస్తుంది. ఇది 16 సెకన్లలో వేగాన్ని





అందుకుంటుంది. సిటీరోడ్లమీద లీటరుకు 16 కి.మీ. హైవేలపై 22 కి.మీ. మైలేజీ ఇస్తుంది.

విదేశాలలో ఈమధ్యనే ప్రవేశపెట్టబడిన హోండా ఎకార్డ్ కారును టాటా కంపెనీవారు మన దేశానికి తెచ్చే ప్రయత్నం చేస్తున్నారు. మొదట్లో 'మారుతి' విషయంలో జరిగినట్లే అన్ని భాగాలనూ దిగుమతి చేసుకుని క్రమేణా స్థానికంగానే తయారుచేయాలని వారి నిర్ణయం. 1983లోనే ఇది ప్రపంచంలో ఉత్తమమైన 10 కార్లలో ఒకటిగా పేరు పొందింది.

దీనికై లండన్, న్యూయార్క్‌వంటి నగరాలలో సైతం కొనేవారి వెయిటింగ్ లిస్టులు తయారవటం విచిత్రమైన విషయమే. అమెరికాలో హోండాకారు వెల తొమ్మిదివేల డాలర్లు. దీనిలో 5 స్పీడుగేరు బాక్సులు ఉంటాయి. వీటి గరిష్టవేగం గంటకు 175 కి.మీ.లు. అంతవేగంలోనూ దీని మైలేజి మీటరుకు 7 కి.మీ.లు. గంటకు 60కి.మీ చొప్పున సమవేగంతో ప్రయాణం చేసేవారికి ఈ వాహనం లాభదాయకమైనది. ఎగుడుదిగుడు రోడ్లమీద సైతం సాఫీగా ప్రయాణం చేయగలిగేవిధంగా సౌకర్యాలున్నాయి. దీనికి 4 హెడ్ లైట్లుంటాయి.ఎ.సి.బాగా పనిచేస్తుంది. ఇది కూడా ఏరోడైనమిక్స్ సూత్రాలమీద ఆధారపడి పనిచేస్తుంది. ఎలాటి తప్పు దొరకని ఈ కారు నిర్మాణం భారతీయ ధనవంతుల్ని బాగా ఆకర్షిస్తుందనీ, ప్రపంచ కార్ల ప్రదర్శనలలో దీనికే ప్రథమస్థానం




లభిస్తుందనీ పరిశీలకులు విశ్వసిస్తున్నారు.

విదేశాలలో తయారయిన స్టాండర్డు రోవర్ కారు తనకంటూ ఓ ప్రత్యేకత ఏర్పరచుకుంది. చూడముచ్చటగా వుండే ఈ కారు కూడా ఏరోడైనమిక్స్ సూత్రాల పైనే ఆధారపడి పనిచేస్తుంది. దీనికి ఆధునిక కార్లకుండే అన్నిసదుపాయాలతో పాటు 5 తలుపులు కూడా వున్నాయి.

దీని టాంకులో 66 లీటర్ల పెట్రోలు పోయవచ్చు. దీని గరిష్ట వేగం గంటకు 210 కి.మీ. దీనిలోని రోవర్ ఇంజన్‌ను మార్చి స్వంత ఇంజన్‌ను ప్రవేశపెట్టాలని స్టాండర్డు కంపెనీ ప్రయత్నిస్తోంది.

ఇప్పటివరకు మనం చూసినవి అందంగా వుండి ఆకర్షించేకార్లు. ఇకపై మనం చూడబోయేకార్లు విమాన వేగాలతో పోటీపడతాయి. వాటి పనితీరు, అమరిక చూస్తే ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకోక తప్పదేమో! అలాటి కార్ల ఉత్పత్తి చేసేందుకు అమెరికా, జపాన్, యూరప్ దేశాలు పోటీపడుతున్నాయి. అమితవేగంతో పోయేందుకై కారులో ఎలక్ట్రానిక్ కంట్రోలు పద్ధతులను ప్రవేశపెట్టారు. అక్కడ తయారయిన లేబొర్గినీ, ఫెరారి కారు గంటకు 300 కి. మీ. వేగంతో పోగలవు. పోర్షెగ్రూప్-బి కార్లలో 6 స్పీడు గేర్‌లు ఉంటాయి. రాబోయేకాలంలోని కార్లు కంప్యూటర్ సహాయంతో నడుస్తాయి. దీనికి డ్రైవరు అవసరమే లేదు. దారిలో ఏదైనా అడ్డం వస్తే అవే పక్కకు తప్పుకుని వెళుతుంటాయి.

1983లో జర్మనీలోని ఫ్రాంక్‌ఫర్టులో ప్రదర్శించబడిన ఎంఫీరేంజర్‌కారు నేల మీదా, నీటిమీదా నడవగలదు. అంతేకాదు ముందుకు పోయేవిధంగానే వెనుకకు



కూడా నడిచే సదుపాయం వుంది. దీనిపైన వుండే శక్తివంతమైన ప్రొఫెల్లర్లు కారు నీటిపై తేలుతూ వుండేలా చేస్తాయి. అల్యూమినియం మిశ్రమ లోహంతో తయారైన దీని బాడీకి నీటి తాకిడివల్ల ఏ ప్రమాదమూ లేదు. అది నేలమీద గంటకు 145 కి.మీ. వేగంతోనూ, నీటిపై గంటకు 11 కి.మీ. వేగంతోనూ ప్రయాణం చేయగలదు. ఇలాంటి కారును జేమ్స్‌బాండ్ చిత్రాల్లో చూసి కెమెరా ట్రిక్కులనుకున్నవారు రేపు తమ కళ్ళ ముందే అవి వెళుతూంటే దిగ్భ్రాంతులవుతారు.

జెట్ విమానాల్లోవుండే టర్బైన్ ఇంజన్లను కార్లలో ప్రవేశపెట్టాలని ప్రయత్నిస్తున్నా అందులో జనించే 2300 డిగ్రీల ఫారన్‌హీట్ ఉష్ణాన్ని ఎలా నిరోధించాలో శాస్త్రజ్ఞులకు అంతు బట్టడంలేదు. క్రిస్లర్ కార్ కంపెనీవారు ఉపగ్రహంతో సంబంధంవుండే కార్లను తయారుచేసి సంచలనం సృష్టించారు. కేవలం నాలుగునిమిషాలలో మనం కోరిన కారు ప్రపంచంలో ఏమూల ఉందో, దానినెవరు నడుపుతున్నారో తెలుసుకోగలం. ఇవి దేశదేశాల్లోనూ వాడుకలోకి వస్తే కారు దొంగలపని అయినట్టే. శాటిలైట్ ట్యూబ్ లింక్స్‌ను కారులో అమర్చటం ద్వారా దాన్ని సాధించవచ్చు. ఎడారిలో కారులో సహా చిక్కుబడిపోయినవారికి కూడా ఈ సౌకర్యం ఎంతో ఉపకరణీయం.

న్యూజెర్సీలోని హోక్స్‌బర్గ్ కంపెనీ థర్మోప్లాస్టిక్, కార్బన్ మిశ్రమ లోహంతో కొత్తరకపు అతితేలికైన ఇంజన్‌ను తయారుచేసింది. సాధారణంగా



ఫ్యాక్టరీలలో కారు ఇంజను తయారు చేసేందుకు నాలుగు గంటల సమయం పడుతుంది. కానీ ఈరకమైన ఇంజన్‌ను కేవలం 19 సెకన్లలో చేయవచ్చు. పెట్రోలు తక్కువ, ఏ విధమైన శబ్దమూ ఉండదు. ముందుముందు తయారయ్యే ఇంజన్లలో 25 రకాల లోహాలు ప్లాస్టిక్‌తో కలిసివుంటాయి. ప్రస్తుతపు ఇంజన్లు స్టీలు, అల్యూమినియంల మిశ్రమ లోహంతో తయారుచేయబడుతున్నాయి. అమెరికాలోని మాసాచూసెట్స్ సాంకేతిక విద్యాలయానికి చెందిన అలెన్ షూవర్, డేనియల్ రూజ్‌లు నాలుగేళ్ళు పరిశోధనలు చేసి వాటి ఫలితాలు వివరిస్తూ ఓ పుస్తకం ప్రచురించారు. భవిష్యత్తులోని కార్లలో కేవలం ఓ చిన్న సర్క్యూట్ మాత్రమే ఉంటుంది. దానివల్ల ధరకూడా చాలా తగ్గిపోతుంది. కార్లకు మూడు చక్రాలు మాత్రమే ఉండటంవల్ల కాలుష్యం కూడా తగ్గుముఖం పడుతుంది-అని వారు అభిప్రాయపడ్డారు.

ఆధునిక కార్ల తయారీ మూలపురుషుడుగా చెప్పబడే లీవ్‌యొకాకా భవిష్యత్తు కారులను గూర్చి కొన్ని విషయాలు వూహించగలిగాడు. కారులోని ప్రధాన డిజైన్ మరో రెండు దశాబ్దాల వరకూ మారదు. కార్లలో ఎక్కువశాతం ప్లాస్టిక్ బాడీలేవుంటాయి. కారుబరువు 1000 కిలోలకు తగ్గిపోతుంది. ఆడీ, టయోటా, జీప్‌లకు భవిష్యత్తులో కూడా గ్లామర్ తగ్గదు. మరికొన్నేళ్ళవరకు వాటి అమ్మకాలు బాగా వుంటాయి. అయితే రాబోయే కార్లన్నింటిలోనూ ఏదో ఒక కంప్యూటర్ ఉండి కారు పనిచేసే విధానాన్ని సమీక్షిస్తూ వుంటుంది. మరెన్నో ఏరోడైనమిక్ సూత్రాలను కారు డిజైన్లలో ప్రవేశపెడతారు.

కార్లలో కొత్త డిజైన్లను తయారు చేసేందుకు పోటీలుపడి ప్రయత్నిస్తుంటే ధనవంతులు కొందరు డిజైన్లపై మోజుతో తామే తమకార్లను ఇష్టమైన రీతిలో మార్చుకుంటున్నారు. దాంతో ప్రతికారూ ఓ ప్రత్యేకత సంతరించుకుంటోంది. కోపెన్‌హేగన్‌లోని రాబర్టో బనేకియా అనే పారిశ్రామికవేత్త రోల్స్‌రాయిస్ కారును కొని దాని బాడీని తీసివేసి చెక్కతో తయారైన బాడీ తగిలించాడు.

గొప్పవారి అభిరుచులకు తగినట్లుగా మెర్సిడెజ్ 600 కారు అవతరించింది. ఇంటర్‌కమ్, టి. వి., ఫ్రిజ్, బారు, రేడియో, టెలిఫోను, పడకలతోపాటు బుల్లెట్ ప్రూఫ్ అద్దాలనుకూడా బిగించి కార్లను టాంకుల్లా మారుస్తున్నారు ఇప్పటి వాళ్ళు!

కొంతమంది చౌకలో ఓ పాతకారును కొని దాని బయటి ఆకారాన్ని తొలగించి పేరుపొందిన పెరారీ కారు బాడీని బిగిస్తారు.

అభివృద్ధి చెందిన దేశాలలో ఈ పిచ్చిని తగ్గించే ప్రయత్నాలు మొదలయినాయి. బ్రిటన్‌లో ఓ కారును ఇన్సూర్

యాలంటె ఆ రూల్సుకు తగినట్లుగా కారును తయారు చేసి తీరవలసిందే. పశ్చిమ జర్మనీలో డ్రైవింగ్ రూల్స్‌ను మరింత కట్టుదిట్టం చేసిందా ప్రభుత్వం. తమకు ఇష్టమైన రీతిలో కారును అలంకరించటం వల్ల బాలన్స్ తప్పిపోయి, డ్రైవరుకు కారును కంట్రోలు చేయటం కష్టమై, కారు తల్లకిందులయ్యే ప్రమాదముంది.

సెకండ్ హేండ్ కారురేట్లు కొత్త కారు రేటుకన్నా ఎక్కువ ఉండటం మనదేశంలోనే కనిపిస్తుంది. అయితే భారీయెత్తున కార్ల ఉత్పత్తి మొదలయితే రాబోవు కాలంలో మనదేశంలో కొత్త కార్లు లెక్కలేనంతగా పెరిగిపోతాయి. నేడు సైకిల్ కోసం ఏడిచే పిల్లలు రేపు కార్ల కోసం ఏడిచే పరిస్థితి వస్తుంది.

కార్లు పెరిగే సందడిలోపడి పెట్రోల్, డీజిల్ నిక్షిప్తాల కొరతను మరచిపోతే రేపు వెలువడే కార్లు చూసుకొని మురిసిపోయేందుకు తప్ప నడిపేందుకు పనికి రాకుండా పోతాయి. రోజురోజుకు తరిగి పోతున్న పెట్రోలియం నిక్షిప్తాలు 21వ శతాబ్దారంభంలోనే ఓ సంక్షోభ స్థితిని కలిగిస్తాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. దానికి ప్రత్యామ్నాయ ఇంధనాలకై అన్వేషణ ప్రారంభమైంది కూడా.

దీనికి మూడే మార్గాలున్నాయి. పెట్రోలు, డీజిల్‌ల అవసరం లేకుండా నడిచే ఎలక్ట్రానిక్ లేదా ఎలక్ట్రిక్ కార్లను తయారుచేయాలి. మిథనాల్ వంటి రసాయనాలను వాడి పెట్రోలియం వాడకం తగ్గించాలి. చెత్త పదార్థాలు, బొగ్గు, కర్బన సంయోగ పదార్థాలనుండి కృత్రిమ పెట్రోలియం తయారుచేయాలి.

ఎలక్ట్రిక్ కార్ల వాడకంలో కొన్ని ఇబ్బందులున్నాయి. రైళ్ళ విషయంలో అవి ఒక నిర్దుష్ట మార్గంలో ప్రయాణిస్తాయి కనుక ఎలక్ట్రిక్ లైనింగులు వేస్తే సరిపోతుంది. కార్ల విషయంలో అది కుదరని పని కనుక ఎలక్ట్రిక్ బేటరీలు వినియోగించాలి. లెడ్ యాసిడ్ సెల్స్‌ను రీఛార్జింగ్ చేసే వీలుంది. దానికై ఎంతో ఖర్చు కూడా వుండదు. అయితే అవి చాలా లావుగా, బరువుగా వుండి ఎక్కువ స్థలాన్ని ఆక్రమిస్తాయి. దీని నుంచి జనించే శక్తిలో ఎక్కువ భాగం వీటిని మోసేందుకే సరిపోతుంది. అంతే కాక పెట్రోలు దీనికంటే 100 రెట్లు ఎక్కువశక్తిగలది. అమెరికన్లు లిథియం-క్లోరిన్ బాటరీలు తయారుచేశారు. దాని బరువు లెడ్ యాసిడ్ సెల్‌లో 20వ వంతు వుంటుంది. అయితే అవి 700 డిగ్రీల సెంటిగ్రేడు వద్ద మాత్రమే పని చేస్తాయి.

వచ్చే శతాబ్దపు కార్లు హైడ్రోజెన్ ద్రవంతో నడుస్తాయని కొందరు వూహిస్తున్నారు. కాలుష్య నివారణకు అంతకు మించి మరొక ఇంధనం లేదు. నీటిని విడగొట్టి ఎర్రగా కాల్చిన ఇనుముగుండా పంపి హైడ్రోజెన్ ద్రవాన్ని భారీయెత్తున తయారుచేయవచ్చును.

కార్లు నడిపేందుకు దీనిని రెండు విధాలుగా వుపయోగించవచ్చు. దీనినుపయోగించినందువలన తేమను, అమ్మోనియాను లుప్తపరచటం ద్వారా వాతావరణం కలుషితం కాదు.

మరి కొన్నేళ్ళలో నీటితో నడిచే కార్లు కూడా రాబోతున్నాయి. తారాపూర్ ఆటమిక్ రిసెర్చి సెంటర్‌కు చెందిన బార్వే దీనిని కనుగొనటం భారతీయులకు గర్వ

కారణం. విద్యుద్విశ్లేషణ ద్వారా నీటిని ఆక్సిజెన్, హైడ్రోజెన్‌లుగా విడగొట్టి ఆ స్థితిలో దాన్ని మండించినపుడు విపరీతమయిన శక్తి విడుదల అవుతుంది.

పూర్తిగా ఆల్కహాలుతో నడిచే కార్లూ తయారుచేయవచ్చు. కొన్ని మార్పులతో మామూలు కారుకూడా మిథనాల్‌తో పనిచేస్తుంది. మార్పుచేసేందుకు ప్రతి ఇంజనుకు వేయిరూపాయలు ఖర్చవుతుంది. అవి గోబర్‌గాస్‌నుండి లభించే మిథేన్‌తో కూడా నడపవచ్చు. చెత్తా చెదారం నుంచి పెట్రోలియం తయారు చేయవచ్చని అమెరికన్లు కనుగొన్నారు. కళ్ళముందు ఇన్ని ప్రయోగాలు జరుగుతున్నా, పెట్రోలియం సంక్షోభానికి సరియైన ప్రత్యామ్నాయంగా ఏది నిలుస్తుందో వేచిచూడాల్సిందే.

భవిష్యత్తులో రాబోయే కార్లలో డ్రైవర్ వెనుకసీట్లో హాయిగా నిద్రపోవచ్చు. కంప్యూటర్లే కారులోని గేర్లు మార్చటం, లైట్లు వేయటం వంటి పనులు చేసేస్తాయి. కారు ముందుభాగంలోని బోనెట్‌కింద ఇప్పుడుండే మిషన్లు, అయోమయంగా కన్పించే వైర్లు ఏవీ ఉండవు. ఓ చిన్న కంప్యూటరు ఇంజనుని స్టార్టుచేయటం, ఎక్స్‌హాస్టును కంట్రోలుచేసి కాలుష్యనివారణకు తోడ్పడటం చేస్తూవుంటుంది.

ప్రపంచ ప్రఖ్యాతిచెందిన కార్ల పరిశ్రమ జనరల్ మోటార్స్ సంస్థ లక్సెంబర్గ్‌లో 1కోటి 25లక్షల డాలర్లతో నిర్మించే యూరోపియన్ సాంకేతిక కేంద్రంలో వాల్యూంను ఉత్పత్తిజేసే కార్లు తయారవుతాయి. అవే ఆలోచించి కారును నడపగలవుట! ఆ సంస్థ స్వతంత్రంగా పనిచేస్తూ ఐరోపా కారు తయారీ సంస్థలకు సహకారాన్ని అందజేస్తుంది. ఆ సంస్థ తయారుచేసే కంప్యూటర్ సహాయంతో ఒక కారులోనివాళ్ళు మరొక కారులోనివాళ్ళతో సంభాషించవచ్చు. ఈ సౌకర్యం మరో రెండేళ్ళలో రావచ్చు.

కంప్యూటర్ కంట్రోలు వలన కారు గమనంలో చెప్పుకోదగ్గ మార్పువస్తుంది. పెట్రోలు ఖర్చు తగ్గుతుంది. యూరోపియన్ దేశాలలోని అత్యాధునిక కార్లలో ఈ సౌకర్యంవుంది. జనరల్ మోటార్స్ సంస్థ తనకున్న అనుభవంతో తయారు చేసిన ఎలక్ట్రానిక్ కంప్యూటర్లను జపానులోని 'సుజుకి' సంస్థకు అమ్మిందికూడా.

మెక్సికో, సింగపూర్‌లలోని డెల్‌కో ఎలక్ట్రానిక్స్ సంస్థ విభాగాలు కంప్యూటర్లు, సిలికాన్ చిప్స్‌ల తయారీలో ప్రసిద్ధి చెందినయి. అవి ప్రతిరోజూ ఆరులక్షల సిలికాన్‌చిప్స్‌ను 22వేల డిజిటల్ కంట్రోల్ మాడ్యూల్స్‌ను తయారు చేస్తుంది. కారులోని కంప్యూటర్‌లో వేడికి తట్టుకొనగలిగే చిప్స్‌ను జనరల్ మోటార్ సంస్థ తయారుచేస్తోంది. ఇప్పుడు తయారయ్యే మైక్రో కంప్యూటర్లు కారులోని 512 భాగాలను కంట్రోలు చేయగలవు.

కార్లు తయారుచేసే సంస్థలలో ఉండే ఇంజను మేనేజ్‌మెంట్ కంప్యూటర్, తయారయిన కార్లలో ఏ భాగాలలో లోపంవుందీ, అందులో బిగించిన కాంపోనెంట్స్ సరిగ్గా అమరినాయో లేదో తెల్పుతుంది. దానివలన కారును డెలివరీకి ముందుగానే లోపరహితంగా తీర్చిదిద్దే అవకాశం ఉంటుంది.

— కస్తూరి రాజశేఖర్

తిరుమలకొండ కలియుగ వైకుంఠం—భక్తికి ఆలయం
తిరుపతి పట్టణం విద్యాలయాలకు నిలయం
"తిరుపతి స్టడీ సర్కిల్"
ఉద్యోగార్థుల ఆశయసాధనకు శిక్షణా కేంద్రం

A.P.P.S.C. (Group I, II A&B, III) పరీక్షలైనా,
బ్యాంకింగ్ సర్వీసు పరీక్షలైనా
పాలిటెక్నిక్ ప్రవేశ పరీక్షలైనా
సునాయాసంగా ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులు కాదలచుకొంటే
''తిరుపతి స్టడీ సర్కిల్''ను ఆశ్రయించండి.
రాయలసీమలో మొదటి కోచింగ్ సెంటర్—
అనుభవజ్ఞులు, నిష్ణాతులైన అధ్యాపకులతో అలరారే శిక్షణకేంద్రం
''తిరుపతి స్టడీ సర్కిల్''

సాధించిన ఫలితాలు : A.P.P.S.C. Group II A -A.C.T.Os-2
Deputy Tahsildars - 4
S.I. of Police - 5
బ్యాంకింగ్ సర్వీస్ (1984 Selections) - 32
Group II B - 11

ఇంతవరకు సాధించింది కొంత - సాధించాలి కొండంత. ప్రస్తుతము Group II B మరియు Polytechnic Entrance Coaching జరుగుచున్నవి.

అపూర్వమైన అవకాశాన్ని వినియోగించుకోండి.
అద్భుతమైన అదృష్టాన్ని వరించండి.

For Regular/Postal Coaching Particulars, Contact
KANCHI RAGHURAM
Correspondent

స్థాపితం : 1982

తిరుపతి స్టడీ సర్కిల్

161, వేశాలమ్మగుడి వీధి, తిరుపతి – 517 501.

(VIJAYA ADS, TPT)

# వింత ప్రపంచం

## వైవాహిక స్వాతంత్ర్యం

మణిపూర్‌లో 'మెయిటీ' గిరిజన జాతికి చెందిన యువతీ యువకులు తల్లిదండ్రుల అనుమతితో నిమిత్తం లేకుండా స్వతంత్రించి తమ పెళ్ళి తామే చేసుకుంటారు. అక్కడి ప్రేయసీప్రియులు తమ పెళ్ళికి తల్లిదండ్రులు ఒప్పుకోకపోతే, వారికి తెలీకుండా ఓ రహస్య ప్రదేశానికి జంటగా వెళ్ళిపోతారు. అక్కడ తమ స్నేహితులు, శ్రేయోభిలాషుల సహకారంతో రహస్యంగా పెళ్ళి చేసుకుంటారు. ఆ తర్వాత స్నేహితులు ఆ సమాచారాన్ని వారి తల్లిదండ్రులు, బంధువులకి చేరవేస్తారు.

ఆ వార్త తెలిశాక యువకుడి తండ్రి, బంధువుల్లో కొందరు పెద్దమనుషుల్ని వెంటబెట్టుకుని యువతి తల్లిదండ్రులతో మాట్లాడేందుకు వెళతాడు. ఈ ఆచారాన్ని 'హైదోక్పా' అంటారు. యువతి తల్లి, బంధువులు ప్రేయసీప్రియుల జంట దాక్కున్న రహస్యప్రదేశానికి వెడతారు. అలా వెళ్ళడం ముఖ్యంగా, తమ పిల్ల తన ఇష్టప్రకారం ప్రియుడితో వెళ్ళిందా లేక అతని బలవంతంపైనా అన్నది తెలుసుకునేందుకు! సాధారణంగా ఆమె తనంతట తనే అతనితో వచ్చినట్టు చెబుతుంది. అప్పుడా యువతితల్లి అందరితోనూ, "నా కూతురిని ఎవరూ అపహరించుకుపోలేదు. ఆమె తనకు తానుగా ఇంట్లోంచి వెళ్ళిపోయింది" అని ప్రకటిస్తుంది. ఈ ఆచారాన్ని 'మచిన్‌హంగ్‌బా' అంటారు. ఆ ప్రకటన తర్వాత ప్రేయసీప్రియులిద్దరి తల్లిదండ్రులూ, బంధువులూ కలిసి సమావేశమై, పెళ్ళికి శుభముహూర్తం పెట్టేందుకు జ్యోతిష్కుడిని పిలుస్తారు. ఆ విధంగా పెళ్ళి నిశ్చయించబడ్డాక ప్రేయసీప్రియులు విడిపోయి ఎవరిళ్ళకు వాళ్ళు వెళతారు. తర్వాత వారి పెళ్ళి మామూలు ఆచారాల ప్రకారమే జరుగుతుంది.

కాని తమ పిల్ల అలా ప్రియుడి వెంట వెళ్ళిపోవడం నచ్చని కొందరు తల్లిదండ్రులు, తమ కూతురు కనబడటం లేదని పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేస్తారు. పోలీసులు ఎంతో కష్టపడి ఆ యువతి ఆచూకీ సంపాదిస్తారు. అయితే, సాధారణంగా ఆమె ఇష్టపూర్వకంగా ప్రియుడితో కలిసి వెళ్తుంది గనక, ఆమెకు ఆ ప్రియుడితోనే పెళ్ళి జరిపేందుకు చివరికి పోలీసులే తల్లిదండ్రుల్ని ఒప్పిస్తారు.

పోలీసులకి దొరికిపోయినపుడు,

ఒక్కోసారి, కొందరు యువతులు తల్లిదండ్రులకు భయపడి తనను ప్రియుడే అపహరించుకుపోయినట్టు అబద్ధమాడేస్తారు. ఆ విధంగా తల్లిదండ్రుల దగ్గరికి వచ్చేసినా, తిరిగి ప్రేమకలాపాలు సాగించి, మళ్ళీ ప్రియుడి వెంట వెళ్ళిపోతారు.

అలా ఎవరయినా యువతి రెండుకంటే ఎక్కువసార్లు ప్రియుడితో కలిసి వెళ్ళిపోతే, తల్లిదండ్రులు ఆమెకు పెళ్ళిచేసే హక్కును కోల్పోతారు. అప్పుడు పెళ్ళితంతు మొత్తం ఆ యువతి ప్రియుడు, అతని తల్లిదండ్రులు, బంధువులే నిర్వహిస్తారు. అలాంటపుడు పెళ్ళికూతురి తల్లిదండ్రుల్ని కనీసం పెళ్ళిచూసేందుకు కూడా అనుమతించరు. కావాలంటే వాళ్ళు తమ తరఫున ఒకరిని ఆ పెళ్ళికి పంపించవచ్చు.

యువతికి ఓ బిడ్డ కలిగాక అల్లుడూ, అత్తమామలమధ్య సత్సంబంధాలు నెలకొంటాయి! ఆ సందర్భంలో అల్లుడు అత్తమామలను మంచిచేసుకునే ప్రయత్నాలన్నీ చేస్తాడు. ఆ విధంగా అత్తమామలు అల్లుడిపట్ల ప్రసన్నులయాక 'లౌకోట్పా' అనేవేడుక జరిపి కూతురు,అల్లుళ్ళకు అనేక బహుమానాలిచ్చి పంపుతారు.

మణిపూర్‌లో ఘనంగా జరిపే ఉత్సవాల్లో 'యూసంగ్' ఒకటి. అది మన వసంతోత్సవంలా వుంటుంది. దాదాపు ఓ మాసం పాటు జరిగే ఆ ఉత్సవ సమయంలో యువతీ యువకులు చేతులు కలుపుకుని మద్దెల చప్పుడుకనుగుణంగా నాట్యం చేస్తారు. అలా వారిమధ్య ప్రేమ మొదలవుతుంది. ఆ విధంగా యూసంగ్ ఉత్సవ కాలంలోనే ఎక్కువ పెళ్ళిళ్లు జరుగుతాయి!





## ప్రేక్షకులకు పరీక్ష!

లాస్ ఏంజెల్స్‌లోని హాలీవుడ్‌లోగల ఓ మ్యూజియమ్ అమెరికన్లనేగాక, అనేక మంది విదేశీయులను సైతం చాలా ఏళ్లుగా ఆకర్షిస్తోంది. విశేషమేమంటే అమెరికాలోని ఆ మ్యూజియమ్ స్పూనీసింగ్ అనే భారతీయుడు నెలకొల్పింది కావటం! దాని పేరు హాలీవుడ్ వాక్స్ మ్యూజియమ్.

కొందరు సినీ ప్రేక్షకుల్లో అభిమాన తారలను చూడాలనే వెర్రి ఎంత సహజమో, అమెరికా వెళ్లిన చాలామంది పర్యాటకులకి సినిమా స్టూడియోలను సందర్శించి, వీలైతే తమ అభిమాన హాలీవుడ్ తారలను చూసి తరించాలను కునే పిచ్చి అంత సహజం. కాని చాలా మందికి అది తీరే అవకాశం వుండదు. ఆ విషయంలో ఎక్కువమందికి ఆశాభంగం కలుగుతుంది.

అలాంటివారికి ఓదార్పుగా స్పూనీసింగ్ ఈ హాలీవుడ్ వాక్స్ మ్యూజియమ్ నెలకొల్పాడు. అందులో మైనంతో చేసిన ప్రసిద్ధ హాలీవుడ్ తారలు, టెలివిజన్ తారలు, రాజకీయనాయకుల ప్రతిరూపాలు వుంటాయి. అవి చూసినవారు 'నిజంగా మనుషులేమో!' అని భ్రమపడేంత జీవ కళతో వుంటాయి. ఆ విధంగా ఆ మ్యూజియమ్‌లో ప్రపంచంలోని 50మంది గొప్ప నటుల ప్రతిరూపాలు వున్నాయి. దేశభక్తిగల స్పూనీసింగ్ 'మహాత్మాగాంధీ' ప్రతిరూపాన్ని కూడా మైనంతో తయారు చేయించి అక్కడ ప్రదర్శిస్తున్నాడు.

ఆ మ్యూజియంలో విశేషాకర్షణ గల మరొకటి 'హారర్ ఛాంబర్'. అందులో భయానక చిత్రాల్లోని కొన్ని భయంకర దృశ్యాలు మైనంతో మలచబడి వుంటాయి.

స్పూనీసింగ్ తండ్రి సర్దార్ కర్తార్ సింగ్. జలంధర్‌లో ఓ వ్యవసాయదారుల కుటుంబానికి చెందిన ఆయన, 1926లో తన నాలుగేళ్ళ కొడుకు స్పూనీసింగ్‌తో

కెనడాకు వలసపోయి, అక్కడో కొయ్య పరిశ్రమ ప్రారంభించాడు. ఆ వ్యాపారం వృద్ధి చెందటంతో స్వానీసింగ్ పాఠశాల చదువు ముగియగానే తండ్రికి తోడుగా వ్యాపారంలోకి దిగాడు. ఆ సమయంలోనే ఓసారి స్వానీసింగ్ హాలీవుడ్ వెళ్ళడం, అక్కడ తమ కిష్టమైన తారలను చూడలేకపోయిన అభిమానుల మొహాల్లో ఆశాభంగాన్ని గమనించటం జరిగింది.

దాంతో స్వానీసింగ్‌కి 'వాక్స్ మ్యూజియమ్' పెట్టాలనే ఆలోచనకలిగి 1965లో దాన్ని ప్రారంభించాడు.దానిలో ప్రవేశానికి 5 డాలర్ల రుసుము పెట్టాడు. మైనంతో ప్రతిరూపాలు తయారు చేయడంలో స్వానీసింగ్‌కి ఎలాంటి ప్రవేశమూలేదు. అతను ఏయే ప్రముఖుల ప్రతిరూపాలు చేయించాలనుకుంటాడో వారి ఫొటోలు వివిధ భంగిమలలోనివి సేకరిస్తాడు. తర్వాత కొందరు శిల్పులకి అవసరమైన సూచనలిచ్చి ప్రతిరూపాలు తయారు చేయిస్తాడు. తర్వాత ఆయా ప్రముఖులను తన మ్యూజియమ్‌కి ఆహ్వానించి, ప్రతిరూపాల పక్కన నిలబడమనికోరి అసలు ఎవరో, బొమ్మ ఏదో కనుక్కోమని ప్రేక్షకులకి పరీక్ష పెడతాడు. ఆ మ్యూజియమ్‌కి సంబంధించిన కార్యక్రమాలు కొన్ని టెలివిజన్‌లో ప్రసారమై స్వానీసింగ్‌కి మంచి పేరు తెచ్చిపెట్టాయి!

## సూక్ష్మ చిత్రకళ

**50** ఏళ్ళ నంజప్ప అందరిలాంటి చిత్రకారుడుకాదు. అతను ఒకేఒక బియ్యపు గింజపై 4160 పదాలు రాసి ప్రపంచ రికార్డు సృష్టించాడు. కేవలం అక్షరాలే కాకుండా ప్రపంచ ప్రసిద్ధులైనవారి ముఖాలు, పక్షులు, ప్రకృతి దృశ్యాలను బియ్యపు గింజలపై చిత్రించడం అతనికి అలవాటు. బియ్యపుగింజపైనేకాక నువ్వు గింజ, ఆవగింజలపై సైతం బొమ్మలు వేస్తుంటాడతను.

నంజప్ప బెంగుళూరులో హిందూస్తాన్ ఏరోనాటిక్స్ సంస్థలో ఇంజనీరుగా ఉద్యోగం చేస్తున్నాడు. తమ సంస్థ రూపొందించిన వివిధ రకాల వాయు విమానాలను బియ్యపు గింజలపై చిత్రించాడతను. వాటిని ఆ సంస్థవారే అనేక ఎగ్జిబిషన్‌లలో ప్రదర్శింపజేశారు. అవి ఎన్నో బహుమతులను గెలుచుకున్నాయి కూడా.

నంజప్ప ఓ వెంట్రుకను నలభై చీలికలు చేయడం ద్వారా మరో ప్రపంచ రికార్డు సృష్టించాడు. "ఈ అద్భుతాల్ని ఎలా సాధించగలిగారు?" అనడిగితే, "కృషి, పట్టుదల వల్లనే అవి సాధ్యమయ్యాయి" అంటాడు నంజప్ప.

నంజప్ప ఓ బియ్యపు గింజపై 'టెన్ కమాండ్‌మెంట్స్'రాస్తే, ఓ ఆస్ట్రేలియన్ దాన్ని కొనుక్కుని భద్రపరుచుకున్నాడు. నంజప్ప ఇంకా బియ్యపు గింజలపై ప్రపంచ పటం, తాజ్‌మహల్, లిబర్టీ విగ్రహం,పిరమిడ్లను చిత్రించి సంచలనం సృష్టించాడు. నంజప్ప కళానైపుణ్యం చూసి ముగ్ధుడయిన ఓ అమెరికన్ తమ దేశమంతటా ఆ సూక్ష్మ చిత్రకళా ప్రదర్శనను ఏర్పాటుచేశాడు.

నంజప్ప తన చిత్రకళకు సొంతంగా తయారుచేసిన ఓ ప్రత్యేకమైన డ్రాయింగ్ పెన్‌నిఉపయోగిస్తాడు.విశేషమేమిటంటే- కొన్ని మాసాల క్రితం వరకూ నంజప్పకు కళ్ళజోడు పెట్టుకునే అవసరమే రాలేదు.

# ప్రచార మార్గం

నాలుగేళ్ళకోసారి జరిగే ఒలింపిక్స్‌లో పరుగుపందెంకూడా ప్రధానమైనపోటీయే. దీనికి మూలమైన అసలు పరుగుపందాలు కొన్ని శతాబ్దాలక్రితం గ్రీకులో ప్రారంభ మయ్యాయి. వాటిలో పాల్గొనేవాళ్లు గ్రీకు నుంచి ఏథెన్సుకు మధ్యగల 24 మైళ్ళ దూరాన్ని పరుగెత్తవలసివుండేది.

1908లో లండన్‌లో ఒలింపిక్స్ నిర్వహించినపుడు, పరుగుపందెం మహారాణి నివాసం వరకూ జరిపే వుద్దేశంతో ఈ దూరాన్ని 26 మైళ్ళ 385 అడుగులకి పెంచారు. అంతర్జాతీయంగా జరిగే ఈ పందెంకాక, అగ్ర రాజ్యాలు కొన్ని తమ దేశాల్లో జాతీయ పరుగు పందాలు నిర్వహిస్తున్నాయి. అమెరికా, రష్యా, బ్రిటన్‌లు ప్రతి ఏటా ఎంతో ప్రతిష్టాకరంగా పరుగుపందాలు నిర్వహిస్తున్నాయి. అందులో కూడా దూరం 26 మైళ్ళ 385 అడుగులే.

1985లోన్యూయార్క్‌లో ఆవిధంగా జరిగిన పరుగుపందెంలో 14వేలమంది పాల్గొనడం ఓరికార్డే. ఇంగ్లండ్‌లో జరిగిన పరుగుపందెంలో 7 వేలమంది పాల్గొన్నారు. ఈ పందాలలో ఎవరైనా పాల్గొనే అవకాశముంది. దాంతో వీటిలో మామూలుగా పాల్గొనే క్రీడాకారులేకాక సరదాగా పాల్గొన్న ఇతరులు చాలామంది వున్నారు. నిబంధనల ప్రకారం ఈ పరుగుపందెంలో మొత్తం దూరం పరుగెత్తడానికి 2గంటల పది నిముషాలకన్నా ఎక్కువ తీసుకోకూడదు. కాని చాలామందికి 5గంటల దాకా పట్టింది. కారణం వారు గెలుపు కోసం కాక, కేవలం వినోదంకోసమే ఇందులో పాల్గొన్నారుగనుక.

లండన్‌లో జరిగే పరుగుపందెంలో పాల్గొనేవారికి ఓపీలుంది. అక్కడ పందెం జరిగే మార్గమైన గ్రీన్‌విచ్ పార్కునుంచి డెమాల్‌కి మధ్యలో అనేక ఆస్పత్రులున్నాయి. పందెంలో పాల్గొంటున్న ఎవరికైనా ప్రమాదం జరిగితే వారికి శీఘ్రంగా ఆ ఆస్పత్రులలో వైద్య సహాయం లభిస్తుంది.



సాధారణంగా ఒలింపిక్స్‌లో జరిగే పరుగుపందాల్లో పాల్గొనేవారు జాతీయ స్థాయిలో జరిగే ఈ పోటీల్లో పాల్గొనరు. స్త్రీలలో బ్రిటన్‌కి చెందిన జాయిస్ స్మిత్‌కి అతివేగంగా పరుగెత్తగలదనే పేరుంది. వివిధ దేశాలలో ఏటేటా జరిపే పరుగుపందాలు అనవసరమని జాయిస్, మరికొందరు పేరుపొందిన క్రీడాకారులు భావిస్తున్నారు. వారి అభిప్రాయమేమిటంటే-ఈ పోటీలు ఒలింపిక్స్‌లో జరిగే పరుగుపందాలను అపహాస్యంచేయడానికి జరుపుతున్నారని.

లండన్‌లో వెస్లీవాట్సన్ అనే 32 ఏళ్ళ మహిళ 50 వివిధ పరుగు పందాలలో పాల్గొన్నది. ఆమె స్త్రీలకోసం లండన్‌లో ఫిజియోథెరపీ క్లినిక్ నడుపుతోంది. ఆమె పరుగుపందాలలో పాల్గొనడం బహుమతులు గెలుచుకోవడానికి కాదు. కేవలం ప్రచారంకోసం. ఆవిధంగా కస్టమర్లను ఆకర్షించుకోవడానికి. పందెంలో పరుగెత్తేటపుడు నగ్నంగా కనబడే ఆమె అందమైన కాళ్లు చూడటం కోసం జనం విరగబడతారు. వాటిని మరింత అందంగా ప్రదర్శించేందుకు ఆమె ఎలాంటి శ్రమకైనా సిద్ధమవుతుంది.

## వీర హనుమాన్

ఆరడుగుల రెండంగుళాల ఎత్తు, 105 కిలోల బరువుండే ప్రముఖ మల్లయోధుడు దారాసింగ్ 58 ఏళ్ల వయసులో కూడా మంచి శరీర దారుఢ్యంతో, చెక్కుచెదరని ఆరోగ్యంతో వుంటాడు. జుత్తు కొద్దిగా నెరిసినా అతని ముఖంలో యవ్వనపు కాంతి ఇంకా తరగలేదు.

దారాసింగ్ చిన్నతనంలో బడికి సరిగ్గా వెళ్ళేవాడుకాదు. ఎక్కువకాలం సింగపూర్‌లో వుంటుండే అతని తండ్రి, బుద్ధిగా చదువుకోమని లేఖలు రాసేవాడు. కాని, దారాసింగ్ తల్లి, బామ్మలకు అతను బడికెళ్ళడం ఇష్టం ఉండేదికాదు. చివరికి వాళ్ళు అతను పంజాబీ భాష మాత్రమే నేర్చుకునేందుకు అనుమతించారు.

దారాసింగ్ స్వగ్రామమైన పంజాబ్‌లోని దాముకక్‌లో పండుగల తరుణంలో మల్లయుద్ధ పోటీలు నిర్వహింపబడేవి. అవి చూసి చూసి క్రమంగా దారాసింగ్ మల్లయుద్ధంపై ఆసక్తి పెంచుకున్నాడు. దాంతో, తండ్రి సింగపూర్ పిలిచినా కాదని హర్‌నామ్‌సింగ్ అనే మల్లయోధుడి వద్ద శిష్యుడిగా చేరాడు.

ప్రతిరోజూ తెల్లవారుజామున 4 గంటలకు దారాసింగ్ నిద్రమేల్కొని పొద్దున్న 7 గంటల వరకూ శారీరక వ్యాయామం చేస్తాడు. ఆ తర్వాత ఫలహారంగా బాదంపప్పు, పాలు సేవించి తిరిగి 11 గంటలదాకా వ్యాయామం చేస్తాడు. మధ్యాహ్నం 12 నుంచి 3 గంటలవరకూ నిద్రపోతాడు. నిద్రనుంచి మేల్కొన్నాక మూడు గంటలసేపు మల్లయుద్ధం ప్రాక్టీసు చేస్తాడు. యోగాసనాలు కూడా చేసే దారాసింగ్ "ఇవి మల్లయుద్ధానికి ప్రత్యక్షంగా ఉపయోగపడకపోయినా శరీరాకృతి చక్కగా వుండేందుకు ఉపకరిస్తాయి" అంటాడు. అతను ధూమపానం చేయడు. మద్యం ఎప్పుడైనా అరుదుగా సేవిస్తాడు.

"ఒకప్పుడు మల్లయుద్ధంలో భారత దేశం ప్రపంచంలోనే ప్రథమస్థానంలో వుండేది. కాని ఇప్పుడా స్థాయిని కోల్పోయింది. నేను ఇందులో ప్రవేశించిన



కొత్తలో ఒలింపిక్ క్రీడలు, ఒలింపిక్స్‌లానే 4 ఏళ్ళకోసారి కామన్‌వెల్తు దేశ క్రీడాకారులమధ్య జరిగే కామన్‌వెల్తు గేమ్స్‌లోనూ మల్లయుద్ధాన్ని చేర్చలేదు. మనదేశంలో మల్లయుద్ధం ఇసుక మైదానం, నేలలపైనే జరుగుతుంది. కాని పాశ్చాత్యదేశాల్లో అయితే చాపలపై మల్లయుద్ధ పోటీలు జరుగుతాయి. ఆ చాపలు చాలా ఖరీదైనవి కావడంతో మన దేశపు మల్లులు పోటీకి ముందు ఒక నెల మాత్రమే వాటిపై అభ్యాసం చేస్తారు. ఆవిధంగా సరైన ప్రోత్సాహంలేక మన దేశంలో మల్లులు వెనకబడి వున్నారు" అని చెబుతున్నాడు దారాసింగ్.

1962లో దారాసింగ్ నటించిన 'కింగ్‌కాంగ్' చిత్రం బాగా నడవడంతో అతను సినీ రంగంలోనే స్థిరపడి పోయాడు. పంజాబీ, హిందీ భాషల్లో చెరి నాలుగు సినిమాలు నిర్మించాడు. దారాసింగ్ అనుకోకుండా దర్శకుడిగా కూడా మారాడు. అతను ఓ పంజాబీ సినిమాలో మొదటగా నటిస్తున్నపుడు నిర్మాతతో అభిప్రాయభేదంవచ్చి దర్శకుడు సినిమాను మధ్యలోనే విరమించు కున్నాడు. అపుడా నిర్మాత దారాసింగ్‌నే చిత్రానికి దర్శకత్వం వహించమన్నాడు. అతను దాన్ని ఓ సవాలుగా స్వీకరించి చిత్రాన్ని పూర్తిచేశాడు. అదృష్టవశాత్తూ సినిమా బాగా నడిచి దారాసింగ్‌కి మంచి పేరు తెచ్చిపెట్టింది.

దిలీప్‌కుమార్ అంతటి నటుడు కోరి మరీ తన సినిమాలు చూడటం తనకో గర్వకారణమంటాడు దారాసింగ్. ప్రస్తుతం అతను 'హనుమాన్' అనే త్రీడి సినిమాలో హనుమంతుడిగా నటిస్తు

న్నాడు.

దారాసింగ్‌కి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. అతని కుమారుల్లో ఎవరికీ మల్లయుద్ధంపై ఆసక్తిలేదు. "నేను సినిమాల్లో నటించడం నా భార్యకిష్టంలేదు.

ఎదుకంటే వాటిలో నేను పరాయి స్త్రీలతో సన్నిహితంగా నటించడం ఆమెకు నచ్చదు గనుక" అంటాడు దారాసింగ్.

## అతని రికార్డు

**త**మిళనాడులోని పెరియార్ జిల్లాలో సత్యమంగలం పట్టణానికి చెందిన 21 ఏళ్ళ రవికి రికార్డులు సృష్టించడం ఓ సరదా! ఆ ఉత్సాహమే చివరికి అతని పేరు గిన్నెస్‌బుక్‌లోకి ఎక్కేట్టు చేసింది.

రవి మొట్టమొదటగా ఒక్క చెవిని మాత్రమే 25 నిముషాలపాటు కదిలించే ప్రదర్శన చేశాడు. దానికి అవసరమైన ఏర్పాట్లకై అతను కొన్ని స్థానిక క్లబ్బుల సహకారాన్ని అర్థిస్తే, వాళ్ళు హేళనగా నవ్వేశారు. అయినా రవి నిరాశపడకుండా తనంతట తనే ఆ ఏర్పాట్లు చేసుకుని చెవిని కదిలించే ప్రదర్శన చేసి మెప్పుపొందాడు. తర్వాత రవి మరుదమలైలోని సుబ్రమణ్యస్వామి ఆలయానికి గల 1,500 మెట్లను ఒంటి కాలుతో అధిరోహించాడు.

గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ ప్రకారం అంతకుముందు శ్రీలంకకు చెందిన ఆనందన్ ఒంటికాలిపై 33 గంటలపాటు నిలబడి ప్రపంచ రికార్డు సృష్టించాడు. ఆ రికార్డుని అధిగమించడం లక్ష్యంగా పెట్టు



కున్నాడు రవి. ఎక్కువసేపు నిలబడి వుండే అలవాటు కోసం అతను బంధు వైన గోవిందస్వామి బెల్లపు దుకాణంలో ఆరు నెలలు పని చేశాడు. అక్కడ రోజూ 10 గంటలపాటు కాసేపు కూడా కూర్చోకుండా, నిలబడే పనులన్నీ చేసే వాడు. అంతేకాక ప్రతిరోజూ ఉదయం రెండున్నర కిలోమీటర్ల దూరం పరుగు తీసేవాడు.

1982 ఏప్రిల్ 17న రవి తెల్లవారు జామున 3 గంటలకి నిద్రనుంచి మేల్కొన్నాడు. తనవారికెవరికీ చెప్పకుండానే తయారై 4 గంటలకల్లా ఇంట్లోంచి బైటపడి ఇద్దరు స్నేహితుల్ని కలుసుకున్నాడు. వారిని తోడుగా వుంచుకుని 5 గంటలనుంచీ ఎడమ కాలిమీద నిలబడ్డాడు రవి.

ఉదయం ఆరు గంటలు అయ్యేసరికి దారినపోయేవాళ్ళు ఒంటికాలిమీద నిలబడ్డ రవిని వింతగా పరికించి వెళ్ళసాగారు. 9 గంటలకి రవి స్నేహితులు మరి కొందరు వచ్చి ఓ గుడారం వేసి నీడ కల్పించారు. అతని మెడలో పూలదండలు వేసి, అతను సాధించబోతున్న ఘన కార్యం ఏమిటో తెలిపే ఓ బోర్డు అక్కడ పెట్టారు. తన దగ్గరున్న 10రూపాయలతో స్నేహితులకి టీ తెప్పించాడు రవి. తన తాతగారు పంపిన బిస్కెట్ల పాకెట్టుని కూడా తను తింటే జీర్ణమవుతాయో లేదోనని స్నేహితులకు పంచేశాడు. ఒంటికాలిమీద నిలబడ్డ 34 గంటలసేపూ కేవలం సోడా, రోజ్‌మిల్క్ మాత్రమే తాగాడు.

రాత్రిపూట గుడారంలో పెట్రోమాక్సు లైటుని ఏర్పాటు చేశారు రవి స్నేహితులు. అతను నిద్రపోకుండా వుండటానికి టేప్‌రికార్డర్‌తో సంగీతం విన్పిస్తూ, ఆడుతూ పాడుతూ రాత్రంతా కాలక్షేపం చేశారా మిత్రులు. ఏప్రిల్ 18వ తేదీ మధ్యాహ్నం 3 గంటలకి రవి నెలకొల్పదలచిన రికార్డుకి వ్యవధి పూర్తయింది. గిన్నెస్‌బుక్ నిబంధనల ప్రకారం రవి గంటకోసారి 5 నిముషాల పాటు విరామం తీసుకునే అవకాశముంది. కాని, అలా చేస్తే బ్యాలెన్సు పోతుందేమోననే సందేహంతో రవి దాన్ని వినియోగించుకోలేదు. ఆ విధంగా రవి 34 గంటల సేపు ఒంటికాలిపై నిలబడి రికార్డు నెలకొల్పిన తర్వాత స్నేహితులు మహోత్సాహంతో అతన్ని వూరేగించారు.

రవి తన రికార్డు గురించి గిన్నెస్‌బుక్ సంపాదకుడికి తెలియపరిచాడు. అతని పేరు 1986లో వెలువడే గిన్నెస్ బుక్‌లో చేర్చబడుతుందని సంపాదకుడి నుంచి బదులు వచ్చింది.

# కృషి ఫలితం

ఇటీవలి కాలంలో ఓ మంచి చిత్రంగా అనేక ప్రశంసలు పొందిన 'పార్' చిత్రం చూసినవారికి అందులో ఎప్పటికీ మర్చిపోలేని దృశ్యం ఒకటివుంది. అది బీహార్‌లోని ఓ గ్రామానికి చెందిన నౌరంగియా, రమ అనే హరిజన దంపతులు తమ ప్రాణాల్ని సైతం లెక్కచేయకుండా 36 పందులను గంగానది దాటించడం. వారాపని చేసేది కేవలం 22 రూపాయల కూలికోసం. బతుకుతెరువుకై కొందరి దుర్భరమైన పోరాటం ఎలా వుంటుందో కళ్ళకు కట్టినట్టు చూపిస్తుందాదృశ్యం!

ఆ దృశ్యానికి అవసరమైన పందుల్ని సంపాదించడం చాలా కష్టమైందిట! అవి



దొరకకపోతే ఆ సినిమా నిర్మాణమే ఆగిపోయేది. పందుల్ని నదిని దాటించే దృశ్యం చిత్రీకరించడం సాధ్యంకాకపోతే ఆ సినిమా తీయడమే పూర్తిగా మానుకోవాలని ఆ చిత్ర దర్శకుడు గౌతమ్ ఘోష్ నిశ్చయించుకున్నాడు కూడా. ఆ వుద్దేశంలోవున్న గౌతమ్‌ఘోష్‌కి మొదట తెలిసినదేమంటే, సినిమాలో కథాస్థలమైన కలకత్తావున్న పశ్చిమబెంగాల్‌లో పందులు నదిలో ఈదలేవని. అతను ఈ సమస్యని కథారచయిత సమరేశ్ బసు ముందుంచాడు. బసు పందుల్ని అమ్మే ఓ మనిషిని అడిగితే- బంగ్లాదేశ్ నుంచి ఈతకొట్టగల పందుల్ని రప్పిస్తానని, దానికి 40 వేల రూపాయలవుతుందని చెప్పాడు. వీరికా మొత్తం చాలా ఎక్కువగా తోచింది.

అంతలో మరో వ్యక్తి 4 వేల రూపాయలిస్తే అయిదురోజులపాటు షూటింగ్ జరుపుకునేందుకు పందుల్ని ఇప్పిస్తానని చెప్పి బంగ్లాదేశ్ సరిహద్దు ప్రాంతంనుంచి వాటిని తెచ్చాడు. పందులతో కూడిన ఆ దృశ్యం చిత్రీకరించడం సాధ్యమవుతుందో, లేదోననే అనుమానంతో సినిమాలో అది చివరి దృశ్యమైనా దాని చిత్రీకరణ మాత్రం ముందే జరిపారు. సినిమాలో పాత్రధారులైన షబానా ఆజ్మీ, నసీరుద్దీన్‌షాలు పిలిస్తే మొదట్లో పందులు పట్టించుకునేవికావు. అప్పుడు వాటిని పెంచిన 110 ఏళ్ళ వృద్ధుడిచేత వాటికి కొంత తర్ఫీదు ఇప్పించారు. ఆ వృద్ధుడు పిలవగానే పందులు నది దగ్గరికి పరుగెత్తుకొచ్చేవి. అతను పిలిచే పద్ధతినే నసీరుద్దీన్, షబానాలు అలవాటు చేసుకున్నారు. ఆ విధంగా పందులు ఆ నటీనటుల మాటవిని చిత్రంలోని దృశ్యాలు సహజంగా వచ్చేందుకు సహకరించాయి. షూటింగ్ జరుగుతుండగా 36 పందుల్లో ఒకటి చచ్చిపోతే దానికి నష్టపరిహారం చెల్లించారు.

ఇలా ఎంతో శ్రమకోర్చి 'పార్'ని ఓ అసాధారణ చిత్రంగా మలిచాడు గౌతమ్‌ఘోష్. చిత్రంలో సన్నగా కనబడటం కోసం షబానా, నసీరుద్దీన్‌షాలు షూటింగ్‌కి ముందు మూడు నెలలపాటు ఉపవాసాల్లాంటివి చేసి చిక్కిపోయారు. నసీరుద్దీన్‌షా నల్లబడటానికి వంటికి నూనె పట్టించి రోజుకి రెండుగంటలపాటు ఎండలో గడిపేవాడు. అదీ సినిమా కోసమే!

*

## మీరు చదివారా?

### ప్రఖ్యాత రచయిత కొమ్మూరి వేణుగోపాలరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| విరాజి | 20.00 | విషవలయం | 20.00 |
| గుప్పెడు వెలుగు | 30.00 | ప్రేమకాంతి | 20.00 |
| తోడూ–జోడూ | 20.00 | డాక్టరుగారి భార్య | 20.00 |
| ఆత్మజ్యోతి | 25.00 | మేడలో నీడలు | 16.00 |
| జాలిలేని జాబిలి | 12.50 | హారతి | 14.00 |
| వ్యక్తిత్వం లేని మనిషి | 18.00 | | |
| ఒకే పాటకు రెండు రాగాలు | 15.00 | | |

**డీలక్స్ పబ్లికేషన్స్**

**విజయవాడ-520 002**

వ్యవసాయదారుల
సచిత్ర మాస పత్రిక

# అన్నదాత

సాలు చందా రు:24/- మాత్రమే

అన్నదాత, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్-500004.



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

